సూర్యనారాయణీయ గ్రంథమాల కుసుమము ౧౨

# దక్షిణాఫ్రికా సత్యాగ్రహము

## ప్రథమ భాగము

మహాత్మ గాంధీ

అనువాదకులు:
శ్రీ గొల్లపూడి సీతారామశాస్త్రి



ప్రకాశకులు:
ఆంధ్రగీర్వాణ విద్యాపీఠము
పశ్చిమగోదావరి జిల్లా,
కొవ్వూరు.
1940

 [ వెల ౦-౮-౦

# తొలిపలుకు

'దక్షిణాఫ్రికా సత్యాగ్రహము'ను గుజరాతీభాషలో మహాత్మాజీ వ్రాసిరి. దీనిని ఆంగ్లములోనికి తర్జుమా చేసిరి. ఆంగ్లగ్రంథమును స్నేహితులకు చదివి వినిపించుచుండగా ఆంధ్రములోనికి తర్జుమా చేయవలెనను బుద్ధిపుట్టెను.

కారాగృహసహవాసియు, సౌమ్యమూర్తియు నగు తమిళసోదరుడు సుబ్బరామన్‌గారి సుహృద్భావము వలన యీ యవకాశము దొరకెను. అనువాదమును నేను చెప్పుచుండగా చిరకాలమిత్రుడగు శ్రీయుత రామినేని అప్పయ్యగారు వ్రాయుచుండిరి. ముప్పాతికవరక గ్రంథమును ఆయనయే వ్రాసిరి. సహాధ్యాయి, స్నేహితుడు అగు శ్రీమాన్ మాడభూషి వేదాంత నరసింహాచార్యులుగారు యీ గ్రంథమునంతయు పరిశీలించి, యవసరమైన మార్పులను చేయుటయేగాక, మహాత్మాజీ రచియించిన యుపోద్ఘాతమును తర్జుమా చేసిరి. వీరల కందరకును కృతజ్ఞతాపూర్వకవందనము లర్పించుచున్నాడను.

శ్రీయుత దిగవల్లి శివరావుగారు వ్రాసినది 'దక్షిణా[illegible]' యను ౨౦౦ పుటలుగల స్వతంత్రమైన చరిత్ర గ్రంథము. ఈ 'దక్షిణాఫ్రికా సత్యాగ్రహము' మహాత్మాజీ గ్రంథమున కనువాదము. ఇది సత్యాగ్రహపురాణము.

అమూల్యమైన తమ గ్రంథమును తర్జుమా చేయుటకు మహాత్మాజీ దయతో ననుమతి నొసంగిరి. వారి కార్యదర్శి శ్రీయుత మహదేవ దేశాయిగారు ౨౦—౧—33 వ తేదీన వ్రాసిన లేఖలో యీపుస్తకమునుండి వచ్చెడి లాభమును హరిజనసేవ కుపయోగించుట మహాత్మాజీ యాదేశ మని తెలియజేసిరి. ఆయాజ్ఞను శిరసావహించు చున్నాను.

ఈ గ్రంథమును జనసామాన్యముగూడ తెలిసికొనుటకై సులభశైలిలో వ్రాసితిని.

కొవ్వూరు
ఫాల్గుణ శు ౧ జయవారము
౨౫—౨—33

గొల్లపూడి సీతారామశాస్త్రి



# ఉపోద్ఘాతము

( గుజరాతి చరిత్రకు )

దక్షిణాఫ్రికాలో భారతీయుల సత్యాగ్రహ పోరాటము యెనిమిది సంవత్సరములు పట్టెను. సత్యాగ్రహపదము ఆసందర్భములో సృష్టింపబడి, ఉపయోగింపబడెను. ఆ పోరాటపు చరిత్ర నేనే వ్రాయువలయునని చాలా కాలము వఱకు నాకు కుతూహలముండెను. కొన్ని విషయములు మాత్రమే నేనువ్రాయగలిగితిని. యుద్ధమును నడపు సేనానికి మాత్రమే ప్రతి యెత్తుగడయొక్క ఉద్దేశ్యము తెలుసును. సత్యాగ్రహ సూత్రమును రాజకీయమందు విరివిగా నుపయోగించిన ప్రథమ ప్రయత్న మిదియే గనుక, జనసామాన్యమునకు దీనియొక్క అభివృద్ధిని గురించి కొంత అభిప్రాయముండుట యెప్పటికైనను అవసరము.

కాని, ఈ రోజులలో, హిందూదేశమందు, సత్యాగ్రహము చాలా అవకాశమును పొందినది. ఇక్కడ "వీరంగం" సుంకవుపన్నులను స్థానికసమస్య మొదలు, తప్పనిసరియైన పోరాటముల పరంపరలు గలిగినవి.

వర్ధవాను కాపురస్థుడును, లోకోపకార పరాయణుడున్నూ, భాయిమోతీలాలు అను దర్జీ పెద్దమనిషి ద్వారా "వీరంగం" సమస్యయందు నాకు అభిరుచి కలిగెను.

1915 సంవత్సరములో నేను ఇంగ్లాండునుండి అప్పుడే తిరిగివచ్చి, కథియవాడు వెళ్లుచుంటిని. మూడవతరగతిలో ప్రయాణము చేయుచుంటిని. వర్ధవాను స్టేషనుయందు కొంతమందిలో మోతీలాలు నాదగ్గరకు వచ్చెను. "వీరంగ" మందు జనసామాన్యము మీద ప్రయోగింపబడిన కష్టముల చరిత్ర నాకు కొంత తెలియజేసి యిట్లు చెప్పెను. "ఈ బాధ పోవుటకు దయచేసి కొంతపని చేయుము. నీ జన్మభూమి యగు "కథియవాడు" కు గొప్పసేవ చేసినట్లగును."

ఆయన కనులలో దాక్షిణ్యా, స్థైర్యములు వ్యక్తీకరింపబడెను.

"జైలుకు పోవుటకు నీవు సిద్ధముగ నున్నావా" అని అడిగితిని. "ఉరిస్తంభముల నెక్కుటకు మేము సిద్ధముగా నున్నాము." అని వెంటనే జవాబు వచ్చెను.

"నాకు జైలు చాలును, కాని నన్ను మధ్య ముంచకుండా చూడు" అని నే నంటిని.

"కాలమే దానిని ఋజువు చేయుగలదు" అని మోతీలాలు చెప్పెను.

నేను రాజకోట చేరితిని. తప్సీలు సమాచారము సంపాదించి సర్కారుతో ఉత్తరప్రత్యుత్తరములు మొదలు పెట్టితిని. బక్సారా యందును, యితరత్రాయున్నూ, ఉపన్యాసములలో అవసరమైతే, ప్రజలు సత్యాగ్రహమునకు తయారుగా నుండ

వలె నని సూచించితిని. సర్కారువారికి, సి. ఐ. డి. వారు, ఈ సంగతి నెఱుకపఱచిరి. ఈ విషయములో వారు సర్కారు వారికి సేవచేయుటయేగాక, ఉద్దేశ్యములేకుండా, ప్రజాసేవ యున్నూ చేసిరి. చివరకు, నేను ఈ విషయములో చెల్మ్సఫర్డుప్రభువుతో మాట్లాడితిని. ఆయన సుంకపుసరిహద్దును రద్దుపరిచెదనని వాగ్దత్తము చేసెను. ఆయన తన మాట చెల్లించుకొనెను. దీనివిషయమై ఇతరులు కూడా ప్రయత్నించిరని నాకు తెలుసును. కాని, సత్యాగ్రహ సన్నాహ సామీప్యమే, కోరినఫలమును సంపాదించుటయందు, ప్రధానాంశమని నేను నొక్కి చెప్పగలను.

తర్వాత ఇండియన్ ఇమ్మిగ్రేషన్‌చట్టము వచ్చెను. కరారుపద్ధతి తీసివేయవలయునని విశ్వప్రయత్నములు చేయబడెను. గొప్ప ఆందోళనము జరిగెను. బొంబాయి మీటింగులో 31—5—1917 నుండి ఖరారు కూలీపద్ధతి ఆపుదల చేయవలయునని నిర్ణయించబడెను. ఆ తేదీ, ఎటుల నిర్ధారణ చేయబడెనో, వివరించుటకు, ఇది సమయము కాదు. ఈ సందర్భములో, ఒక స్త్రీలరాయబారము వైస్రాయిగారిని సందర్శించెను. ఈసందర్భమున ఆగొప్ప ఉదారవంతురాలగు సోదరి "జైజీపెటీలు" సతీమణి నామమును నేను చెప్పక వీలుపడదు. ఈరాయబారమును యేర్పాటు చేసినది ఆమెయే అని చెప్పవచ్చును. ఇక్కడకూడ సత్యాగ్రహమునకు తయారుగా నుండుటచే, విజయకారి ఆయెను. కాని ఈవిషయములో

ప్రజల ఆందోళనకూడ అవసరమనే భేదము, జ్ఞప్తియందుంచు కొనుట అవసరము. వీరంగం సుంకములు తీసివేయుటకంటె, ఖరారుకూలీ ఆపుదల జేయుటయే చాలా ముఖ్యమైనది. ఛల్మ్సుఫర్డుప్రభువు రౌలటు చట్టము ప్యాసుచేయుట మొదలు కొని తప్పుల పరంపర చేసెను. అయినను ఆయన వివేకముగల పరిపాలకుడనే తలచెదను. కాని ఏవైస్రాయి సివిలు సర్వీసు శాశ్వతయుద్యోగులయొక్క పలుకుబడిని తప్పించుకొనగలడు ?

వరుసలో మూడవది చంపరాను పోరాటము. దాని తప్సీలు చరిత్ర బాబురాజేంద్రప్రసాదు వ్రాసెను. ఇక్కడ సత్యాగ్రహము సాక్షాత్తుగా మొదలు పెట్టవలసి వచ్చెను. చంపరాను ప్రజలు చూపిన శాంతి గ్రంథస్థము చేయదగి యున్నది. మనోవాక్కాయకర్మలందు నాయకులు చూపిన సంపూర్ణదౌర్జన్యరాహిత్యమునకు నేను సాక్ష్యమీయగలను. గనుకనే తరతరములనుండి వచ్చిన ఈదోషము ఆరునెలలలో తుదముట్టెను.

నాల్గవపోరాటము అహమ్మదాబాదు మిల్లుపనివార లది. దాని చరిత్ర గుజరాతుకు పూర్తిగా పరిచయముగలదు. కార్మికులు ఎంతశాంతముగా నుండిరి! నాయకుల విషయ ములో నేను చెప్పవలసినదే లేదు. కాని ఈవిషయములో జయము అంత పవిత్రమైనదని తలచను. ఎందువల్లననగా కార్మికుల దృఢసంకల్పమునకు బలమొసంగుటకై నేను ఉపక్ర మించిన ఉపవాసము మిల్లుఖామందులమీాద పరోక్షముగా

వత్తిడి కలుగజేసెను. వారు నాకు స్నేహితులుగనుక, ఉప వాసము వారిని లోబడునట్లు జేసెను. అయినను ఆపోరా టముయొక్క నైతికఫలితము స్పష్టము. కార్మికులు, వారి పోరాటము శాంతియుతముగా కొనసాగింపగలిగిరేని వారు జయముపొందక వీలులేదు. యజమానుల హృదయములను కూడ జయింపగలుగుదురు. వారు మనోవాక్కాయకర్మలందు నిర్దోషులుగారు గనుక యజమానుల హృదయములను జయింప జాలకపోయిరి. వారు కర్మయందు మాత్రము దౌర్జన్యరహి తులుగా నుండిరి. అది నిశ్చయముగా వారికి గణ్యతయే.

అయిదవది ఖేడాపోరాటము. ఈ విషయములో సత్యా గ్రహముతాలయొక్క, స్థానికనాయకులందరూ, శుద్ధసత్యము నవలంబించినారని నేను జెప్పజాలను. శాంతిమాత్రము కాపాడ బడినది. కృషీవళుల దౌర్జన్యరాహిత్యము, కార్మికులకువలెనే, పైపైననే యుండెను. గనుక ఈ పోరాటములో గౌరవ ప్రదముగామాత్రము బయలుపడితిమి. అయినను ప్రజలలో గొప్ప ఉద్రేకముగలిగెను. కాని ఖేడా, దౌర్జన్యరాహిత్య పాఠమును పూర్తిగా గ్రహించలేదు. కార్మికులకు శాంతి యొక్క నిజమైనఅర్థము గోచరముగాలేదు. కనుక ప్రజలు కష్టబడవలసివచ్చెను. రౌలటుచట్ట సత్యాగ్రహసమయమందు నేనుజేసిన, హిమవత్పర్వతమంత పొరబాటును ఒప్పుకొనవలసి వచ్చినది. గనుక నేను ఉపవాసముచేసి, యితరులనుగూడ ఉపవాసముచేయమని ఆహ్వానింపవలసివచ్చినది.

ఆరవది కౌలటుచట్టవిషయము. అందులమనకు స్వత స్సిద్ధమైన లోటుపాట్లన్నియు పైకి తేలెను. కాని అసలు పునాది గట్టిగా బాగా, వేయబడినది. మనలోపములన్నియు ఒప్పు కొంటిమి. వాటికి తపస్సుచేస్తిమి. కౌలటుచట్టము, అమలు లోకి తేబడినప్పుడే నిరుపయోగమాయెను. ఆనల్లచట్టము చిట్టచివరవరకు రద్దుపరచబడినది కూడాను. ఈ పోరాటము మనకు గొప్ప గుణపాఠమును నేర్పెను.

ఏడవది, ఖిలాఫతు అన్యాయమును, పంజాబు దురంతము లను చక్కబెట్టి స్వరాజ్యమును సంపాదించుట. ఈపోరాటము ఇంకను జరుగుచునేయున్నది. నా నమ్మకము అచలమైనది. చిట్టచివరవరకు ఒక్క సత్యాగ్రహి నిలచినను, జయము తప్పక చేకూరును.

కాని ప్రస్తుతయుద్ధము ఇతిహాసతుల్యము. దీనికి మనము తలవనితలంపుగా తయారగుచున్న విషయము ఇదివరకే వర్ణించియుంటిని. నేను వీరంగం సమస్య యెత్తుకున్నప్పుడు, ఇతరపోరాటములు ముందున్నవని, ఏమాత్రము తలచనైతిని. వీరంగం విషయముగూడ, నేను దక్షిణాఫ్రికాలోయున్నపుడు నాకేమియు తెలియదు. అదియే సత్యాగ్రహముయొక్క సొగసు. అది ప్రతివానిదగ్గరకు వచ్చును. ఎవరును దానిని వెతకనక్కరలేదు. ఈ సిద్ధాంతములో స్వతస్సిద్ధముగానున్న మంచిగుణమేఅది. ఇది ధర్మయుద్ధము. కాపాడవలసిన రహస్యములు లేవు. టక్కరితనమునకు అవకాశములేదు.

అసత్యమునకు తావేలేదు. వెతకకుండానే దొరకును. ఆత్మ చింతగలవాడు దీనికెప్పుడు సిద్ధముగానుండును. మున్ముందుగా సన్నాహము చేయవలసిన పోరాటము ధర్మబద్ధమైనదిగాదు. ధర్మయుద్ధమందు దైవమే సన్నాహమంతయు తయారుచేసి పోరాటములు నడుపుచు ధర్మయుద్ధము దేవుని పేరమాత్రమే పోర వీలగును. సత్యాగ్రహమందు నిస్సహాయుడై, అవసాన కాలమందుండి, ఎవడు అన్నిదిశల కారుచీకటులు కనుగొనునో దేవుడు వానికి చేయూతయొసగును. తనపాదముల క్రిందనుండెడి దుమ్ముకంటె, ఎక్కువ వినమ్రుడైనపుడే, దేవుడు సహాయము చేయును. బలహీనులకు, నిస్సహాయులకు, మాత్రమే దైవరక్షణ గల్గును.

ఈ సత్యమును మనమింకను అనుభవాత్మకముగ గ్రహించవలసియున్నది. గనుకనే దక్షిణాఫ్రికా పోరాటముయొక్క చరిత్రమునకు, ఉపయోగకారి యని తలచెదను.

ప్రస్తుతపోరాటములో మన అనుభములకన్నిటికి, దక్షిణాఫ్రికాలో సమానములైనవి పాఠకుడు గాననగును. ప్రస్తుతము జరుగుచున్న యుద్ధమందు, మనమింతవఱకు నిరాశజెందవలసిన కారణములేదని ఈ చరిత్రవలన కనుగొనవచ్చును. మన కార్యక్రమమును వదలక కొనసాగించుటే, విజయమునకు ఒక్కటే నియమము.

ఈ ఉపోద్ఘాతమును "జూహు" నుండి వ్రాయుచున్నాను. చరిత్ర మొదటి 30 అధ్యాయములు 'యెరవాడ'

జైలులో వ్రాసితిని. శ్రీయుత ఇందులాలుయాజ్ఞిక్ నేను చెప్పుచుంటే వ్రాసెను. తర్వాతి అధ్యాయములు నేను ముందు వ్రాయదలచెదను. జైలులో పుస్తకములులేవు. ఇక్కడకు కూడా రప్పించేయుద్దేశ్యములేదు. క్రమమైనచరిత్ర వ్రాయుటకు నాకు యుద్దేశ్యముగాని, వ్యవధిగానిలేదు. ప్రస్తుతపోరాటము నకు సహాయకారియగుననియు, రాబోవు చరిత్రకారులకు మార్గదర్శిగానుండుటకును, ఈ పుస్తకమువ్రాయుటలో నా యుద్దేశ్యము. నావద్ద సరిజూచుటకు పుస్తకములు లేకపోయి నను, ఈ గ్రంథములో సరిగాని విషయము ఒక్కటైనను కలదనిగాని, ఒక్కవిషయమందైనను అతిశయోక్తియున్నదని గాని పాఠకుడు ఊహించకూడదని నేను ప్రార్థించవలసి యున్నది.

జూహు
2—4—1924 }

మో. క. గాంధి.

# మనవి

"ఉదారచరితానాంతు వసుధైవ కుటుంబకమ్"

అను రీతిని కీర్తిశేషులైన శ్రీ వల్లూరి సూర్యనారాయణరావు పంతులుగారు తమ సర్వస్వమును కొవ్వూరిలోని ఆంధ్ర గీర్వాణ విద్యాపీఠమునకు త్యాగమిచ్చి గతించిరి. వారి మరణశాసనములో, ఈ విద్యాపీఠమునకు అనుబంధముగ నొక పండితబృందమును (Acadamic council) నిర్మాణముచేసి దాని అధికారములు నిర్ణయించియున్నారు. ఈ పండిత బృందముయొక్క ముఖ్యమైన పని, సులభశైలిలో, పండిత పామరులకు బోధపడునటుల మత, సాంఘిక విషయముల గురించి, విమర్శన, పరిశోధన గ్రంథములను, సమస్త ఆధునిక, భౌతికశాస్త్రగ్రంథములను, బాలురకుపయోగపడు పాఠపుస్తకములను, వ్రాయించి, ప్రచురించుటయు అయియున్నది.

సూర్యనారాయణరావు పంతులుగారి జీవితకాలములో, వారు మనస్స్వాతంత్ర్యమను గ్రంథము నాలుగుభాగములును, సూర్యనారాయణీయమను వారి ఆత్మకథను, వర్ణాశ్రమ ధర్మ పరిణామము, అంతర్జాతీయ ధర్మశాస్త్రము అను గ్రంథములను రచించి ప్రచురించిరి. శ్రీ జటావల్లభుల పురుషోత్తం పంతులుగారు రచించిన 'స్మృతికాలపు స్త్రీలు,' 'వేదకాలపు

స్త్రీలు,' అను గ్రంథములును, రెబ్బాప్రగడ మందేశ్వర శర్మగారు రచించిన రాజ్యాంగ వివేకమునుగూడ, పంతులు గారు వారి జీవితకాలములో విద్యాపీఠమునకుగాను, అచ్చొత్తించి ప్రకటించిరి.

వారు చనిపోయినతర్వాత, వారి మరణశాసనములోని ఏర్పాట్లననుసరించి ఒక "ఎకడమిక్ కౌన్సిల్" ఏర్పర్చబడినది. ఈ కౌన్సిలువారు ఇంతవరకును "ఆహారవిజ్ఞానము" అను గ్రంథమునుమాత్రము ప్రచురించిరి. అనేక కారణముల వలన కౌన్సిలువారు అనుకొన్నంత త్వరగా పుస్తకప్రచురణము జరుగలేదు. ఆ కారణములనన్నిటిని ఇచ్చట వివరించి విమర్శించుట అనవసరము.

ఈ "దక్షిణాఫ్రికా సత్యాగ్రహము" ముఖ్యముగ చరిత్రగ్రంథము. సూర్యనారాయణరావుగారికి మహాత్మాగాంధీగారి ఆదర్శములపైనను, సిద్ధాంతములపైనను, ఆదరాభిమానములు మెండుగనుండెను. "గాంధీమహాత్ములవారి సత్యాగ్రహ తత్వములు వానిలోనిమిడియున్న వేదాంతమును" ఆంధ్రదేశములోని ప్రజలకు తెలియఁజేయు గ్రంథములను ప్రచురించుట వారి యభిప్రాయములలో నొకటి. తత్కారణముగ కొన్నిమాసములకు పూర్వమే, కౌన్సిలు. వారు ఈ గ్రంథమును "సూర్యనారాయణీయ గ్రంథమాలలో ప్రచురించుటకు నిశ్చయించిరి. ఈ గ్రంథము మహాత్మా గాంధీ గారి ఇంగ్లీషుగ్రంథమునకు అనువాదము. అనువాదకులు

శ్రీ గొల్లపూడి సీతారామశాస్త్రిగారు లోకవిదితులు. వారు దయతో నీ గ్రంథమును మాకు ప్రచురించుటకు అనుజ్ఞను గ్రంథమందలి సమస్త హక్కులను ఇచ్చిరి. వారికి వందనములు. ఈ గ్రంథము ప్రథమ, ద్వితీయభాగములు రెండు సంపుటములుగ ప్రచురింపబడినది.

సూర్యనారాయణీయ గ్రంథమాలను ఆదరించి అభివృద్ధిలోనికి తీసుకొనివచ్చుట ఆంధ్ర దేశమందలి విద్యార్థికులపై నున్నది. ఈ గ్రంథప్రచురణలో కౌన్సిలువారికి నిరంతరమును సహాయమును, సలహాను ఇచ్చి ప్రోత్సహించిన ఆంధ్రగీర్వాణ విద్యాపీఠపు ప్రెసిడెంటు, శ్రీ చోరగుడి వెంకటకృష్ణారావు పంతులుగారికిని, సెక్రటరీ శ్రీ మామిడన్న వెంకటసుబ్బారావు పంతులుగారికిని, కౌన్సిలువారి ధన్యవాదములు.

22—10—40
రాజమహేంద్రవరము.

వడ్డాది అప్పారావు,
ప్రెసిడెంటు.

# విషయసూచిక



---

# దక్షిణాఫ్రికా సత్యాగ్రహము

## 1 వ అధ్యాయము

### భూగోళము

ప్రపంచములోని పెద్దపెద్ద భూఖండములలో ఆఫ్రికా ఒకటి అయి యున్నది. ఇండియా, దేశముగాదు. ఖండము అని చెప్పుదురు. కాని వైశాల్యమును మాత్రమే విచారించిన యెడల ఆఫ్రికాలోనుండి నాలుగు అయిదు ఇండియాలు ఏర్పఱుపవచ్చును. ఆఫ్రికా ఇండియావలె ద్వీపకల్పము. దక్షిణాఫ్రికా విశేషభాగము సముద్రమువలన చుట్టబడియున్నది. ప్రపంచములోకెల్ల ఆఫ్రికా వేడి దేశమని ప్రతీతిగలదు. ఒక విధమున ఇది నిజమే. భూమధ్యరేఖ (మేరువ) ఆఫ్రికా మధ్యగా నుండును. ఈరేఖ వెంబడియుండు దేశములలోని వేడిని ఇండియాలోని జనులు యూహింపజాలరు. ఇండియాలో దక్షిణపు కొనను ఉన్నవారు దానిని కొంచెము ఊహించగలరు. అది భూమధ్యరేఖకు చాలదూరమున నున్నందున దక్షిణాఫ్రికాలో అట్టి వేడిలేదు. అచ్చట కొన్నిప్రదేశములలో చాల ఆరోగ్యముగాను సమశీతోష్ణముగాను ఉండును. అచట ఐరోపియనులు సుఖముగా స్థిరనివాస మేర్పఱచుకొనవచ్చును. ఇండియాలో నట్లు నివాసమేర్పఱచుకొనుట దుస్సాధ్యమే. మరియు

దక్షిణాఫ్రికాలోగూడ త్రివిష్టపము, కాశ్మీరములోవలె ఎత్తైన ప్రదేశములు గలవు. ఇవి అయినను త్రివిష్టపములోవలె పది పదునాల్గువేల అడుగులయెత్తు ఉండవు. గాన శీతోష్ణస్థితి సహించదగినంత వెచ్చగాను, చల్లగాను యుండును. దక్షిణాఫ్రికాలోని కొన్ని ప్రదేశములు క్షయరోగులకు ఆరోగ్యనిలయములుగా యెన్నబడుచున్నవి. ఇట్టివానిలో ఒకటి జోహానిస్సుబెర్గు. దక్షిణాఫ్రికా సువర్ణనగరమని దీనికి పేరు. యాభై సంవత్సరములక్రిందట ఈపట్టణముకట్టిన తావంతయు పూర్తిగా నిర్మానుష్యమై ఎండిన గడ్డితో కప్పబడి యుండెడిది. కాని బంగారపుగనులు కనిపెట్టిన పిమ్మట ఇంద్రజాలమువలె ఇల్లు ఒక్కొక్కటి కట్టబడెను. నేడు అందమైన గట్టివైన భవనము లచ్చటకలవు. అచ్చటి ధనవంతులు దక్షిణాఫ్రికాలోని హెచ్చుఫలవంతములైన ప్రదేశములనుండియు ఐరోపానుండియు చెట్లు తెప్పించి ఇచ్చట నాటించిరి. ఒక్కొక్క చెట్టుకు గిన్ని (పదిహేనురూపాయల పన్నెండు అణాలు) చొప్పున కూడ ఇచ్చిరి. ఈపూర్వచరిత్ర తెలియని ప్రయాణికుడు ఈచెట్లు ఇక్కడ అనంతకాలమునుండి ఉన్నవని తలంచును.

దక్షిణాఫ్రికాలో అన్ని ప్రదేశములు వర్ణింప యత్నించను. మన గ్రంథ విషయమునకు సంబంధించినంతవరకే చెప్పెదను. దక్షిణాఫ్రికాలో ఒక భాగము బుడతకీచులక్రింద నున్నది. తక్కినది బ్రిటిషువారిక్రిందనున్నది. బుడతకీచులక్రింద నున్న భాగమునకు డెలగోవాబే అని పేరు. ఇండియానుండి

వచ్చు ఓడలకు దక్షిణ ఆఫ్రికాలోని మొదటి రేవుపట్టణ మిదియే. ఇంకను దక్షిణముగా క్రిందికి, వచ్చినయెడల నేటాలు జేరుదుము. అది ఆంగ్లేయుల మొదట వలసరాజ్యము. దాని ముఖ్య రేవుపట్టణము పోర్టు నేటాల్, కాని మనము దానిని దర్బానని యెరుగుదుము. దక్షిణాఫ్రికా యందంతటను గూడా అది ఆ పేరుతోనే పిలువబడుచున్నది. నేటాలులోన కెల్ల దర్బాను పెద్దపట్టణము. దీనికి అరువై మైళ్ల దూరమున లోతట్టున పీటరు మారిడ్జుబర్గు కలదు. అది సముద్రముకన్న రెండు వేల అడుగుల యెత్తున ఉన్నది. అదియే నేటాలు రాజధాని. దర్బాను శీతోష్ణస్థితి ఇంచుమించుగా బొంబైని పోలి యుండును. బొంబయికన్న కొంచెము చలి ఎక్కువ. ఈ నేటాలు నుండి ఇంకను అభ్యంతరమునకు బోయినయెడల మనము ట్రాన్సువాలు చేరుదుము. అచ్చటి బంగారుగనులనుండి ఇతర చోట్లకన్న హెచ్చు బంగారము ప్రపంచమునకు సప్లయి అగుచున్నది. కొన్ని యేండ్లక్రిందట అచ్చట వజ్రపుగనులు కనిపెట్టబడెను. ప్రపంచములోకెల్ల పెద్దదైన వజ్రము అక్కడనే దొరకెను. దానిపేరు కల్లినాన్. ఆగని ఖామందు పేరును బట్టి దీనికీపేరువచ్చినది. దాని తూకము మూడు వేలరతులు. అనగా డెబ్బదిమూడు తులములకు పైగనుండును. కోహినూరు యొక్క ఇప్పటి తూకము నూరురతులు మాత్రమే. రషియను రాజకుటుంబము దగ్గరనున్న ఆర్లాఫ్వజ్రము రెండువందల రతులు తూగును.

జోహానిస్బర్గు ఈబంగారుగనుల పరిశ్రమకు కేంద్రముగా నున్నను దాని ప్రాంతములో వజ్రపుగనులు ఉన్నను, అది ట్రాన్సువాలుకు రాజధానికాదు. దీనికి ముప్పది ఆరుమైళ్ల దూరములోనున్న ప్రిటోరియానగరము రాజధాని అయియున్నది. అచ్చట ఉద్యోగస్తులు, రాజకీయవేత్తలు, వీరలననుసరించు జనముందురు, కాన అది శాంతమైన ప్రదేశము. జోహానిస్బర్గు హడావిడిగలచోటు. సామాన్యగ్రామమునుండిగాని, చిన్నపట్టణమునుండిగాని, బొంబయివచ్చిన ప్రేక్షకుడు అక్కడ గందరగోళముతో యెట్లు చిక్కుపడునో, అట్లే ప్రిటోరియానుండి జోహానిస్బర్గుకు వచ్చినవాడును కలవరపడును. జోహానిస్బర్గు పౌరులు నడుచుచున్నట్లు కనపడరు. పరుగెత్తుచున్నట్లే తోచును. ఇది అతిశయోక్తికాదు. ఏ ఒక్కనికైనను రెండవవానివైపునకు చూచుటకైనను, వ్యవధిలేదు. ప్రతివాడును అతిస్వల్పకాలములో అత్యధికధనము సంపాదించుటలో నిమగ్నమైయుండును. ఈట్రాన్సువాలు వదలి పడమరవైపునకు లోతట్టునకు పోయినయెడల, ఆరెంజిఫ్రీస్టేటు చేరుదుము. దాని రాజధాని బ్లూమ్‌ఫాంటేన్. ఇది చాల చిన్నది, నెమ్మదిఅయిన. గ్రామము. ట్రాన్సువాలులోవలె ఈరాష్ట్రములో గనులులేవు. ఇక్కడనుండి కొన్ని గంటలు అయోమార్గము (రైలు) మీద ప్రయాణముచేసినయెడల, కేపుకాలనీ సరిహద్దుకువత్తుము. అదియే దక్షిణాఫ్రికా వలస రాజ్యములలోకెల్ల పెద్దది. దాని రాజధాని కేపుటవును.

ఇదియే ఆవలసరాజ్యములోని పెద్ద రేవుపట్టణము. ఇది గుడ్ హోప్ అగ్రమునయున్నది. ఈఅగ్రమునకు యీ పేరు బుడతకీచుల రాజు కింగ్ జాన్ పెట్టెను. ఏలనన అప్పటికి సముద్ర ప్రయాణములకెల్ల గమ్యస్థానమైన ఇండియాకు చేరుటకు ఈఅగ్రమునుండి క్రొత్తదైన సులభమైన మార్గమును కనిపెట్టవీలగునని అతను ఆశించెను. (సదాశా అనగా గుడ్‌హోప్–అగ్రము).

ఈ నాలుగు వలసరాజ్యములుగాక బ్రిటిషువారి సంరక్షణలో నున్నవి చాల ప్రదేశములు గలవు. అచ్చట ఈ ఐరోపీయులు ఈ రంగస్థలమున చేరకముందు కొన్ని ఇతరజాతులు వలస వచ్చి ఇప్పటికిని కాపురము చేయుచున్నారు.

ఈ దక్షిణాఫ్రికాలో ముఖ్యపరిశ్రమ వ్యవసాయము. దానికి ఇది మిక్కిలి యోగ్యమైన ప్రదేశము. కొన్ని భాగములు సారవంతములును సంతోషకరములును అయి యున్నవి. అచట పండెడి ముఖ్య ధాన్యము మొక్కజొన్నలు. హెచ్చుశ్రమలేకుండ పండించవచ్చును. అదియే అక్కడి నీగ్రోజనులకు ముఖ్యఆహారము. కొన్నిచోట్ల గోధుమలు పండింతురు. దక్షిణాఫ్రికా పండ్లకు ప్రసిద్ధి. నేటాలులో మంచి మంచి రకముల అరటిపండ్లు, బొప్పాయిపండ్లు, అనాస పండ్లు దొరకును. అవియు అమితముగా నుండును. అతి బీదవానికిగూడ అవి కావలసినన్ని దొరకును. నేటాలులోను

ఇతర వలసరాజ్యములలోను నారింజలు, ఆప్రికాట్లు, పీచ్ పండ్లు, ఎంతహెచ్చుగా పండుననగా వేలకొలది జనము అవి కోసినందుకు వానినే కూలిగానే తీసుకొందురు. కేపు కాలని ప్లమ్ము, ద్రాక్ష, పండ్లను పుట్టినిల్లు. ఇంతచక్కని ద్రాక్ష యే ఇతరప్రదేశములలోను దొరకదు. ఆయా ఋతువులలో అవి అతిచౌక. బీదవాడుసైతము కడుపునిండ తిన వచ్చును. భారతీయులు నివసించు ప్రదేశములలో మామిడి పండ్లు లేకుండుట సంభవించదు. దక్షిణాఫ్రికాలో భారతీయులు మామిడిచెట్లను పెంచిరి. కాన మామిడిపండ్లు హెచ్చుగా దొరకును. అందులో కొన్నిరకములు బొంబై లోని శ్రేష్టమైనరకములకు పోటీలోనిలుచును. ఆ సారవంతమైన దేశములో కాయకూరలు విస్తారముగా పెంచుదురు. రుచులు తెలిసిన భారతీయులు ఇండియాలోని కాయగూరల నన్నిటిని అక్కడ పెంచుచున్నారు.

అక్కడ పశువులను బాగుగ పెంచెదరు. అచ్చటి ఆవులు, యెద్దులును ఇండియాలోని వానికన్న అందముగాను బలిష్ఠముగాను ఉండును. ఇండియాలో ఆవులను సంరక్షించుచున్నామందురు కాని ఇండియాలోని ఆవులును యెద్దులును మనుజులవలెనే శుష్కించియున్నవి. ఇట్టి ఆవులును యెద్దులును చూడగ నాకు సిగ్గు అగుచున్నది. అనేకమాసములు హృదయవేదన కలుగుచున్నది. దక్షిణఆఫ్రికాలో అన్ని భాగములలో కండ్లుతెరుచుకొని నేను సంచరించితిని. కాని

చిక్కనఅవుగాని యెద్దుగాని ఒకటైనను చూచినట్లు గుర్తు లేదు.

ఈదేశముపై ప్రకృతి తనసంపదలను వర్షించుటయేగాక దానిని సౌందర్యవంతముగ చేయుటలోగూడ ఆమె లోభించ లేదు. డర్బనుపట్టణప్రకృతి సౌకుమార్యము మిక్కిలి సౌందర్య ముగ యెంచబడుచున్నది. దీనినిమించినది కేపుటవును. అది టేబుల్‌కొండపాదముననున్నది. ఈకొండ అత్యున్నతము, అతినీచముకాదు. దక్షిణాఫ్రికాను మిక్కిలి ప్రేమించెడి ఒక బుద్ధిమంతురాలగు స్త్రీ ఈకొండనుగూర్చి గీతము వ్రాసినది. దానిలో ఈకొండవలె యే ఇతరకొండలును నిరుపమాన భావమును తనకు కలిగించలేదని ఆమె వర్ణించెను. ఇందులో అతిశయోక్తి ఉండవచ్చును. ఉన్నదని నేను తలచెదను. కాని ఆమెచెప్పిన అంశములలో ఒకటి సత్యమని నాకును తోచెను. కేపుటవునుపౌరులకు ఈ టేబిలుకొండ స్నేహితునివలె కను పడుచున్నదని ఆమె వర్ణించెను. ఇది అత్యున్నతము కానందున భయమును పుట్టించదు. దూరముననుండియే ప్రజలు దీనిని పూజించవలసిన నిర్బంధములేదు. దానిమీద ఇండ్లుకట్టుకొని కాపురము చేయుదురు. అది సముద్రపు యొడ్డుననే యుండుటచేత సముద్రుడు తన నిర్మలోదకము లతో దానికాళ్ళు కడుగుచుండును. బాలురు ముదుసలులు స్త్రీలు పురుషులు నిర్భయముగా కొండపై తిరుగుచుందురు. ప్రతిదినము వేలకొలది కంఠధ్వనులతో అది ప్రతిధ్వనించు

చుండును. దానిపొదుగాటిచెట్లు, సువాసనపువ్వులు, పలు రకముల రంగులు, ఆకొండకు అలంకారము చేయుచున్నవి. ఎంతచూచినను ఎంతతిరిగినను విసుగు జనించదు.

గంగా సింధు నదులవంటి పెద్దనదులు కలవని దక్షిణాఫ్రికా చెప్పుకొనలేదు. ఉన్ననదులు కొద్ది. అవియు చిన్నవి. ఆనదులనీరు చాలచోట్లకు రాదు. ఎత్తైన ప్రదేశములకు కాలువలు త్రవ్వవీలులేదు. పెద్దనదులు లేనిచోట్ల కాలువలు యెట్లువచ్చును! దక్షిణాఫ్రికాలో పైభాగమున నీరు లోపించినపుడు ఉద్భేదపుబావులను ( ఉద్భేదము=జలోర్ధ్వ గామి=పైబుగ్గ. ) త్రవ్వెదరు. వ్యవసాయమునకు కావలసిన నీరును వాయుయంత్రములవలనను, ఆవిరియంత్రములవలనను పైకితోడెదరు. అచ్చటి ప్రభుత్వము వ్యవసాయమును చక్కగా ప్రోత్సహించును. వ్యవసాయదార్లకు సలహాచెప్పుటకు ప్రభుత్వమువారు నిపుణులను పంపెదరు. ఆదర్శవ్యవసాయశాలలను నిర్మించెదరు. వారల లాభముకొరకై క్రొత్తపరిశోధనలను చేసెదరు. చక్కని పశువులను మంచి విత్తనములను ఇప్పించెదరు. కొద్దివ్యయముతో బావులను త్రవ్వించెదరు. ఈమొత్తమును గూడ వాయిదాలమీద నిచ్చుటకు అనుమతించెదరు. ఇట్లే పొలములను కాపాడుటకు ముండ్లతీగెలతో కంచెలు వేసెదరు.

భూమధ్యరేఖకు ఇండియా ఉత్తరమునను దక్షిణాఫ్రికా దక్షిణమునను ఉన్నందున అచ్చటి శీతోష్ణస్థితులు

ఇచ్చటివానికి ప్రత్యక్షవిరుద్ధముగా నుండును. ఋతువులు తల్లక్రిందుగా వచ్చును. ఎట్లన ఇండియాలో వేసవికాలమైనప్పుడు దక్షిణాఫ్రికాలో వర్షాకాలమగును. అచ్చటి వర్షపాతము చాల స్వల్పము. నిలకడలేనిది. ఎప్పుడైనను కురియవచ్చును. సాలీనా, యిరువై అంగుళములకు మించదు.

---

## 2 వ అధ్యాయము

## చరిత్ర

మొదటి అధ్యాయములో చెప్పిన భూవిభాగములు పురాతనమైనవి కావు. పూర్వకాలములో దక్షిణాఫ్రికాలో ఆదిమనివాసులెవరో స్పష్టముగా చెప్ప వీలులేదు. దక్షిణాఫ్రికాకు ఐరోపీయులు వచ్చుసరికి అక్కడ నీగ్రోలు ఉండిరి. అమెరికాలోఉన్న బానిసలు అక్కడి క్రూరబానిసత్వమునుండి యెట్లో తప్పించుకొని ఆఫ్రికా చేరిరి. నీగ్రోలు వారి సంతతి వారని వాడుకగలదు. వీరిలోకూడ అనేకజాతులు గలవు. జూలూ, స్వాజి, బసుతో, బుకనాన్ ఇంక మరికొన్నిజాతులును కలవు. వారిలో వివిధభాషలు కలవు. ఈదక్షిణ ఆఫ్రికాలో నీగ్రోలే ఆదిమనివాసులు అని తలచవలెను. ఈదక్షిణ ఆఫ్రికా యెంతో వైశాల్యముగలది. ఇప్పుడు ఉండు నీగ్రోలను ఇరువై ముప్పైరెట్లు పోషించగలదు. కేపుటౌను నుండి దర్బానుకు అయోమార్గమున ౧౮౦౦ మైళ్ల దూరము. సము

ద్రము మీద ౧౦౦౦ మైళ్లకు తక్కువదూర ముండదు. ఈనాలుగు వలసరాజ్యముల విస్తీర్ణము కలసి ౪,౭౩,౦౦౦ చదరపు మైళ్లు. ౧౯౧౪ సంవత్సరములో నీగ్రోల జనాభా ౫౦ లక్షలు. ఐరోపీయులు ౧౨౫౦౦౦౦ మాత్రమె ఉండిరి.

నీగ్రోలులో పొడగరులు, అందగాళ్లు, జూలుజాతివారు. నీగ్రోలనుగూర్చి అందగాడను పదమును నేను యోచనతోనే వాడినాను. పచ్చనితోలు, కోలముక్కు, మనము అందమునకు ఆదర్శముగా చెప్పుకొందుము. ఈఅపోహను ఒకక్షణము విడిచిన యెడల భగవంతుడు జూలూ మనుజునిగూడ పరిపూర్ణుని చేయుటలో యేలోపము చేయలేదని మనము తెలుసుకొందుము. స్త్రీ పురుషులు ఉభయులు పొడుగుగా నుందురు. పొడుగుకు తగిన విశాలమైన వక్షస్థలము గలిగియుందురు. వారికండరములు చక్కగా యేర్పడి పుష్టిగా నుండును. వారి పిక్కలు దండలు గుండ్రడగా కండరములతో నిండియుండును. వారిలో పురుషుడుగాని స్త్రీగాని వంగి నడువడు. గూని ఉండదు. ఇవి మహా అరుదు. పెదవులు పెద్దవి లావు. కాని యావత్తుశరీరమునకు సరిపోయి మొత్తముమీద అంగసౌష్టవము కనుపడుచుండును. నేను మాత్రము ఆపెదవులను వికారమని అనను. కండ్లు గుండ్రముగా కాంతివంతముగా నుండును. పెద్దముఖమునకు తగినట్లు ముక్కు పెద్దదిగాను పరుపుగాను ఉండును. వారితలమీద వెండ్రుకలు ఉంగరములు తిరిగి ఉండును. టూకుచేవవలె నల్లగా మెరుపుతో నుండెడి

ఆతని చర్మమునకు ఈవెండ్రుకలు వన్నె తెచ్చును. దక్షిణాఫ్రి కాలోనుండు ఆదిమనివాసులలో అందమునకు యెవరిని మెచ్చు కొందువని జూలూలను అడిగినయెడల వారు నిస్సంకోచముగా తనజాతి పక్షముననే తీర్పు యిచ్చును. వారు ఇచ్చెడి ఆతీర్పులో నేను తప్పును కనిపెట్టలేను. జూలూయొక్క అస్థి భారము బలిష్ఠముగా నేర్పడి సొగసుగా రూపమొందినది. ప్రకృతియే ఇట్లు చేసినది. కండరములను పెంచుటకు యూరపు లోని శాండో మొదలగువారు చేసెడి కసరత్తు వీరికి అవస రములేదు. భూమధ్యరేఖ సమీపమున నివసించుజాతులు యొక్క తోలు నల్లగా నుండుట ప్రకృతిశాసనము. ప్రకృతి నిర్మించినదానిలోనే సౌందర్యము కలదని మనము నమ్మిన యెడల సౌందర్యములగూర్చి మనకుండెడి సంకుచితమైన పక్షపాతయుతమైన అపోహలనుండి విడివడుటయే గాక ఇండి యాలోనున్న మనవారిలో కొందరితోలు పచ్చగా లేనందు వలన పొందు అయిష్టతను, సిగ్గును మనము తప్పించుకొన గలము.

నీగ్రోలు మట్టితోగట్టిన చుట్టుగుడిసెలలో కాపుర ముందురు. దానికి ఒకటే చుట్టుగోడ. పైన గడ్డితో కప్పెదరు. మధ్య ఒంటిస్తంభము ఉండును. వాకిలి చిన్నదిగా నుండును. వంగి లోపలకు పోవలెను. గాలి రాకపోకలకు అదియేసందు. బహు అరుదుగా తలుపుండును. మనవలెనే ఈనీగ్రోలుకూడ తమ నట్టిళ్లను, గోడలను మట్టితోను పేడతోను పూయుదురు.

నీగ్రోలు నలుచదరమైన వస్తువులను చేయలేరని వాడుక గలదు. వారు గుండ్రని వస్తువులు చూచుటలోను చేయుటలోను తమ కండ్లను తర్బీతుచేసిరి. ప్రకృతి సరిగీట్లను గీయుచున్నట్లుగాని చతుష్కోణములనుగాని చేయుచున్నట్లు మనము చూచుట లేదు. ప్రకృతియొక్క నిష్కపటులైన ఈపిల్లలు తమజ్ఞానము నంతయు, ఆమె యిచ్చిన అనుభవమునుండియే సంపాదించిరి.

గుడిసెలో దాని నిరాడంబరమునకు తగిన సామానులే గలవు. బల్లలు, కుర్చీలు, పెట్టెలు, ఇట్టివస్తువుల కిక్కడచోటు లేదు. ఇప్పటికిని ఇట్టివస్తువులు అరుదుగాగాని కనుపడవు.

పాశ్చాత్య నాగరికత రాకముందు నీగ్రోలు జంతు చర్మములను ధరించుచుండిరి. అవియే వారికి పరుపులుగాను, దుప్పట్లుగాను, తివాచీలుగాను ఉపయోగపడుచుండెను. ఇప్పుడు జంపకాణాలు వాడుచున్నారు. బ్రిటిషు పరిపాలన రాకముందు స్త్రీపురుషులు ఇంచుమించుగా దిగంబరులుగానే తిరుగుచుండిరి. ఇప్పటికిని గ్రామాములలో చాలమంది అట్లే తిరుగుదురు. వారు ఒక తోలుముక్కతో రహస్యాంగములను మాత్రము కప్పుకొందురు. కొందరు ఈమాత్రమునుకూడ చేయరు. వారికి ఇంద్రియనిగ్రహము లేదని దీనివలన యెవరును పొరబడ కుందురుగాక. ఒక పెద్దసంఘము ఒక ప్రత్యేక ఆచారమును అనుసరించునప్పుడు, అది ఇతరసంఘములకు దూష్యముగా కనుపడినను, వారిలోవారికి నిరపాయకరముగానే యుండ వచ్చును. వారు ఒండొరులను తేరిపార చూచుకొనుటకు

నీగ్రోలకు వ్యసధియే లేదు. దిగంబరులై స్నానము చేయు చున్న స్త్రీల సమీపమున శుకదేవుడు సంచరించినపుడు భాగవతములో చెప్పినట్లు వానిమనస్సు నిశ్చలముగానే యుండెను. ఆ స్త్రీలైనను లజ్జవలన కలవరము పొందలేదు. ఈకథనములో మానవాతీతము కలదని నేను ఎంచను. నేడు ఇండియాలో అట్టి స్థితిలో ఆవిధముగా అంత పవిత్రముగా నుండగలవాడు లేని యెడల, అది మనదుర్దశను తెలుపును. గాని సంపూర్ణపవిత్రత కొరకై కృషిచేసిన మానవుని సాధనకు హద్దులను కల్పించ నేరము. నీగ్రోలు అడవిజాతివారనుట మనబడాయిని మాత్రము తెలుపును. మనము అనుకొనే అనాగరికులు మాత్రము వారు కారు.

నీగ్రోస్త్రీలు పట్టణము వచ్చినప్పుడు ఎదురురొమ్ము నుండి మోకాలివరకు కప్పుకొనవలెనని చట్టము విధించు చున్నది. వారు తమ శరీరముచుట్టును ఒకబట్టను చుట్టవలసి వచ్చినది. దానికి తగిన తునుకలు దక్షిణాఫ్రికాలో బాగా అమ్ముడుబోవును. యూరపునుండి ప్రతిసంవత్సరము ఇట్టి తానులు లేక జంపఖానాలు వేలకొలది దిగుమతి యగు చుండును. మొగవారికిని ఇట్టివిధియే కలదు. కాన చాలమంది యూరపునుండి ఒకపర్యాయము వాడిన దుస్తులను తెప్పించు కొని ధరింతురు. కొందరు పొట్టిలాగులను తొడుగుకొని నవారుతో బిగింతురు. ఈవస్త్రములన్నియు యూరపునుండి దిగుమతి యగును.

మొక్కజొన్నలును, దొరకినపుడు మాంసమును, వారికి ముఖ్యఆహారము. అదృష్టమువలన, సుగంధద్రవ్యములుగాని తిరుగమోతగింజలుగాని వారెరుగరు. వారి ఆహారములో సుగంధద్రవ్యములు చూపట్టినను, లేక పసుపురంగు కనుపడినను, వారు విముఖులగుదురు. వారిలో మరింత అనాగరికులు అనబడువారు దానిని తాకనే తాకరు. జూలూజాతివారు ఒక్కొక్కపూటకు ఒక్కొక్కరు ౪౦ తులముల తూకముగల ఉడికిన మొక్కజొన్నలను, కొంచెము ఉప్పుతో, తినుచుందురు. ఇట్టితిండి అరుదుగాదు. మాంసము దొరికినయెడల పచ్చిదిగానో, వండియో వేయించియో కాల్చియో ఉప్పుతో మాత్రము తిందురు. ఏజంతువు మాంసమైనను తినుటకు సంకోచింపరు.

ఈనీగ్రోల భాషలకు వారి జాతులనుబట్టి పేర్లుపెట్టిరి. యూరపియనులువచ్చి వ్రాయుటను ప్రవేశపెట్టిరి. నీగ్రోలకు లిపిలేదు. రోమనులిపిలో నీగ్రోభాషలలో బైబిల్ మొదలగు పుస్తకములు ఇప్పుడు అచ్చువేయబడుచున్నవి. జూలూభాష మిక్కిలి మధురముగానుండును, అనేకపదములు ఆ తో అంతమగును. కాన భాష చెవికి మృదువుగాను ఇంపుగాను ఉండును. వారి మాటలలో అర్థమును కవిత్వభావమును కలదని నేను వింటిని, చదివితిని. నాకు తెలిసిన కొద్దిమాటలనుబట్టి ఈసంగతి నిజమనిచెప్పగలను. అనేకపట్టణములకు ఐరోపియనులు ఇచ్చిన పేర్లను నేను తెలిపియున్నాను. వీనికి మాధుర్యమైన భావగర్భి

తమైన పేర్లను నీగ్రోలు కల్పించియుండిరి. అవి నాకిప్పుడు జ్ఞాపకములేవు. వానిని తెలుపజాలను, అందుకై చింతిల్లెదను.

క్రైస్తవమతబోధకుల ప్రకారము నీగ్రోలకు వెనుకగాని ఇప్పుడుగాని మతమేలేదు. కాని మతము అనుపదమునకు విశాలమైన అర్థముచెప్పినయెడల వారికిని మతముగలదు. మానవులకు అగోచరుడైన ఒక పరమవ్యక్తిని నీగ్రోలు నమ్మి పూజించుచుందురు అని చెప్పవచ్చును. ఆపరమవ్యక్తిని చూచి వీరు భయపడుచుందురు. ఈశరీరము నశించుటతోడనే, ఏవ్యక్తియు సంపూర్ణముగా ధ్వంసముగాడని వారికి చూచాయగా తెలియును. నీతియే మతమునకు బునాదియని మనము అంగీకరించినయెడల, నీగ్రోలు నీతివంతులు గనుక వారికి మతముకలదని మనము చెప్పవచ్చును. సత్యమునకును అసత్యమునకునుగల భేదము వారికి పూర్తిగా తెలుసును. అనాగరిక స్థితిలోనున్న ఈ నీగ్రోలు సత్యవాక్యపరిపాలన చేసినట్లు, యూరపియనులుగాని, మనముగాని, చేయుచున్నామా లేదా అనునది, మిక్కిలి సందేహాస్పదము. వారికి దేవాలయములుగాని ఆమాదిరివి ఏవిగానిలేవు. ఇతరజాతులలోవలెనే వారిలో కూడ కొన్ని పిచ్చినమ్మకములు కలవు.

ఈనీగ్రోజాతి ప్రపంచములో ఏ జాతికిని శరీరబలములో తీసిపోదు. కాని ఇది అతిపిరికిజాతి. యూరపియను శిశువును చూచినను, నీగ్రో భయపడును. ఈసంగతి పాఠకునకు ఆశ్చర్యముకలిగించవచ్చును. నీగ్రోమీాద ఒకతుపాకిని గురిపెట్టిన

యెడల వాడు వెంటనే పారిపోవును. లేదా పారిపోవుటకుగూడ శక్తిలేక నిశ్చేష్టితుడై నిలువబడును. దీనికి తగిన కారణము గలదు. తమవంటి అధికసంఖ్యాలుగల భయంకరమైన జాతిని, కొలదిమంది యూరపియనులు స్వాధీనపరుచుకొనుటకు, వారిలో యేదియో ఇంద్రజాలము ఉండునని, ఈనీగ్రోలు గట్టిగా నమ్ముచున్నారు. బల్లెము, బాణము, అంబులు, వీని యొక్క వాడుక నీగ్రోకు చక్కగా తెలియును. వానివద్దనుండి ఈసాధనములను లాగివేసిరి. వాడు తుపాకిని యెన్నడు చూడ లేదు, కాల్చలేదు. దానికి నిప్పుపుల్ల అక్కరలేదు, వేలు కదల్చుటకంటె హెచ్చుగా నేమియు జరుగదు. వెంటనే ఒక చిన్నగొట్టములోనుండి ధ్వనిబయలుదేరును. మంట కను పడును. గుండు గాయముచేయును, క్షణములో మనిషి చచ్చి పోవును. నీగ్రో యీ వ్యాపారమును అర్థముచేసుకొన జాలడు. ఇట్టి ఆయుధములను ధరించినవారినిజూచి మరణభీతిని పొందును. వాడును వాని పూర్వీకులును నిస్సహాయులును నిర్దోషులును అయిన నీగ్రోలు అనేకులు ఈగుండ్లబారునపడి ప్రాణములను గోల్పోవుట చూచియున్నారు. ఇది యెట్లు జరుగునో వారికి ఇప్పటికిని తెలియదు.

నాగరికత వారిలో మెల్లమెల్లగా వ్యాపించుచున్నది. దైవభీతిగల మతబోధకులు తమకు తెలిసినమట్టుకు ఏసు సందేశమును వారికి బోధింతురు. పాఠశాలలను పెట్టుదురు. చదువను వ్రాయను నేర్పుదురు. అనేకులు నిరక్షరకుక్షులై

నాగరికతకు దూరులై దురభ్యాసములను యెరుగనివారు, ఇప్పుడు పతితులైరి. ఈనాగరికత తాకినవాడు, మద్యపానము నుండి తప్పించుకొన్నవాడు లేనేలేడు. ఈ మద్యముత్రాగి కైపుఎక్కి, పిచ్చివాడుఅయిన ఈబలిష్ఠుడు అన్నినేరములును చేయుచున్నాడు. నాగరికతవలన కోరికలు పెరుగును. రెండు రెండుకలిసి నాలుగు అగుట ఎట్లుస్పష్టమో ఇదియు అంత స్పష్టము. వానికోరికలు పెంచుటకును కృషియొక్క విలువను వానికి బోధించుటకును, తలపన్నును, గుడిసెపన్నును, వాని మీద వేసిరి. ఈపన్నులు వెయ్యనియెడల, ఈవ్యవసాయ దారులజాతి, తమపొలములను వదలి, బంగారమునుగాని వజ్రములునుగాని తీయుటకై నూర్లకొలది అడుగుల లోతుగల గనులలో ప్రవేశించియుండరు. ఈగనులకు వారి కాయకష్టము లభించనియెడల, బంగారమును వజ్రములును భూగర్భమున దాగియుండును. ఇట్టిపనులు లేనియెడల యూరోపియనులకు నౌకర్లుదొరకుటయుకష్టము. పర్యవసానమేమనగా ఈగనులలో పనిచేయు వేలకొలది నీగ్రోలు అనేకరోగములవల్ల బాధ పడుచున్నారు. ప్రత్యేకముగా గనుల క్షయ అను ఒక జాడ్యము వీరిని వేధించుచున్నది. అది తగిలినవాడు బ్రతుకడు. తమ కుటుంబములను వీడి దూరముగా గనులలోనుండు వేల కొలది మనుజులు ఎటువంటి ఇంద్రియనిగ్రహము నిలువబెట్టు కొనగలరో సులభముగా యూహించవచ్చును. కాన వీరికి సుఖసంకటములుకూడ తగులును. దక్షిణాఫ్రికాలో ఆలో

చనా పరులగు యూరోపియనులు ఈ ముఖ్యాంశమును గమనించినవారు లేరని కాదు. వారిలో అనేకమంది ఈ నాగరికత మొత్తముమీద నీగ్రోలకు ఉపకారము చేసినదని యెంచుట లేదు. దానివలన కలిగిన అపకారములను సులభముగానే గ్రహించవచ్చును.

ఇట్టిఅమాయకులును, నిష్కపటులును అయిన జాతివారు నివసించెడి దేశములో నాలుగువందల సంవత్సరముల క్రిందట డచ్చివారు ఒకవలస నేర్పరిచిరి. వారివద్ద బానిసలు ఉండిరి. జావానుండి కొందరు డచ్చివారు తమ "మలయాదేశపు" బానిసలతోగూడ, ఇప్పుడు కేపుకాలనీ అను ప్రదేశములో అప్పుడు ప్రవేశించిరి. ఈమలయాదేశస్థులు మహమ్మదీయులు. వారి నరములలో డచ్చిరక్తము గలదు. డచ్చివారి గుణములు వారికి సంక్రమించెను. వారు దక్షిణాఫ్రికాలో అక్కడక్కడ గలరు. కాని కేపుటవును వారి ముఖ్యస్థానము. నేను వారిలో చాలమంది యూరోపియనుల సేవలోనున్నారు. కొందరు స్వతంత్రవృత్తుల ననుసరింతురు. మలయాదేశపు స్త్రీలు బుద్ధిమంతులును పనిపాటలయందు శ్రద్ధగలవారును అయి యున్నారు. వారి జీవితపద్ధతులు పరిశుభ్రముగా నుండును. కుట్టుపనిలోను, చాకలిపనిలోను వారు నేర్పరులు. పురుషులు చిల్లరవర్తకములు చేయుదురు. కొందరు బాడిగె బండ్లు తోలుదురు. కొందరు ఇంగ్లీషు ఉన్నతవిద్య నేర్చుకొనిరి. వారిలో ప్రఖ్యాతుడు కేపుటవును నివాసియగు

డాక్టరు అబ్దుల్ రహమాన్. ఆయన కేపుటౌనులోనుండు పూర్వ రాజ్యాంగపు శాసనసభలో సభ్యుడు. క్రొత్త రాజ్యాంగచట్టము క్రింద శాసనసభలో ప్రవేశించు హక్కు లేకుండ తీసివేయ బడెను.

డచ్చివారిని వర్ణించుచు మధ్య మలయనులను గురించి చెప్పితిని. కాని ఇప్పుడు డచ్చివారి అభివృద్ధి చూతము. డచ్చి వారు సాహసముగల యోధులు. అట్లే నేర్పరులైన వ్యవ సాయదారులు. చుట్టునున్న దేశముల వ్యవసాయమునకు మిక్కిలి అనుకూలమైనదని వారు కనిపెట్టిరి. సంవత్సరములో కొద్దికాలము మాత్రమే పనిచేసి స్వదేశస్థులు పొట్టబోసికొను చున్నారని వీరు చూచిరి. డచ్చివారివద్ద తుపాకులుండెను. వారికి యుద్ధనిర్వహణకౌశలము గలదు. ఇతరజంతువులవలెనే మానవులనుగూడ మచ్చికచేయు పద్ధతిని వారు యెరుగుదురు. ఇట్టిపనికి వారిమతము అడ్డమురాదని వారు నమ్మిరి. వారు చేయుపని నీతియా అవినీతియా యని అనుమానమైనను తోచ కుండగనే, వారీస్వదేశస్థుల కాయకష్టములతో వ్యవసాయ మును మొదలిడిరి.

డచ్చివారు తమ అభివృద్ధికై మంచిభూములను ఎట్లు వెదకుచుండిరో వీరిపిమ్మట రంగస్థలమునకు వచ్చిన ఆంగ్లే యులును అట్లే వెదుకసాగిరి. ఆంగ్లేయులును డచ్చివారును దాయాదులు నిజమే. వారి శీలములును కోరికలును సమాన ములే. ఒకే కుమ్మరి ఆవమునుండివచ్చిన కుండలు ఒకదానిపై

నొకటి పడుట అసంభవముకాదు. కాన యీ రెండు జాతులును తమతమ ప్రత్యేకప్రయోజనములను క్రమేణ అభివృద్ధి పరుచుకొనుచు, నీగ్రోలను లోబరుచుకొనుచు, తమలో తాము సంఘర్షణములోనికి దిగిరి. మొదట తగువులు, తరువాత యుద్ధములు సాగెను. ఇంగ్లీషువారు మజూబాకొండదగ్గిర ఓడిపోయిరి. ఈ మజూబావల్ల యేర్పడినపుండు పిమ్మట భయంకరరూపము దాల్చెను. ౧౮౯౯ మొదలు ౧౯౦౨ వరకు సాగినబోయరు యుద్ధముగా ఇది పరిణమించెను. డచ్చి జనరల్ క్రాంజి ఓడిపోయి లొంగినపుడు మజూబాకు తగినకసి తీర్చుకొనబడినదని విక్టోరియారాణికి రాబర్ట్సుప్రభువు తంతి పంపగలిగెను. ఈ బోయరు యుద్ధమునకు పూర్వము ఈ రెండు జాతులకును మధ్య మొదటిసంఘర్షణ జరిగినప్పుడు బ్రిటిషు వారి అధికారముక్రింద నామమాత్రము అయినను ఉండుటకు డచ్చివారు సమ్మతింపలేదు. అందుచేత ఈదక్షిణాఫ్రికాలోని అదివరకు తెలియని భాగములలోనికి వీరు వెడలిపోయిరి. ట్రాన్సువాలు, ఆరంజిఫ్రీస్టేట్ల పుట్టుకకు ఇదియే కారణము.

ఈ డచ్చివారికి దక్షిణాఫ్రికాలో బోయర్లు అని పేరు. పిల్ల తల్లిని బట్టుకొని యెట్లు వదలదో అట్లే వీరు వీరి భాషను కాపాడుకొనిరి. వారి భాషకును వారి స్వాతంత్ర్యమునకుగల సన్నిహితసంబంధమును వారు అనుభవముద్వారా చక్కగా గ్రహించిరి. అనేకదాడులు సంభవించినను వారిభాషను వారు

చెడకుండ కాపాడుకొనగలిగిరి. ఈభాష వారి సహజస్వభావమునకు అనుకూలమైన క్రొత్తరూపమును ధరించెను. వీరి అసలు నివాసమైన హాలెండుతో సంబంధములు తగ్గినకొలది అసలు డచ్చిభాషలోనుండి ఒక క్రొత్తభాషను యేర్పరుచుకొని మాట్లాడసాగిరి. సంస్కృతమునుండి పుట్టిన ప్రాకృతముల వలెనే ఈబోయరు భాష డచ్చినుండి పుట్టినది. దానిని స్థిరపరచి టాల్ అని పేరు పెట్టిరి. తమపిల్లలకు అనవసరమైన బాధ కలుగకుండుటకై వారు వాడుకభాషనే ఉపయోగింపసాగిరి. ఈటాలులోనే వారి పుస్తకములు వ్రాయుదురు. దీని ద్వారా వారి పిల్లలకు చదువు చెప్పుదురు. శాసనసభలోని బోయరు సభ్యులు ఈభాషలోనే ఉపన్యాసములు చేయుట విధిగా నెంతురు. ఈవలసరాజ్యములు నాలుగు సంయోగమైన పిమ్మట ఈటాలుకును ఇంగ్లీషుకును సమానప్రతిపత్తి యేర్పరచి రెంటిని రాజకీయభాషలుగా నంగీకరించిరి. అందువలన గవర్నమెంటు గెజట్లను పార్లమెంటు నిదర్శనములును రెండు భాషలలో ప్రకటించి తీరవలయును.

బోయర్లు నిరాడంబరులు, బోళావారు. మతమునందు శ్రద్ధగలవారు. విశాలములైన పొలముల మధ్య వారు నివసింతురు. వారి పొలముల వైశాల్యము మనము ఊహింపజాలము. మనకు పొలమనగా ఒకటి రెండు యెకరములు లేదా అంతకంటె తక్కువ అని అభిప్రాయము. దక్షిణాఫ్రికాలో ఒక్కొక్క వ్యవసాయదారునకు వందలు లేక వేల

కొలది యెకరముల భూములుండును. ఒక్కమారే అంత పొలమును సేద్యములోనికి తీసుకొని వచ్చుటకు అతనికి ఆతురత లేనేలేదు. ఎవరైనను ఆతనితో చర్చించినయెడల ఇట్లు చెప్పును. "అది బీడుగా నుండనిమ్ము. ఇప్పుడు బీడుగా నున్న దానిని మనపిల్లలు సాగుచేతురు."

ప్రతిబోయరును మంచియోధుడు. వారిలో వారు యెంతతగవులాడుకొన్నను వారి స్వాతంత్ర్యమునందు వారికి అత్యంతప్రేమ గలదు. అందుచేత దానికి ఆపద కలిగినపుడు అందరు తయారై ఒక్కటిగా పోరాడుదురు. వారికి హెచ్చుగా సైనికశిక్షణ మవసరములేదు. యుద్ధములో పోరాడుట ఆజాతికి సహజలక్షణము. స్మట్సుసేనాని, డివెట్టు సేనాని, హర్టుజాగ్ సేనాని అందరును పెద్దన్యాయవాదులు పెద్ద వ్యవసాయదారులు, అట్లే పెద్ద యోధులు. జనరల్ బోథాకు తొమ్మిదివేల యెకరములు ఒకక్షేత్రదేశమున కలదు. వ్యవసాయములోని చిక్కులు మెరుగులు అన్నియు వానికి తెలియును. అతను సంధిరాయబారముల నిమిత్తము యూరపు బోయినపుడు ఈతనివలె గొర్రెలను పరీక్షించగలవాడు యూరపులోలేడని తేలెను. క్రూగరుఅధ్యక్షుడు చనిపోయిన తరువాత ఆస్థానము బోథాసేనానికి సంక్రమించెను. ఇతనికి ఇంగ్లీషుభాషయందు చక్కని పరిచయముగలదు. కాని ఇంగ్లండులో రాజును మంత్రులును కలసినపుడు, యెల్లపుడును తన స్వభాషలోనే మాట్లాడుట ముఖ్యమని యెంచి అట్లు

జరపెను. ఇది సక్రమమైనపనిగాదని యెవరుఅనగలరు? తన ఇంగ్లీషుజ్ఞానము ప్రకటించుటకొరకు తాను తప్పుచేయు దుస్థితికి యెందుకు లోబడవలయును? మంచిమాట దొరకక వెదుకు కొనుచు తన ఆలోచనాసరళికి యెందుకు అడ్డుతెచ్చుకొన వలెను. బ్రిటిషుమంత్రులు అనుద్దేశ్యముగానైనను తనకు తెలియని ఇంగ్లీషుజాతీయముల వాడవచ్చును. దానిభావము లను గ్రహింపకపోవచ్చును? వారికి తప్పుజబాబు చెప్ప వచ్చును. తాను కలవరపడవచ్చును. ఈ విధముగా తన ఉద్యమము చెడవచ్చును. ఇట్లు అపాయకరమైన ప్రమాద మును తానేలచేయువలెను?

బోయరుపురుషులవలెనే స్త్రీలును నిరాడంబరులు, ధైర్యవంతులు. ఆస్త్రీలయొక్క ధైర్యమువల్లను వారివల్ల తమకు కలిగిన ఉత్సాహ ప్రోత్సాహములవల్లను బోయర్లు బోయరుయుద్ధములో తమరక్తమును కార్చి మహాత్యాగమును చేయగలిగిరి. ఆస్త్రీలకు వైధవ్యమన భయములేదు. తమ భవిష్యత్తును గురించి యోచించుటకే ఒకక్షణమైనను వ్యయము చేయలేను.

బోయర్లు మతమునందు శ్రద్ధగల క్రైస్తవులని నేను పైన చెప్పియుంటిని కాని వారికి యేసుసువార్తయందు నమ్మక మున్నదని చెప్ప వీలుపడదు. నిజము విచారించిన యూరపుకే యీ సువార్తయందు నమ్మకములేదు. కొద్దిమందికే క్రైస్తు యొక్క శాంతిమతము తెలిసినను కొద్దిమందియే అనుసరించి

నను తాము ఈ సువార్తను గౌరవించుచున్నట్లు యూరపువారు చెప్పుకొందురు. కాని యీ బోయర్లలో వీరికి ఈ సువార్త పేరు మాత్రమే తెలుసును. వారు పాతబైబిలును భక్తితో చదువుదురు. అందులోగల యుద్ధవర్ణనలను వల్లెపెట్టుదురు. "కంటికి కన్ను పన్నుకు పన్ను" అను మోజస్ సిద్ధాంతమును పూర్తిగా వీరు అంగీకరింతురు. అట్లే ఆచరింతురు.

తమ స్వాతంత్ర్యమును నిలుపుకొనుటకు అన్నికష్టములు పడవలెనని తమ మతము బోధించుచున్నట్లు బోయరుస్త్రీలు అర్థముచేసుకొనిరి. కాన ఓర్పుతో సంతోషముతో అన్నికష్టములను వారు భరించిరి. వారి మనోభావమును ధైర్యమును భంగము జేయుటకు కిచనర్ ప్రభువు అన్నివిధముల ప్రయత్నించెను. వారిని ప్రత్యేకశిబిరములలో నుంచెను. అచట వారు చెప్పనలవిగాని బాధలు పడిరి. తిండిలేక మలమల మాడిరి. కరిచెడి చలిని, మాడ్చెడి యెండను, సహించిరి. ఒకొ్కకపుడు కల్లుతాగి మత్తెక్కియో, కామముచేత పిచ్చెక్కియో, ఒకొ్కక్క సైనికుడు సంరక్షణలేని ఈ స్త్రీలపైబడి బలాత్కారముచేయ ప్రయత్నించవచ్చును. కాని ఆధీరులైన బోయరుస్త్రీలు రవంతయైన జంకలేదు. చిట్టచివరకు ఈ పరిస్థితిని తాను సహించజాలననియు, ఈ బోయర్లను లొంగజేయుటకు ఇది ఒక్కటే మార్గమైన యెడల ఈరీతిని యుద్ధము సాగించుటకంటె యేవిధమయిన సంధికైనను తాను ఒప్పుకొందు ననియు, వెంటనే ఈ యుద్ధమును ముగించమనియు, ఎడ్వర్డుచక్రవర్తి కిచ్నరు ప్రభువుకు ఉత్తరము వ్రాసెను.

వీరి ఆవేదనయొక్క ఘోష ఇంగ్లండు చేరినపుడు ఇంగ్లీషుప్రజలును మిక్కిలి బాధనొందిరి. బోయర్ల ధైర్యమును వారు మిక్కిలి మెచ్చుకొనిరి. ప్రపంచమంత విశాలము గల తనసామ్రాజ్యముతో ఒక చిన్నజాతి ఇన్నాళ్లు యుద్ధము చేయుట వారి మనస్సులలో ముల్లువలె గ్రుచ్చుకొనుచుండెను. కాని ఈ ప్రత్యేకశిబిరములలోని బోయరుస్త్రీలు పొందిన ఆవేదన వారిద్వారాగాక, వారి పురుషులద్వారాగాక (ఈపురుషులు యుద్ధరంగమున పౌరుషముతో పోరుసలుపుచుండిరి.) అప్పుడు దక్షిణాఫ్రికాకు విచ్చేసిన ఔదార్యులైన కొద్దిమంది ఆంగ్లేయ స్త్రీపురుషులద్వారా ఇంగ్లండు చేరినపుడు ఇంగ్లీషు ప్రజలు పరితాపపడి విముఖులు కాజొచ్చిరి. చనిపోయిన సర్ హెన్రీ కాంపుబెల్, బేనర్మన్, ఇంగ్లీషుజాతి హృదయమును గ్రహించి యుద్ధమును ఖండించెను. చనిపోయిన స్టెడు ఇంగ్లీషువారు ఈయుద్ధములో ఓడిపోవునట్లు దైవము అనుగ్రహించుగాక యని బహిరంగముగా ప్రార్థించెను. అట్టి ప్రార్థనలను సలుపమని ఇతరులను కోరెను. ఇది ఆశ్చర్యకరమైన దృశ్యము. నిజమైన బాధను ధైర్యముగా సహించినయెడల రాతిగుండె అయినను కరుగును. అదియే బాధయొక్క లేక తపస్సుయొక్క శక్తి. సత్యాగ్రహముయొక్క అంతర్యము అందులోనే ఇమిడి యున్నది.

దీని ఫలితముగా ఉభయులమధ్య వెరీనీజంగు సంధి యేర్పడెను. కాలక్రమమున దక్షిణాఫ్రికాలోని నాలుగు

వలసలును ఒక్క ప్రభుత్వముక్రింద కలసిపోయెను. వార్తాపత్రికలను చదువు భారతీయులకు ఈ సంధి సమాచారము తెలియును. కాని దానినిగురించిన కొన్ని హంశములు సామాన్యులకు తెలియనివి ఇచ్చట చెప్పవలెను. ఆసంధిపత్రము దస్కతు అయిన వెంటనే యేకప్రభుత్వ మేర్పడలేదు. ప్రతివలసయు స్వంతశాసనసభ యుంచుకొనెను. శాసనసభకు మంత్రిమండలి పూర్తిగా బాధ్యతవహించలేదు. ట్రాన్సువాలును, ఆరెంజి ఫ్రీస్టేటుయున్ను, చక్రవర్తి పరిపాలనకు లోబడిన వలసరాజ్యముల పద్ధతినే పరిపాలించబడెను. ఇట్టి సంకుచితమైన స్వాతంత్ర్యముతో బోథాసేనానియు స్మట్సుసేనానియు తృప్తిపొందువారుకారు. వారు ఆ శాసనసభలనుండి దూరముగానుండిరి. వారు సహాయనిరాకరణమునుబూనిరి. ప్రభుత్వముతో యేవిధమైన సహాయము చేయమని గట్టిగా నిరాకరించిరి. మిల్నరు ప్రభువు ఘాటుగామాట్లాడెను. బోథా తననుగురించి అంత అభిమానము ప్రాముఖ్యతవహించనక్కరలేదనియు, ఆయన లేకున్నను దేశప్రభుత్వము బాగానే సాగుననియు మిల్నరు మందలించెను. హేమ్లెటునాటకమును హేమ్లెటు లేకుండగనే మిల్నరు ఆడజూచెను.

బోయర్ల ధైర్యమును స్వాతంత్ర్యప్రేమను స్వార్థత్యాగమును ఆవంతయును లోటులేకుండ నేను పొగడియుంటిని. కాని వారికష్టకాలములో వారిలోవారికి అభిప్రాయభేదములు లేవని గాని వారిలోగూడ దుర్బలులు (జోహాకు

ములు) లేరని గాని నా అభిప్రాయముకాదు. తేలికగా తృప్తి పకు బోయర్లను దగ్గరకుచేర్చి మిల్నరు ఒకకక్ష నేర్పాటు చేసెను. వీరి సహాయముతో శాసనసభను జరుపగలుగుదునని యెంచెను. నాటకమైనను ప్రధాననాయకుడు రంగస్థలము నందులేనిది జరుగదు. ఈ మామూలు ప్రపంచములో పరిపాలకుడుగా నుండుపాడు, తాను నిర్వహించవలసిన పరిస్థితులలో నున్నట్టి ప్రధాననాయకుని తృణీకరించి తాను గెలుపు పొందదలచినయెడల, అట్టివానిని పిచ్చివాడనియే వర్ణించవలెను. మిల్నరుప్రభువుయొక్క స్థితి అట్లే అయినది. అతను ఎంత డాబుచేసినను బోథా సేనాని సహాయములేకుండ ట్రాన్సువాలును, ఆరెంజిఫ్రీస్టేటును, పాలించుట అసాధ్యముగా కనుపడెను. అనేకమారులు తన తోటలో కలవరపడిన చిత్తముతో, తత్తరపాటుతో పచారచేయుట తటస్థించెను. వెరీనీజింగు సంధివలన బోయర్లకు తక్షణామే సంపూర్ణమైన ఆంతరంగిక స్వపరిపాలనమునకు హక్కుకలదని బోథా సేనాని స్పష్టపరిచెను. ఆ సంధిపత్రమునకు అట్లు అర్థమైనదని చెప్పెను. అట్లు అభిప్రాయపడనియెడల తాను సంధిపత్రము మీద దస్కతుకూడ చేసియుండనని చెప్పెను. బోథా సేనానికి తాను అట్టి అభయమియ్యలేదని కిచనర్ ప్రభువుజబాబు చెప్పెను. బోయర్లు తమరాజభక్తిని రుజువుచేసినకొలది క్రమేణా పూర్తి స్వపరిపాలనము బోయర్లకివ్వబడునని కిచనర్ తెలిపెను. ఈ ఇద్దరిమధ్య ఎవరు తీర్పరి ? పంచాయితీకి

పొమ్మని సూచించినయెడల బోథా సమ్మతించునని యెవ రనుకొందురు ? ఆకాలములోని సామ్రాజ్యప్రభుత్వము ఈ విష యములో చేసినతీర్పు వారికి మిక్కిలి గౌరవప్రదముగా నున్నది. ఆఖరారుకు రెండవవారును దుర్బలులు అయిన కక్ష యేఅర్థముచెప్పిరో, దానిని బలీయులైన కక్ష అంగీకరిం చవలెనని వారు ఒప్పుకొనిరి. సత్యధర్మసిద్ధాంతముల ప్రకా రము ఇదియే సరియైన వ్యాఖ్యాననియమము. నేను యేదియో చెప్ప నుద్దేశించియుండవచ్చును; కాని నాపాఠకుడు లేదా నాశ్రోత అతనికి సంబంధించినంతవరకు నావ్రాతకు లేదా నాభాషకు ఏ అర్థమును ఆరోపించుచున్నాడో అదియె సరి యైన అర్థమని నేను ఒప్పుకొనవలెను. మన జీవితములో ఈ సువర్ణసూత్రములను అనేకమారులు భంగముచేయుచు న్నాము. అందువల్లనే అనేకకష్టములు వచ్చుచున్నవి. అర్ధ సత్యము, అసత్యముకంటె హీనము. అదిసత్యవిధిని నెఱవే ర్పజాలదు.

ఇట్లు సత్యము అనగా వ్యవహారములో జనరల్ బోథా పూర్తిగా గెలిచినపుడు, ఆతను పనికిబూనెను. క్రమేణా అన్ని వలసలు యేకమయ్యెను. దక్షిణాఫ్రికాపూర్తిస్వపరిపాలనమును పొందెను. దానిజండా బ్రిటిష్‌జండాయే. భూగోళశాస్త్ర పటములలో దానిరంగు యెరుపురంగే. కాని దక్షిణాఫ్రికా సంపూర్ణస్వాతంత్ర్యముగల దేశమని చెప్పుటలో అతిశయో క్తిలేదు. దక్షిణాఫ్రికాప్రభుత్వపు సమ్మతిలేనిది ఒక్కపైసా

యైనను బ్రిటిషుసామ్రాజ్యము గైకొనజాలదు. అంతేగాదు. దక్షిణాఫ్రికా బ్రిటిష్‌జండాను తొలగించి పేరులోగూడ స్వాతంత్ర్యము పొందదలచినయెడల, వారట్లు చేయుటకు ఏ ఆటంకమునులేదని బ్రిటిష్ మంత్రులు అంగీకరించిరి. బోయర్లు ఇంతవరకు ఈ యెత్తువేయలేదంటే, దానికి తగిన కారణములుగలవు. బోయరునాయకులు వివేకము దూరదృష్టి సూక్ష్మబుద్ధి కలవారు. తమకు యెట్టినష్టములేని భాగస్వామ్యమును బ్రిటిషుసామ్రాజ్యముతో నిలుపుకొనుటయందు వారికి ఆక్షేపణ కనుపడలేదు. వారికి ఇంతకంటె మించిన వ్యవహార కారణము ఒకటికలదు. నేటాలులో ఇంగ్లీషువారి జనాభా హెచ్చు. కేపుకాలనీలో ఇంగ్లీషువారును బోయర్లును షుమారుగా సరిసమానము. జోహనిస్‌బర్గులో ఇంగ్లీషువారు అత్యధికులు. ఇందుచేత దక్షిణాఫ్రికాలో సంపూర్ణప్రజాస్వామ్యప్రభుత్వమును యేర్పరుచుటకు బోయర్లు ప్రయత్నించిన యెడల అన్యోన్యవినాశకమైన పోరాటమును, బహుశః జాత్యంతరయుద్ధమును సంభవించును. కావుననే బ్రిటిషుసామ్రాజ్యములో దక్షిణాఫ్రికా ఒకభాగముగా సాగుచున్నది.

ఈదక్షిణాఫ్రికా సంయోగమును దాని రాజ్యాంగమును యెట్లు యేర్పడినవో గమనించదగియున్నవి. వలస రాజ్యములలోని శాసనసభలవల్ల నియమింపబడి అన్నికక్షులకు ప్రాతినిధ్యము వహించిన ప్రతినిధులు ఒక జాతీయసభగా యేర్పడిరి. వారు యేకగ్రీవముగా ఒక చిత్తురాజ్యాంగచట్ట

మును యేర్పాటుచేసిరి. దానినే బ్రిటిషు పార్లమెంటు పూర్తిగా అంగీకరించవలసి యుండెను. కామన్సుసభ్యులలో నొకరు ఆచిత్తుచట్టములో ఒక వ్యాకరణదోష మున్నదని చూపించి దానిని మార్చుమని సలహానిచ్చెను. ఆసలహాను నిరాకరించుచు నిర్దోషమైన భాష రాజ్యాంగము నకుఘటకు అవసరముకాదనియు బ్రిటిషు మంత్రిమండలికిని దక్షిణాఫ్రికా మంత్రులకును మధ్య జరిగిన రాయబారములవల్ల ఈచిత్తు చట్టము యేర్పడెననియు దానిలో వ్యాకరణదోషములు సవరించుటకైనను బ్రిటిషుపార్లమెంటుకు హక్కు యివ్వబడ లేదనియు అప్పటి ప్రధానమంత్రి కాంపుబెల్ బానర్ మను తెలియజేసెను. కాబట్టి ఆచిత్తు చట్టము ఉన్నది ఉన్నట్టుగా ఏసవరణలేకుండా బ్రిటిషు పార్లమెంటు అంగీకరించెను.

ఈ సందర్భములో గమనించదగిన విషయ మొకటి గలదు. ఈ సంయోగచట్టములో కొన్ని నియమములు మామూలు పాఠకునకు నిరర్థకముగా కనుపడును. వానివలన ఖర్చులుకూడా అధికముగా పెరిగినవి. ఆచట్టము చేసినవారు ఇది చూడకపోలేదు. వారి ఉద్దేశ్యము సంపూర్ణత్వము సంపాదించుటకాదు. సమాధానమువలన సామరస్యమును సంపాదించుటయు, రాజ్యాంగమును జయప్రద మొనర్చుటయు వారి ముఖ్యఉద్దేశ్యము. అందువలన వారు నాలుగు రాజధానులును నిలిపిరి. ఏ వలసరాజ్యమును తన రాజధానిని పోగొట్టుకొనుటకు సమ్మతించలేదు. అట్లే పూర్వపు శాసనసభలను తీసివేసి

నను క్రొత్త రాష్ట్రీయసభలను తక్కువ అధికారములతో నెల కొల్పిరి. గవర్నరు పదవులు తీసివేసినను తత్తుల్యమైన ఉద్యో గస్తులను రాష్ట్రపాలకులు అనుపేర నియమించిరి. నాలుగు శాసనసభలు, నాలుగు రాజధానులు, నలుగురు గవర్నరులు, అనవసరమనియు ఆడంబరం మాత్రమేననియు ప్రతివానికిని తెలియును. కాని దక్షిణాఫ్రికాలోని కుశాగ్రబుద్ధులయిన రాజ్యతంత్రధురీణులు వీనిని లక్ష్యపెట్టలేదు. ఈ యేర్పాటు డాంబికముగానుండి ఖర్చును పెంపుచేయుచున్నది. కాని ఐక మత్యము కోరదగియుండెను. అందుచేత పరుల విమర్శనము లెక్కపెట్టక అచ్చటి రాజ్యాంగవేత్తలు ఈసంయోగచట్ట మును ఈ ప్రకారముగానే తయారుచేసి బ్రిటిషుపార్లమెంటు వారి ఆమోదమును పొందిరి.

దక్షిణాఫ్రికా యొక్క చరిత్రను బహు క్లుప్తముగా తెలుపుటకు యత్నించితిని. అది లేనియెడల సత్యాగ్రహ మహాసమరముయొక్క అంతరార్థమును గ్రహించుట కష్టమని నాకు తోచెను. భారతీయులు ఈదేశమునకు యెట్లు వచ్చి నదియు సత్యాగ్రహము ప్రారంభింపకముందు తమచిక్కుల నుండి తప్పించుకొనుటకు యెట్లు కష్టించినదియు ఇప్పుడు తెలుసుకొనవలెను.

---

# 3 వ అధ్యాయము

## భారతీయులు-దక్షిణాఫ్రికా ప్రవేశము

వెనుకటి అధ్యాయములో ఇంగ్లీషువారు ఎట్లువచ్చినది తెలుసుకొనియున్నాము. జూలూలదగ్గరనుండి కొన్నిహక్కులను సంపాదించి వారు నేటాలులో స్థిరపడిరి. నేటాలులో శుభ్రమైన చెఱకు, తేయాకు, కాఫీ, పెంచవచ్చునని వారు కనిపెట్టిరి. అట్టి పంటలను హెచ్చుగా పండించుటకు వేల కొలది కూలీలు కావలెను. ఈ కొద్దిమంది వలన వచ్చినవారు ఈపని చేయజాలరు. నీగ్రోలకు వీరు మొదట ఆశలనుగల్పించి తరువాత బెదరించి, వారిచేత పనిచేయించదలచిరి. కాని బానిసత్వము రద్దుపడినందున ఇది సాగలేదు. కఠినమైన కాయ కష్టములకు నీగ్రోలు అలవాటు పడియుండలేదు. ఏడాదిలో సగకాలము పనిచేసిన నీగ్రో తనకుటుంబమును పోషించుకొన గలడు. అందుచేత వాడు ఏ యజమానికిని సంవత్సరముల తరబడి పనిచేయుటకు యేలఒప్పుకొనవలెను? స్థిరమైనకూలి ముఠాలేనిది ఇంగ్లీషువారికి ఈ తోటలు సాగవు. కాన వారు ఇండియాప్రభుత్వముతో రాయబారమాడ మొదలిడిరి. కూలీలనిప్పించుటలో వీరిసహాయమును కోరిరి. ఆప్రభుత్వము వారు అంగీకరించిరి. బీరారుకూలీల మొదటిముఠా ఇండియా నుండి నేటాలుకు ౧౬-౧౧-౧౮౬౦ తేదీని చేరెను. ఆ తేది

ఈచరిత్రకు ముఖ్యమైనదినము. ఇట్లు వారు రానియెడల దక్షిణాఫ్రికాలో భారతీయులు ఉండరు. సత్యాగ్రహము జరిగియుండదు. ఈ పుస్తకము వ్రాయబడియుండదు.

ఇండియాప్రభుత్వమువారు ఈ పనిచేయుటలో మంచి సలహా పొందలేదని నా అభిప్రాయము. ఇచ్చటి బ్రిటిషు ఉద్యోగస్తులు యెరిగియో యెరుగకనో నేటాలులోని వారి సోదరులయెడ పక్షపాతముతో ప్రవర్తించిరి. కూలీల ప్రయోజనములను సంరక్షించుటకు తగిన షరతులను వీలైనంతవరకు ఖరారునామాలో చేర్చినమాట నిజమే. భోజనమునుగూర్చి సామాన్యముగా మంచియేర్పాట్లే చేయబడెను. కాని అక్షరముక్క యెరుగని యీకూలీలు దూరదేశమునకు బోయి అచటకష్టములేమైనను సంభవించినయెడల యెట్లు తప్పించుకొనగలుగుదురు, అను సమస్య పూర్తిగా విచారింపబడలేదు. వారి మతవిషయమైన అవసరములనుగాని వారి నీతినికాపాడుటనుగూర్చిగాని ఆలోచించనే లేదు. బానిసత్వమును శాసనముద్వారా రద్దుపరచినను తమవద్ద పనిచేయు సేవకులను బానిసలుగావించెడి కోరిక యజమానులకు తొలగియుండదు, అను అంశములైనను వారు గమనించియుండలేదు. నేటాలుకు వెళ్ళిన కూలీలు కొంతకాలము బానిసలుగా ఉండవలసివచ్చును అను సంగతి వారు గ్రహించలేదు. అట్లు వారు గ్రహించి ఉండవలసినది. ఈకూలీల పరిస్థితులను చక్కగా తెలుసుకొనిన చనిపోయిన సర్. డబ్లియు, డబ్లియు. హంటర్

ఈసందర్భములో ఒకప్రసిద్ధమైన వాక్యము నుడివెను. నేటాలులోని ఈ భారతకూలీలను గురించి వ్రాయుచు వారిస్థితి "సగము బానిసత్వము" అని ఆయన వ్రాసెను. ఇంకొకమారు ఒకవుత్తరములో ఈకూలీలస్థితి బానిసత్వసరిహద్దులలోనికివచ్చి నిలచినదని వ్రాసెను. నేటాలులోకెల్ల ప్రముఖులైన హారీయస్కొంబా అను చనిపోయిన అయిరోపీయుడు ఒక విచారణసంఘముయెదుట సాక్ష్యము ఇచ్చుచు ఇంతవరకు నిజమేనని యొప్పుకొనెను. ఇండియాప్రభుత్వమునకు ఈ విషయమై పంపిన మహజర్లలో పొందుపరుపబడిన నేటాలులోని ఐరోపీయప్రముఖుల కైఫీయతులవలనగూడ ఇట్టి సాక్ష్యము తేలికగాదొరకుచున్నది. కాని విధివిహితము జరుగకతప్పదు. నేటాలుకు ఈకూలీలను తెచ్చినఓడయే రాబోవు సత్యాగ్రహమహోద్యమముయొక్క బీజములను ఆకూలీలతోకూడ తీసుకొని వెళ్లెను.

నేటాలుకు కూలీలను బంపు ఖాయిదాదార్లు ఏవిధముగా ఈకూలీలను మోసపుచ్చినదియు, ఆ మోసమునకు లోబడి వారు యెట్లు మాతృదేశమును వీడినదియు, వారు నేటాలుచేరగనే వారికండ్లు యెట్లు తెరువబడినదియు, తెరువబడినమీదట కూడ వారు ఎట్లు అక్కడనే నిలిచినదియు, తరువాత ఇతరులెట్లు వీరిననుసరించివచ్చినదియు, మతమును నీతియు చెప్పెడి అన్నినియమములును వీరెట్లు భగ్నపరిచినదియు, మరింతఖచితముగా చెప్పినయెడల ఈ నియమములే

యెట్లు నశించినదియు, ఈదౌర్భాగ్యప్రజలలో పెండ్లిఅయిన స్త్రీకిని ఉంపుడుగత్తెకును ఎట్లు భేదములేకుండపోయినదియు, వర్ణించుటకు నాకీపుస్తకములో తగినతావులేదు.

ఈ ఖరారు కూలీలు నేటాలు వచ్చెనను కబురు మారీషస్ ద్వీపము చేరగానే, ఇట్టికూలీలతో సంబంధముగల భారతీయవర్తకులు ఈకూలీల వెంటనంటి నేటాలు వచ్చుటకు ప్రోత్సహించబడిరి. మారీషస్ ఇండియానుండి నేటాలునకు పోవు దారిలో నున్నది. వేలకొలది భారతీయులు, కూలీలును, వర్తకులును అక్కడ కాపురముండిరి. అచ్చటి భారతవర్తకు డొకడు చనిపోయిన సేఠ్. అబూబకిర్ ఆమద్ నేటాలులో ఒక దుకాణము పెట్టదలచెను. నేటాలులోని ఆంగ్లేయులు భారతీయవర్తకుల శక్తిసామర్థ్యములను అప్పుడు ఊహించ లేదు. లక్ష్యమును చేయలేదు. ఖరారుకూలీల తోడుతో వారు చెఱకు, తేయాకు, కాఫీ మొదలగు పైరులను లాభసాటిగా పండించుచుండిరి. పంచదార తయారుచేసిరి. వింత పడతగినంత కొద్దికాలములో దక్షిణాఫ్రికాకు కావలసిన పంచదార, తేయాకు, కాఫీలను చాలావరకు వారు ఇవ్వగలిగిరి. వారికి అమితమైన లాభమువచ్చెను. రాజమందిరములవంటి ఇండ్లు కట్టుకొనిరి. ఎడారిగానున్న ప్రదేశములను సొంపైన తోటలుగా మార్చిరి. అట్టి స్థితిలో అబూబకర్ వంటి న్యాయవంతుడును ధైర్యవంతుడును అయిన వర్తకుడు తమమధ్యను కాపురము చేయుటను వారు సహజముగా లక్ష్యముచేయ

లేదు. ఇంతేగాక ఒక ఆంగ్లేయుడు ఇతనితో భాగస్థుడుగా చేరెను. అబూబకర్ వర్తకముచేసి భూమిని కొనెను. వీని ఐశ్వర్యమును గూర్చినకథ స్వగ్రామమగు పోరుబందరుకును ఆచుట్టుప్రక్కల ప్రదేశములకును వ్యాపించెను. అందుచేత ఇతర మెమాన్ మహమ్మదీయులు నేటాలు వచ్చిరి. సూరత్ నుండి బోరామహమ్మదీయులు వచ్చిరి. వీరికి లెఖ్ఖలుంచుటకు గుమాస్తాలు కావలసి యుండెను. గుజరాత్ కత్తియావాడు నుండి హిందూ గుమాస్తాలు వీరి ననుసరించిరి.

ఇట్లు రెండు తరగతుల భారతీయులును నేటాలులో నివసించిరి. ౧ స్వతంత్రముగల వర్తకులు వారితాలూకు స్వతంత్రముగల నౌకర్లు. ౨ కరారు కూలీలు. కాలక్రమేణ ఈ కరారు కూలీలకు సంతతి కలిగెను. వీరు కూలిచేయుటకు బాధ్యులు కారు. కాని ఆదేశపు చట్టములలోని కఠిననియమములు వీరికిని వర్తించెను. బానిసల సంతానము బానిసత్వపు ముద్రను మెట్లు తప్పించుకొనగలరు. నేటాలుపోయిన కూలీలు అయిదు సంవత్సరములవరకు ఖరారువల్ల బద్ధులైయుండిరి. ఆకాలము దాటిన పిమ్మట కూలిచేయవలసిన నిర్బంధము వారికిలేదు. వారు కోరినయెడల నేటాలులో నివసించి స్వతంత్రముగా కూలిగాని వర్తకముగాని చేసుకొనుటకు హక్కు గలదు. కొందరు అట్లు నిలువబడిరి. మరికొందరు మాతృదేశమునకు తిరిగి వెళ్లిరి. ఇట్లు నిలువయున్నవారు "స్వతంత్ర భారతీయు" లని పిలువబడిరి. వీరి ప్రత్యేకస్థితి తెలుసుకొనుట అవసరము. మొదటి తరగతిగా చెప్పిన సంపూర్ణముగా

స్వతంత్రీనుగల భారతీయులకు ఉండు హక్కులన్నియు వీరికి లేవు. ఎట్లన వీరు ఒక చోటునుండి మరొకచోటునకు పోవలసిన యెడల రహదారిచీటి ఉండవలెను. వీరు పెండ్లిండ్లు చేసుకొని ఆపెండ్లిండ్లు చట్టప్రకారము సవ్యమైనవని అంగీకారము పొంద దలచిన యెడల "భారతదేశమునుండి వచ్చిన జనుల సంరక్షకుడు" అను పేరుగల ఉద్యోగస్థునివద్ద తమ వివాహనిదర్శనములను భద్రపర్చవలెను. మరికొన్ని కఠినసీమములకు వారు లొంగవలసి యుండెను.

ఖరారు కూలీలతోడను స్వతంత్రభారతీయులతోడను మాత్రమేగాక నీగ్రోలతోగూడ వర్తకము చేయవచ్చునని భారతవర్తకులు గ్రహించిరి. యూరపియనువర్తకులను జూచి భయపడుచున్న నీగ్రోలకు భారతవర్తకులు సహాయకారులుగా నుండిరి. యూరపియను వర్తకుడు నీగ్రోతో వర్తకము చేయనెంచెను. కాని నీగ్రోలను వీరు మర్యాదగా చూతురను మాట ఊహించ వీలుకాదు. నీగ్రోలు యిచ్చిన పైకమునకు తగిన ప్రతిఫలము వారికి ముట్టినయెడల అదృష్టవంతులమే యని నీగ్రోలు అనుకొనుచుండిరి. నీగ్రో నాలుగు షిల్లింగుల ఖరీదుగల వస్తువునుకొని ఒకపౌను ఇచ్చినయెడల తక్కిన పదహారుషిల్లింగులకు బదులు నాలుగుషిల్లింగులు మాత్రమే యూరపియనువర్తకు డిచ్చుచుండును. ఒక్కొక్కప్పుడు అదియును లేదు. ఈదురదృష్టుడైన నీగ్రో తక్కినపైకము ఇవ్వమని అడిగినను రావలసినదానికన్న తక్కువవచ్చినదని చూపించినను చెప్పరానితిట్లే వానికి జబాబుగా ముట్టుచుండును.

ఇంతటితో ఆగినయెడల వానిజాతకముమంచిదే. ఒక్కొక్క ప్పుడు ఈ తిట్టుకుతోడు ఒకదెబ్బ, ఒకతన్ను, కొసరుగా ముట్టుచుండును. నీగ్రోలకు ఇట్టికష్టమైన అనుభవములు కలుగుచుండెను. ఆంగ్లేయ వర్తకులందరును ఇట్లు ప్రవర్తించిరని నేను సూచించతలచలేదు. ఇట్టి విపత్తులు చాలమట్టుకు కలవని నిర్భయముగా చెప్పవచ్చును. భారతీయవర్తకులన్ననో నీగ్రోలతో మంచిగామాట్లాడి, వారితో అప్పుడప్పుడు పరిహాసములుకూడ ఆడుచుండిరి. అమాయకుడైన నీగ్రో దుకాణములో అడుగుబెట్టి తాను కొనదలచిన వస్తువును పట్టుకొని పరీక్షించిచూడకోరుచుండును. భారతీయవర్తకులు దీనికి అనుమతించిరి. ఇట్లుచేయుటలో వారికిని ధర్మోద్దేశములులేని మాట నిజము. స్వార్థముకొరకే చేసియుందురు. అవకాశము దొరికినయెడల నీగ్రో బేరగానిని మోసముచేయుటకు భారతీయుడును వెనుదీయుండడు. కాని వీడుచూపిన ఆదర గౌరవములవల్ల నీగ్రోలలో ఇతడు రంజకుడయ్యెను. మరియు భారతీయవర్తకుడుజూచిన నీగ్రో కెన్నడును భయము లేదు. నీగ్రోను మోసముచేయజూచిన భారతీయవర్తకుని కనిపెట్టినపుడు వారు వీనిని దేహశుద్ధి చేయుచుండుటకూడ తటస్థించుచుండెను. హెచ్చుదభాలు నీగ్రో బేరగాండ్లే భారత వర్తకులను దూషించుచుండిరి. భారతీయులు నీగ్రోలుమధ్య మొత్తముమీద భారతీయులే నీగ్రోలనుజూచి భయపడుచుండిరి. ఫలితమేమనగా నీగ్రోలతోడివర్తకము భారతీయ

వర్తకులకు మిక్కిలి లాభకరముగా నుండెను. దక్షిణాఫ్రికాలో అన్నిచోట్లను ఈ నీగ్రోలుకలరు.

౧౮౮౦ సంవత్సరము ఆప్రాంతముల ట్రాన్సువాలులోను ఆరింజిఫ్రీస్టేటులోను బోయరు ప్రజాస్వామిక ప్రభుత్వములు ఉండెను. ఈప్రభుత్వములలో నీగ్రోలకు అధికారమే లేదని నేను చెప్పనక్కరయే లేదు. అది అంతయు తెల్లవారల వ్యవహారమే. భారతీయులు బోయరులతో గూడ వర్తకము చేయవచ్చునని వినిరి. ఈబోయర్లు తాము అమాయకులు నిరాడంబరులు బోళాలు గనుక భారతీయులతో వర్తకము చేయుట తమ మర్యాదకు లోపమని యెంచలేదు. అందుచేత ఈ రెండు రాష్ట్రములలోనికి భారతీయవర్తకులు చాలమంది వెళ్లి అక్కడ దుకాణములు పెట్టిరి. అచ్చట అప్పుడు అరెూ మార్గములు లేవుగాన ఎక్కువగా లాభములు సంపాదించిరి. బోయర్లతోను నీగ్రోలతోను విరివిగా వర్తకము చేసిరి. భారతీయుల ఆశాప్రతీక్ష లన్నియు సఫలమయ్యెను. అట్లే కొందరు భారతీయవర్తకులు కేపుకాలనీకి బోయి అచ్చట బాగా లాభము సంపాదింప మొదలిడిరి. ఇట్లు నాలుగువలసలలోను భారతీయులు కొద్దికొద్దిగా వ్యాపించియుండిరి.

సంపూర్ణముగా స్వతంత్రముగల భారతీయులు ఇప్పుడు నలుబది లేక యాబదివేలు యుందురు. స్వతంత్రభారతీయులు అని పిలువబడువారు అనగా కరారునుండి విడిపోయిన కూలీలును వారి సంతానమును ఒక లక్షమంది యుందురు.

## 4 వ అధ్యాయము

## ఇబ్బందుల వివరములు – నేటాలు

నేటాలులో నున్న యూరపియను తోటయజమానులు బానిసలనే కోరిరి. కరారులు పూర్తి అయిన పిమ్మట ఆ దేశములో నిలచి యెంతకొద్దిగా నైనను తమతో పోటీచేయు కూలీలను వారించుకొనజాలరు. ఇండియాలో వ్యవసాయములోగాని ఇతరవృత్తులలోగాని నిలువలేనివారే కరారుకూలీలుగా నేటాలుకు బోయినమాట నిజమే. అనుమానములేదు. అయినను వారికి వ్యవసాయము అచ్చుగా తెలియదనిగాని భూమివిలువ గ్రహించలేరనిగాని అనుకొనరాదు. నేటాలులో కాయగూరలు మాత్రమే పెంచినను చక్కగా ఆదా వచ్చుననియు, కొంచెము భూమిని తాము సంపాదించిన యెడల మరింత ఆదా వచ్చుననియు, వారు కనుగొనిరి. కాన చాల మంది కరారుకాలము పూర్తికాగానే కొద్దిగా వర్తకమునో ఇతరవృత్తినో చేయసాగిరి. నేటాలు కాపురస్తులకు ఇది మొత్తముమీద లాభకరమే. అదివరకు తగిన వ్యవసాయదారులు లేనందువలన పెంచబడని కాయగూరలు ఇప్పుడు దొరకుచుండెను. ఇదివరకు కొద్దిగాదొరకు రకములు ఇప్పుడు మెండుగా దొరకుచుండెను. కాయగూరల ధరలును తగ్గుచుండెను. యూరపియను తోటయజమానులకు ఈ అభివృద్ధి రుచించలేదు. ఇదివరకు తమకొక్కరికే సర్వాధికారము గల

రంగములో ఇప్పుడు పోటీదారులు వచ్చిరని వారు భావించిరి. ఈ కరారు దాటిపోయిన కూలీలకు వ్యతిరేకముగా ఒక ఉద్యమము స్థాపించబడెను. పాఠకుడు ఈ చిక్రమును కనిపెట్ట వచ్చును. ఒకవైపున యూరపియనులు ఎక్కువ ఎక్కువగా కూలీలను కోరుచుండిరి. ఇండియా నుండి వచ్చినవారిని తేలికగా తీసుకొనుచుండిరి. రెండవ వైపున కరారు గడిచిన కూలీలను అనేకవిధముల ఇబ్బందిపెట్టుటకు ఆందోళన సాగించుచుండిరి. ఈ కూలీలు చేసిన కష్టమునకును చూపిన నేర్పరితనమునకును ఇదియే బహుమతి.

ఈ ఉద్యమము అనేకరూపములు దాల్చెను. ఈ ఆందోళనపరులలో ఒకమతా, ఈక్రిందిమగతులను కోరిరి. ౧ కరారు ముగించిన కూలీలు తిరిగి ఇండియాకు పంపబడవలెను. ౨ కాన ఇండియానుండి క్రొత్తగావచ్చు కూలీలు యేర్పరుచుకొను కరారులలో ఒకక్రొత్తషరతు ఉండవలెను. దాని ప్రకారము వారు తిరిగి కరారులోనైనను చేరవలెను లేదా భారతదేశమునకు నిర్బంధముగానైనను పంపబడవలెను. అయిదు యేండ్లు నిండినపిమ్మట తిరిగి కరారులో ప్రవేశించని కూలీలపై బరువైన తలపన్ను వేయవలెనని రెండవముతావారు కోరిరి. ఈరెండు ముతాలకును ఉద్దేశ్యము ఒకటియే. ఏమన మంచిగనో చెడుగనో కరారు ముగించిన కూలీలందరును నేటాలులో యేపరిస్థితులలోగూడ స్వతంత్రులుగా నుండుటను దుస్సాధ్యము చేయుటయే వీరికోరిక. ఈఆందోళన ఘోర

మయ్యెను. ప్రభుత్వము వారు ఒకవిచారణసంఘము నేర్పరిచిరి. రెండువిధముల ఆందోళనకారకులయొక్క కోరికలును మిక్కిలి అక్రమముగా నుండెను. ఈకరారు ముగించిన కూలీలు అచ్చట యుండుట మొత్తము జనాభాకు ఆర్థికముగా స్పష్టముగా లాభముగా నుండెను. అందుచేత ఈ విచారణసంఘము వారు విచారించిన స్వతంత్రసాక్ష్యము ఆందోళకులకు వ్యతిరేకమయ్యెను. వీరికి తాత్కాలికముగా చెప్పదగిన ఫలితము గలుగలేదు. కాని మంటను చల్లార్చినను, దాని గుర్తులు వెనుక నిల్చును. అట్లే నేటాలు ప్రభుత్వమువారు ఈఆందోళనవలన కొంతిమార్పు బొందిరి. అట్లు గాక ఎట్లుండవచ్చును? ఈనేటాలు ప్రభుత్వముతో యజమానులు స్నేహముగా నుండిరి. కాన వారు భారతదేశప్రభుత్వముతో ఉత్తరప్రత్యుత్తరములు జరిపి ఈ ఆందోళకుల సలహాలను వారికి తెలియ చేసిరి. కరారుకూలీలను శాశ్వితబానిసత్వమునకు దింపదగిన ఈ సలహాలను భారతప్రభుత్వమువారు వెంటనే అంగీకరింప జాలకపోయిరి. అంత దూరదేశమునకు కరారులక్రింద కూలీలను పంపించుటకు మీషగాని సమాధానముగాని యేమనగా ఆ కరారు ముగించిన పిమ్మట వారచ్చట నిలబడి తమశక్తులను అభివృద్ధిపరచుకొని తమ ఆర్థికస్థితులను పెంపొందించుకొనవచ్చునను ఆశను కల్పించుటయే. అప్పటికి నేటాలు, చక్రవర్తి పరిపాలనకు లోబడిన వలసరాజ్యము. వలసమంత్రియే దీని పరిపాలనకు పూర్తిబాధ్యత వహించెను. అందుచేత తమ

అన్యాయపు కోరికలను తృప్తిపరచుకొనుటకు ఆవైపునుండి వీరికి సహాయము దొరకదు. ఇట్టి అనేక కారణములవలన బాధ్యతాయుతప్రభుత్వము సంపాదించుటకు ఒక ఉద్యమము స్థాపించిరి. చివరకు ౧౮౯౩ సంవత్సరములో అది వీరికి లభించెను. అంత నేటాలు తమబలమును కనుగొనసాగెను. నేటాలు కోరిన యేకోరికనైనను అంగీకరించుటకు వలసమంత్రికి అప్పటినుండి కష్టములేదు. ఈ నేటాలులోని బాధ్యతాయుత ప్రభుత్వమునుండి ప్రతినిధులు భారత ప్రభుత్వముతో సంప్రదించుటకు ఇండియాకు వచ్చిరి. ఖరారు గడిచిన ప్రతి భారతీయునిమీదను సంవత్సరమునకు ౨౫ పౌనులు లేక ౩౭౫ రూపాయలు తలపన్ను విధించవలెనని వారు ఉపపాదించిరి. ఏకూలివానికను ఇంతహెచ్చు పన్ను యిచ్చి నేటాలులో స్వతంత్రుడుగా ఉండజాలడు. అప్పటికి ఇండియాకు రాజప్రతినిధిగాయున్న ఎలిజన్ ప్రభువు ఈమొత్తము హెచ్చు అని అభిప్రాయపడి చివరకు 3 పౌనులు తలపన్ను విధించుటకు సమ్మతించెను. కరారుపద్ధతిలో ఆరునెలల సంపాదనకు ఇది సరిపోవును. కూలివాడు ఒక్కడిమీదనే గాక వాని భార్యపైనను ౧౩ యేండ్లు దాటిన వాని కూతుళ్లపైనను ౧౬ యేండ్లు దాటిన వాని కొడుకులపైనను ఈపన్ను వేయబడుచుండెను. ఒకభార్య ఇద్దరు పిల్లలు అయినను లేని కూలియే లేడు. కావున సామాన్యముగా ప్రతి కూలివాడును ఏడాదికి ౧౨ పౌనులు పన్ను కట్టవలసి వచ్చెను. దీనివలన

కలిగెడి ఇబ్బందులను వర్ణించుట దుస్సాధ్యము. వానిని స్వయముగా అనుభవించినవాడే ఆకష్టములను గ్రహించగలడు. ఆకష్టములను కండ్లార చూచినవాడే వానిని ఊహించగలడు. నేటాలు ప్రభుత్వమువారి ఈచర్యపై భారతీయులు అధికమైన ఆందోళన సలిపిరి. సామ్రాజ్యప్రభుత్వమునకును భారతప్రభుత్వమునకును మహజర్లు పంపిరి. ఆమహజర్లవలన పన్నులో కొంత తగ్గింపబడెను గాని వేరే ఫలితమేమియు కలుగలేదు. ఈబీదకూలీలు యేమి అర్థము చేసుకొనగలరు? యేమి చేయగలరు? దేశాభిమానమువల్లను మానవప్రేమవల్లను ప్రేరితులైన భారతీయవర్తకులే కూలీలతరఫున యీఆందోళన జరిపిరి.

సంపూర్ణముగా స్వతంత్రులైన భారతీయులకును ఇంతకంటె మంచికలుగలేదు. ఇదే కారణములనుబట్టి ఇదేవిధమైన ఆందోళనము వారిమీద నేటాలులోని యూరపియను వర్తకులు సాగించిరి. భారతీవర్తకులు సుస్థిరులైయుండిరి. మంచిప్రదేశములలో భూములు సంపాదించిరి. కరారుగడచిన కూలీలసంఖ్య పెరిగినకొలదియు వారికి కావలసిన వస్తువులు అధికముగా అవసరమయ్యెను. వేలకొలది బస్తాలు బియ్యము ఇండియానుండి దిగుమతిచేసి మంచిలాభమునకు అమ్ముచుండిరి. సహజముగా ఈవర్తకమంతయు భారతీయుల చేతులలోనే యుండెను. ఇదిగాక జూలూలతోడి వర్తకములో కొంతభాగమును కూడ వారు సంపాదించిరి. అదిజూచి

యూరపియను చిల్లరవర్తకులకు కన్నులుకుట్టెను. మరియు అప్పటి చట్టప్రకారము అచ్చటి శాసనసభాయెన్నికలలో పాల్గొనవచ్చుననియు అభ్యర్థులుగాకూడ నిల్వవచ్చుననియు భారతీయవర్తకులకు కొందరు ఇంగ్లీషువారు తెలియచెప్పిరి. కావున కొందరు భారతీయులు తమపేరులను ఎన్నికజాపితాలలో చేర్పించుకొనిరి. అందుచేత యూరోపియనురాజకీయవేత్తలు భారతవిరోధులతో చేతులుగలిపిరి. భారతీయుల గౌరవము పెరిగినయెడల వారిస్థితి మరింతబలపడినయెడల నేటాలులో వీరితో యూరోపియనులు పోటీచేయగలరాయని అనుమానించిరి. నేటాలులోని బాధ్యతాయుత ప్రభుత్వమువారు యీ స్వతంత్రభారతీయులను గురించి తీసుకొనిన మొదటిచర్య యేమనగా, ఇదివరకే ఎన్నికదార్లజాపితాలలో సక్రమముగా పేర్లు చేర్చబడినవారుగాక తక్కిన ఆసియా వాసులకందరికిని ఎన్నికలహక్కు తీసివేయుచు ఒక చట్టమునుచేసిరి. నేటాలుశాసనసభలో అట్టి చట్టము మొట్టమొదట ౧౮౯౪ సంవత్సరములో ప్రవేశపెట్టిరి. భారతీయులు అయినకారణముచేతనే వీరికి ఎన్నికహక్కు ఉండరాదను సిద్ధాంతమే ఈ చట్టమునకు పునాది. నేటాలులో జాతిభేదము చేసిన మొదటిచట్టమిదియే. భారతీయులు యీ చట్టమును నిరోధించిరి. ఒక రాత్రిలో ఒక మహాజరును తయారుచేసి ౫౦౦ ల దస్కతులు చేయించిరి. ఈ మహాజరును నేటాలు శాసనసభకు పంపినప్పుడు ఆ సంస్థ త్రుల్లిపడెను. అయినను

చట్టము మంజూరుచేసెను. పదివేల దస్కతులుగల ఒక మహాజరును తయారుచేసి అప్పటు వలసమంత్రిగానున్న రిప్పన్ ప్రభువుకు భారతీయులు పంపిరి. పదివేలు దస్కతులనగా నేటాలులోఉన్న స్వతంత్రభారతీయులు అందరు అన్నమాట. రిప్పన్ప్రభువు ఈ చట్టమును నిరాకరించెను. శాసనములలో రంగుభేదమును ఏర్పరుచుటకు బ్రిటిషుసామ్రాజ్యము అంగీకరింపజాలదు అని ఆయన ప్రకటించెను. ఇది భారతీయులకు ఎంత గొప్పవిజయమో పాఠకుడు తరువాత తెలుసుకొనును. కాని నేటాలుప్రభుత్వము ఈ రంగుభేదమును తొలగించి అప్రత్యక్షముగా భారతీయులకు నిషేధములను కల్పించుచు వేరొక చిత్తుచట్టమును ప్రవేశపెట్టిరి. భారతీయులు దానికి భిన్నముగా ఆందోళనజరిపిరిగాని గెలుపొందలేదు. ఆచట్టము సందిగ్ధముగానుండెను. దాని అర్థమును నిష్కర్షగా తేల్చుటకు ప్రీవీకౌన్సిలువరకు వ్యవహారము చేయుటకు భారతీయులకు వీలుండెను. కాని అది వారు వాంఛనీయమని యెంచలేదు. అంతుపొంతులేని వ్యాజ్యములను వదలుకొనుటలో వారు మంచిపనిచేసిరనియే ఇప్పటికిని నానమ్మకము. చట్టములో రంగుభేదము పెట్టుటకు ప్రభుత్వమునకు వీలుకాకపోవుట చిన్నహంశముకాదు.

తోట యజమానులు, నేటాలు ప్రభుత్వము వారును, ఇంతటితో ఆగువారుకారు. భారతీయులయొక్క రాజకీయ శక్తిని మొగ్గలోనే త్రుంచివేయుట వారి కత్యంతవసరమైన

మొదటి మెట్టు కాని వారి దాడికి నిజముగా గురియైనది భార తీయవర్తకమును, స్వతంత్ర భారతీయుల ప్రవేశమును, కోట్ల కొలది జనాభాగల భారతీయులు నేటాలుపై దాడివెడలి నేటాలును ఆక్రమించి అచ్చటనుండిన యూరోపియనులను ముంచివేయుదురను భయము వారిని కలవరపరచెను. అప్పటికి నేటాలు జనాభా—జూలూలు షుమారు ४ లక్షలు; యూర పియనులు ४० వేలు; భారతీయ కరారుకూలీలు ६० వేలు; కరారుముగిసిన వారు ౧౦ వేలు; సంపూర్ణస్వతంత్ర భారతీయులు ౧౦ వేలు. యూరోపియనులు ఇట్లు భయపడుటకు తగిన కారణములులేవు. కాని వెర్రిభయమును పొందిన మనుజులకు హేతువాదముచేత నచ్చజెప్పలేము. భారతదేశముయొక్క నిస్సహాయస్థితియు, భారతీయుల ఆచారవ్యవహారములును, వారికి తెలియవు. అందుచేత భారతీయులు గూడ తమువలెనే సాహసికులును శక్తివంతులును అని వారనుకొనిరి. భారతీయుల అత్యధిక జనాభాను తమ స్వల్పసంఖ్యలతో పోల్చుకొని వారు హడావుడిచెందినయెడల వారిని దూషించతగదు. అది యె ట్లున్నను ఎన్నికాధికారము తీసివేసినచట్టమును జయప్రదముగా భారతీయులు నిరోధించుటచేత ఈనేటాలు శాసనసభచేసిన మరిరెండు చట్టములలో రంగుభేదములేకుండ తొలగించి పరో క్షముగా తమ ఉద్దేశ్యమును నిర్వహించుకొనవలసివచ్చెను. కాన అప్పటిస్థితి ఉండతగినంత చెడుస్థితికాదు. ఈరెండు చట్ట ములకును భారతీయులు దృఢమయిన నిరోధమును చూపిరి.

కాని చట్టములు మంజూరయ్యెను. ఒకచట్టమువలన భారతీయుల వర్తకములపై నిషేధములు కల్పించబడెను. రెండవదానివలన నేటాలులో భారతీయుల ప్రవేశమునకు ఆటంకము కలిగించబడెను. మొదటిచట్టముయొక్క సారాంశమేమనగా, ఆచట్టప్రకారము నియమింపబడిన ఉద్యోగస్తునివలన అనుమతి పొందనిదే యెవరును వర్తకము చేయరాదు. కాని ఆచరణలో యూరపియనులకు తేలికగా అనుమతి దొరకెను. భారతీయులు పడు కష్టమునకు మితములేకుండెను. భారతీయుడు న్యాయవాదిని పెట్టుకొనవలసివచ్చెను. ఇతరఖర్చు భరించవలసివచ్చెను. ఇది భరించలేనివారికి అనుమతియే దొరకదు. రెండవచట్టములోని ముఖ్యనియమమేమనగా యూరపు దేశములలోని యేదోయొక భాషలో పరీక్షించబడి ఉత్తీర్ణుడైనవాడే నేటాలులో ప్రవేశించవచ్చును. కోట్లకొలది భారతీయులు రాకుండ తలుపు గట్టిగా మూయబడెను. ఈనేటాలు ప్రభుత్వమునకు నేను పొరబాటుగానైనను అన్యాయము చేయకుండుటకై ఒకహంశమును చెప్పవలెను. యేమనగా ఈచట్టము మంజూరు కాకముందు మూడు సంవత్సరములు నేటాలులో కాపురమున్న భారతీయునకు పౌరసత్వపు యోగ్యతాపత్రము ఇవ్వబడును. దాని ననుసరించి వాడు నేటాలువదలి ఎప్పుడైనను సరే తనభార్యతో పౌగండులగు యుక్తవయస్సురాని పిల్లలతో సహా తిరిగిరావచ్చును. వానికి ఈవిద్యాపరీక్ష అవసరము లేదు.

నేటాలులో యున్న భారతకూలీలును, స్వతంత్రభారతీయులును, అప్పుడును, ఇంకా ఇప్పుడును, చట్టప్రకారమును, చట్టాతీతముగాను మరికొన్ని ఇబ్బందులకు లోనై యున్నారు. వానిని వివరించుట అనవసర మని యెంచెద. విషయము స్పష్టముగా బోధపడుటకు అవసరమైనన్ని వివరములనే యిచ్చెదను. దక్షిణాఫ్రికాలో వివిధభాగములలో యున్న భారతీయుల స్థితిగతుల పూర్ణమైన చరిత్ర వ్రాయుటకు చాల స్థలముపట్టును. ఈ పుస్తకము యొక్క ఉద్దేశ్యమునకు అది మించినపని.

---

## 5 వ అధ్యాయము

## ఇబ్బందుల వివరములు

---

### ట్రాన్సువాలు—ఇతర వలసరాజ్యములు.

నేటాలులో యెట్లో అట్లే ఇతర వలసరాజ్యములలోను ౧౮౮౦ సంవత్సరమునకు పూర్వము నుండి యేకొంచెముగనో గొప్పగనో భారతీయుల యెడ వ్యతిరేకాభిప్రాయములు యేర్పడ జొచ్చెను. కూలీలుగా భారతీయులు సరియైనవారని సామాన్య అభిప్రాయము. కాని స్వతంత్రభారతీయుల ప్రవేశము దక్షిణాఫ్రికాకు స్పష్టముగా నష్టకరమని అనేక యూరపియనులకు రుజువుకోరని స్వతస్సిద్ధమైన సిద్ధాంతము ఏర్పడియుండెను. కేపుకాలనీలో మాత్రము ఇటిస్థితిలేదు. ట్రాన్సువాలు ప్రజా

స్వామ్యప్రభుత్వము. దాని అధ్యక్షుని యొద్దకు బోయి మేము బ్రిటిషుపౌరుల మని భారతీయులు చెప్పుకున్న యెడల పరిహాసాస్పదులు అగుచుండిరి. వారికి ఇబ్బందులు కలిగిన యెడల ప్రిటోరియాలో నున్న బ్రిటిషు ఏజంటుతో చెప్పుకొనుట తప్ప వేరేగత్యంతరము లేదు. కాని ఈ ట్రాన్సువాలు బ్రిటిషు వారి క్రిందకు వచ్చినపుడు ఆమాత్రము సహాయముచేయు ఉద్యోగియైనను వీరికి లభించలేదు. ఇది విచిత్రము. మార్లే ప్రభువు ఇండియామంత్రిగా నున్నపుడు భారతీయుల తరఫున ఒక రాయబారవర్గము ఆయనను చూచెను. అప్పుడు స్వపరిపాలనముగల వలసరాజ్యములపైన బ్రిటిషుసామ్రాజ్యప్రభుత్వమునకు అతిస్వల్పమైన అధికారము మాత్రమే కలదనియు అది రాయబారులకు కూడ తెలియుననియు విస్పష్టముగా ఆయన చెప్పెను. వారికి కార్యవిధానమును సామ్రాజ్యప్రభుత్వము వారు నిర్ణయించజాలరు; వారితో మనవిచేయగలరు; చర్చించగలరు; తమ సిద్ధాంతములను ఆచరణలో పెట్టమని యొత్తిడిచేయగలరు; కొన్ని విషయములలో యీ వలస రాజ్యములతోను విదేశప్రభుత్వములతో వారు హెచ్చు ప్రయోజనకారి యగునట్లు గట్టిగా ఆక్షేపించగలరు. బోయరు ప్రజాస్వామికప్రభుత్వముతో అట్లే చేయగలిగిరి. తమ వలస రాజ్యములతో ఆమాత్రమయినను చేయజాలరు. మాతృదేశమునకును వలసరాజ్యమునకును గల సంబంధము పట్టుదారము వంటిది. కొద్దిబిగింపుతో తెగిపోవును. బలప్రయోగము వీలు

లేదు. కావున రాయబారములద్వారా తాను చేయగల దంతయు చేసితినని మార్లే ప్రభువు భారతరాయబారవర్గమునకు మాట యిచ్చెను. ట్రాన్సువాలు మీద యుద్ధము ప్రకటించి నప్పుడు ఆప్రజాస్వామ్యప్రభుత్వము అచ్చటనుండిన భారతీయు లకు కలిగించిన దుర్భరపరిస్థితులు ఆయుద్ధకారణములలో ఒక్కటని లాన్సుడౌనుప్రభువు, సెల్‌బోరనుప్రభువు, ఇతర రాజ్యతంత్రజ్ఞులు ప్రకటించి యుండిరి.

వీరు చెప్పిన ఈ దుర్భరకష్టములేవియో చూతము. ట్రాన్సువాలులోకి ౧౮౮౧ లో భారతీయులు కాలిడిరి. చని పోయిన షేట్ అబూబకరు ప్రిటోరియాలో దుకాణమును పెట్టెను. దాని ముఖ్యవీధులలో స్థలము కొనెను. ఇతరవర్త కులు అతనిని అనుసరించిరి. వారి విజయము యూరోపియను వర్తకులకు అసూయ కల్పించెను. వారు వార్తాపత్రికలలో వ్యతిరేకాందోళనము సాగించిరి. భారతీయులను వెళ్లగొట్ట వలయుననియు, వారి వర్తకమును అణచవలెననియు తమ పార్లమెంటుకు వారు మహజర్లు పంపిరి. క్రొత్తగా బయట పడిన ఈదేశములో ప్రవేశించిన యూరోపియనులకు ధనము సంపాదించుటయందు మితిలేనికాంక్ష యుండెను. నీతివిధాన ములకు వారు అపరిచితులు. వారు వారి మహజర్లలో చెప్పిన కొన్నిమాంశములు ఇవిగో "ఈభారతీయులకు మానవుల కుండదగు లజ్జలేదు. వారు అసహ్యాకరములగు రోగములవల్ల బాధపడుచున్నారు. వారు ప్రతి ఆడమనిషిని తమ భోగ్య

వస్తువుగా చూతురు. ఆడువారికి ఆత్మలే లేవని వారు నమ్మెదరు." ఈనాలుగు వాక్యములలో నాలుగు అసత్యములు కలవు. ఇట్టి మచ్చుతునకలను తేలికగా అనేకములుగా చూపవచ్చును. ఈయురోపియనులు యెట్లో వారి ప్రతినిధులును అట్లే. తమ మీద యెట్టి దుష్టమైన అన్యాయమైన ఉద్యమము సాగింపబడుచున్నదో భారతవర్తకులకు కొంచెమైనను తెలియదు. వారు వార్తాపత్రికలను చదువలేదు. వార్తాపత్రికలలోని ఆందోళనములును మహజర్లును తగినఫలము కలిగించెను. వారి పార్లమెంటులో ఒక చిత్తుచట్టము తేబడెను. విషయములు యెట్లు రూపమును పొందుచున్నవో తెలుసుకొనినపుడు భారతప్రముఖులు సంభ్రమముపొందిరి. వారు క్రూగరు అధ్యక్షుని చూడపోయిరి. ఆతడు వీరిని తన ఇంటిలోనికైనను రానివ్వక ముంగిలిలో నిలువబెట్టెను. వీరిని కొంచెముసేపు విని ఆయన ఇట్లు చెప్పెను. "మీరు ఇష్మెయిల్ సంతతివారు కాన మీపుట్టుకనుండి మీరు ఈసా సంతతివారికి బానిసలుగా నుండవలెను. ఈసా సంతతివారమైన మేము మీకు మాతో సమానమైన హక్కుల నివ్వజాలము. మేము యిచ్చిన హక్కులతో మీరు తృప్తిపొందవలసినదే." ద్వేషముచేతగాని కోపముచేతగాని అతడిట్టి జబాబు చెప్పెనని అనరాదు. ఈ క్రూగరధ్యక్షునికి బాల్యమునుండి పాతబైబిలు కథలు చెప్పియుండిరి. ఆతడు వాటిని నిజమని నమ్మియుండెను. ఆతడు తనకున్న అభిప్రాయములను మనస్సు విప్పి చెప్పినప్పుడు

మనము వానిని యెట్లు నిందించవచ్చును. నిష్కాపట్యముతో గూడినను అజ్ఞానము అపకారము చేసితీరును. దీని ఫలితముగా ౧౮౮౫ సంవత్సరములో ఒక కఠిన శాసనము వారి పార్లమెంటు అతి త్వరితముగా మంజూరుచేసెను. వేలకొలది భారతీయులవరద ట్రాన్సువాలును ముంచివేయుచున్నదనునట్లు వారు దృఢపడిరి. భారతీయనాయకుల కోరికమీద బ్రిటిష్ ప్రతినిధి జోక్యము కలుగచేసుకొనవలసి వచ్చెను. చివరకు ఈవిషయము వలసమంత్రివరకు పోయెను. ౧౮౮౫ సంవత్సరము 3 వ చట్టముక్రింద ట్రాన్సువాలులో వర్తకము నిమిత్తము నిలిచియున్న ప్రతిభారతీయుడును ౨౫ పౌనులు ఖర్చుపెట్టి నిదర్శనము భద్రము చేసుకొనవలెను. అట్లు చేయని-చో కఠినశిక్షలు యేర్పరచబడెను. ఏ భారతీయుడును ఒక అంగుళము భూమినైనను నుంచుకొనరాదు. అనగా పౌరసత్వ హక్కులను పొంద వీలులేదు. ఇది అంతయు స్పష్టముగా అన్యాయము. ట్రాన్సువాలు ప్రభుత్వముచర్చలో దీనిని సమర్థించలేకపోయెను. బోయర్లకును బ్రిటిషువారికిని మధ్య "లండన్ కన్వెన్షన్" అను ఒక సంధిగలదు. దానిలో ౧౪ వ నియమము ప్రకారము బ్రిటిషుపౌరుల హక్కులు కాపాడబడియున్నవి. ఈ ౧౮౮౫ సంవత్సరపు చట్టము ఈనియమమునకు వ్యతిరేకమని బ్రిటిషువారు ఆక్షేపించిరి. స్పష్టముగా గాని అస్పష్టముగా గాని ఈచట్టమునకు అంతకుముందే బ్రిటిషు ప్రభుత్వము అంగీకరించెనని బోయర్లు జవాబు చెప్పిరి.

ఇట్లు రెండుప్రభుత్వములమధ్య తగవు యేర్పడెను. దానిని పంచాయితీకి వేసిరి. పంచాయితీతీర్పు తృప్తికరముగా లేదు. ఆయన ఉభయకక్షులను సంతోషపెట్టతలచెను. కాన భారతీయులు నష్టపడిరి. లాభమని అనగలిగితే వీరికి ఒక్కటే లాభముకలిగినది. ఈ పంచాయితీ లేనియెడల కలుగునంత నష్టము ఇప్పుడులేదు. ఈ తీర్పుననుసరించి ౧౮౮౬ సంవత్సరములో చట్టమును సవరించిరి. నిదర్శనము భద్రముచేసుకొనుటకు ఇవ్వవలసిన రిజిష్టరీఫీజు ౨౫ నుండి 3 పౌనుల వరకు తగ్గించబడెను. భారతీయులు భూమి సంపాదించరాదను నిషేధము తీసివేయబడెను. దానికి బదులుగా ట్రాన్సువాలు ప్రభుత్వమువారు వీరి నివాసములకు ప్రత్యేకించిన ప్రదేశములలోను పేటలలోను వీధులలోను, ఆస్తి సంపాదించవచ్చునని యేర్పరిచిరి. ఈ ప్రభుత్వము, సవరింపబడిన నియమములనైనను న్యాయముగా అమలులో పెట్టలేదు. ఆ ప్రత్యేకించిన ప్రదేశములలోనైనను సర్వాధికారముగల ఆస్తిని గొనుటకు అంగీకరించలేదు. భారతీయులుండెడి ప్రతి పట్టణములలోను ఊరికి చాలదూరమును నీరు లేనిచోటను దీపములు యేర్పరచనిచోటను చెప్పదగిన ఆరోగ్యసౌకర్యములు లేనిచోటను ఈ ప్రత్యేక ప్రదేశములను నిర్ణయించిరి. అనగా, ట్రాన్సువాలులో భారతీయులు పంచములైరి. ఇండియాలో పంచములుండు ప్రదేశములకును ట్రాన్సువాలులోని ఈ ప్రత్యేక ప్రదేశములకును భేదము యేమియులేదని నిజముగాచెప్ప

వచ్చును. ఢేడు (పంచములను) ను తాకుటగాని వారి ఇండ్ల వద్ద కాపురము ఉండుటగాని మైలకు కారణమని హిందువులు యెట్లునమ్ముచున్నారో అట్లే ట్రాన్సువాలులోని అయిరోపి యనులును భారతీయులను తాకుటలేక వారి సమీపమున నివసించుటకు తమకపవిత్రమని ఆచరణలో నమ్ముచున్నారు. మరియు ౧౮౮౫ చట్టమునకు ట్రాన్సువాలు ప్రభుత్వమువారు చెప్పిన అర్థప్రకారము భారతీయులు తమ ప్రత్యేకప్రదేశము లలోమాత్రమే వర్తకము చేయవచ్చును. ట్రాన్సువాలులోని న్యాయస్థానములే ఈచట్టమునకు అర్థము చెప్పవలెనని పంచా యితీదార్లు తీర్పుయిచ్చెను. అందుచేత భారతీయవర్తకులు మిక్కిలి చిక్కుస్థితికివచ్చిరి. అయినను ఒకచోట రాయ బారము జరిపియు, ఇంకొకచోట న్యాయస్థానముల కెక్కియు మరొకచోట తమకున్న కొద్దిపలుకుబడిని వినియోగించియు, వారెట్లో షుమారుగా కాలముగడుపుచుండిరి. బోయరు యుద్ధము ప్రకటించునప్పటికి ట్రాన్సువాలులోనున్న భారతీ యులు ఇట్టి దిక్కుమాలినటువంటి అస్థిరమైన స్థితిలోనుండిరి.

ఇప్పుడు ఆరంజిఫ్రీస్టేటులోనున్న వారి సంగతి విచా రింతము. అచ్చట ఆరుగురు భారతీయులు దుకాణములు పెట్టిరో లేదో వెంటనే యూరపియనులు ప్రబలమైన ఆందో ళన సాగించిరి. వారి పార్లమెంటు ఒక కఠినమైనచట్టముచేసి పేరునకుమాత్రము కొంత ప్రతిఫలమును యిచ్చి భారతీయ వర్తకులనందరిని, ఆరాష్ట్రమునుండి వెళ్ళగొట్టిరి. ఆరాష్ట్రములో

భారతీయుడెవడును యేకారణముచేతను స్థిరాస్తి సంపాదించ రాదు. వర్తకము చేయరాదు. వ్యవసాయము చేయరాదు. ఎన్నికహక్కును పొందరాదు. అని ఆచట్టము నిర్ణయించెను. ప్రత్యేకమైన అనుమతినిపొంది కూలివాడుగాగాని పూటకూలి ఇండ్లలో సేవకుడుగాగాని భారతీయుడుండవచ్చును. ఈ కొంచెము అనుమతియైనను ఇవ్వవలసిన బాధ్యత అధికారులకు లేదు. అనగా గౌరవనీయుడైన భారతీయుడెవడును రెండు రోజులు సహితము పెక్కు ఇక్కట్టులు పొందకుండ ఆ రాష్ట్రములో యుండనేరడు. బోయరుయుద్ధప్రారంభమున పూట కూళ్ళఇండ్లవద్ద సేవకులుగా కొద్దిమందితప్ప ఇతరభారతీయులు ఆరాష్ట్రములోనే లేరు.

కేపుకాలనీలో గూడ భారతీయులకు వ్యతిరిక్తముగా కొంత ఆందోళనజరిగెను. అచ్చట వీరికిగలిగిన ఆదరణలో గూడ కొన్ని అవమానకరమైన హాంశములు లేకపోలేదు. ఎట్లన భారతీయ పిల్లలు ప్రభుత్వపాఠశాలలకు వెళ్లరాదు. భారతీయ ప్రయాణికులు పూటకూళ్ల ఇండ్లలో వసతి సంపా దించుట దుర్లభము. కాని చాలకాలమువరకు వర్తకముపైనను ఆస్తికొనుగోలుపైనను నిషేధములు లేవు.

ఇట్లుండుటకు తగిన కారణములుగలవు. లోగడ చెప్పి నట్లుగా కేపుకాలనీలో సామాన్యముగాను, కేపుటౌనులో ముఖ్యముగాను, మలయా దేశపు జనులు కొంతమందియుండిరి. ఆమలయులు మహమ్మదీయులు. కాన వారు భారతమహమ్మ

దీయులతో త్వరగా కలసిరి. వారి ద్వారా ఇతర భారతీయులతో తరువాత కలసిరి. మరియు భారత మహమ్మదీయులు మతే స్త్రీలను వివాహమాడిరి. కేపుకాలనీ ప్రభుత్వమువారు మతే లకు వ్యతిరేకముగా యెట్లు శాసనములు చేయుగలుగుదురు? ఆ కేపురాష్ట్రము వారిజన్మభూమి, డచ్చి వారిమాతృభాష, మొదటినుండియు డచ్చివారితో కలసి నివసించుచుండిరి. జీవిత పద్ధతులలో హెచ్చుగా వారి ననుసరించుచుండిరి. కాన కేపు కాలని అన్నివలసలకంటె తక్కువగా రంగుభేదభావమునకు తావిచ్చెను.

మరియు కేపురాష్ట్రము వలసలలో కన్నిటికి పురాతన మైనది. దక్షిణాఫ్రికాలోనెల్ల సాహిత్యమునకు, నాగరికతకు, అదియే ముఖ్యస్థానము. అందువలన నెమ్మదిగల, మర్యాదస్తులైన ఔదార్యముగల యూరోపియనులు అచటయుండిరి. తగిన అవకాశమును విద్యయు ఇచ్చినయెడల నిరుపమానమైన ఆదర్శ మానవులను చూపలేని జాతిగాని దేశముగాని ఈలోకములో లేదని నా అభిప్రాయము. దక్షిణాఫ్రికాలో అన్ని భాగ ములలో ఇట్టి మంచి జనులను కలియగల అదృష్టమునాకు లభించెను. కేపుకాలనిలో వీరిదామాషా మిక్కిలి యెక్కువ. అందరిలోకి ప్రసిద్ధుడును, పండితుడును, అయినవాడు మెర్రిమన్‌గారు. ౧౮౭౨ సంవత్సరములో బాధ్యతాయుత ప్రభుత్వము ఈకేపురాష్ట్రమునకు ఇవ్వబడిన పిమ్మట అధికారము లోనికి వచ్చిన మొదటి మంత్రివర్గములోను, తరువాత మంత్రి

వర్గములలోను ఈయన సభ్యుడుగానుండెను. ౧౯౧౦ సంవత్సరములో నాలుగు రాష్ట్రములు కలియకముందు ఉన్న ఆఖరు మంత్రివర్గములో ఈయన ప్రధానమంత్రిగానుండెను. దక్షిణాఫ్రికాలోని గ్లాడ్‌స్టన్ అని ఈయునకు పేరుగలదు. తరువాత చెప్పదగినవారు మూల్టెనూలు, ష్రీనర్లు. సర్ జాన్ మూల్టెను ౧౮౭౨ సంవత్సరములో మొదటి ప్రధానమంత్రిగానుండెను.

డబ్లియు. పి. ష్రీనర్ ప్రసిద్ధుడైన న్యాయవాది. కొంత కాలము ప్రభుత్వముతరపున న్యాయవాద సర్వాధికారిగానుండెను. పిమ్మట ప్రధానమంత్రి యయ్యెను. ఆయన సోదరి ఆలివ్ ష్రీనరు. వరప్రసాది. దక్షిణాఫ్రికాలో ప్రజానురంజకురాలు, ఇంగ్లీషుభాష మాట్లాడెడి చోట్ల నెల్ల ప్రసిద్ధురాలు. "స్వప్నములు" అను పుస్తకములు వ్రాసినప్పటినుండి దాని గ్రంథకర్తగా ఆమె కీర్తిబొందెను. విశ్వమానవజాతియందు ఆమె కుండు ప్రేమ, అపారము. ఆమె కండ్లలో ప్రేమ చిత్రింపబడి యుండెను. ఆమె అంతమర్యాదగల కుటుంబమునకు చెందినను, విద్వాంసురాలు అయినను, ఎంతయో నిరాడంబరమైన అలవాట్లు గలది గనుకనే తన ఇంటిలోని పాత్రలను ఆమెయే శుభ్రపరుచుకొనుచుండెను. మెర్రిమను, మూల్టెనోలు, ష్రీనర్లు, ఎల్లప్పుడు నీగ్రోల వైపున యుండిరి. వారిహక్కులకు ఆపదకలిగినపుడెల్ల దాని సంరక్షణ నిమిత్తమై, వీరు దృఢముగా నిలబడుచుండిరి. భారతీయుల యెడ కూడ వీరికి కరుణభావములు గలవు. కాని నీగ్రోల

భారతీయుల మధ్య కొంచెము భేదముచేయుచుండిరి. యూర పియనులు దక్షిణఆఫ్రికాలో కాలు పెట్టకపూర్వము చాల కాలమునుండి నీగ్రోలు అక్కడ నివసించుచుండిరి గనుక వారికి సహజమగు హక్కులను యూరపియనులు తీసివేయజాలరని వారువాదించుచుండిరి. భారతీయుల స్థితి అట్టిదికాదు. వీరి వలన కలిగెడి అక్రమమైన పోటీ వలన భయము తప్పించు కొనుటకు చట్టములు చేసిన యెడల అన్యాయము కాదు అని వారు అందురు, అయినను వారి హృదయములలో భారతీయు లకు నొక్కింత విశాలమైన తావొసంగిరి. గోక్లె దక్షిణాఫ్రికా వచ్చినప్పుడు, ఆదేశములోనికెల్ల మొట్టమొదట బహిరంగ సన్మానము చేసినప్పుడు, జరిపిన కేపుటవునులోని పౌరమందిర సభలో, స్రీనరుగారే అధ్యక్షత వహించిరి. మెర్రిమనుగారు మిక్కిలి మర్యాదతో గోక్లెను ఆదరించిరి. భారతీయుల ఆవ ర్శములయెడ సానుభూతి చూపిరి. ఇట్టివారు ఇతర యూరోపి యనులలోను కనుబడిరి. ఆతరగతికి నమూనాగా ఈ ప్రసిద్ధు లైన వారి పేర్లను చెప్పితిని.

దక్షిణాఫ్రికాలోని ఇతరభాగములలోనున్న వార్తా పత్రికలలోకన్న కేపుటవునులోని వార్తాపత్రికలు భారతీయుల యెడ తక్కువగా విరోధభావము చూపిరి.

ఈకారణములచేత కేపుకాలనీలో ఇతర రాష్ట్రము లలోకన్న తక్కువజాతి ద్వేషము ఉన్నమాట నిజము. అయి నను ఇతరవలసలలో మెడతెగకుండ బైటపడుచున్న భార

తీయవిరుద్ధభావము ఇచ్చటికికూడ వ్యాపించుట సహజము. నేటాలు ననుసరించి ఇచ్చటకూడ రెండు చట్టములు చేయబడెను. ౧ ప్రవేశనిరుద్ధచట్టము. ౨ వర్తకుల అనుమతిచట్టము.

దక్షిణాఫ్రికాలో లోగడ చక్కగా తెరువబడిన తలుపు బోయరుయుద్ధ ప్రారంభమున భారతీయులకు భిన్నముగా పూర్తిగా మూయబడినదనియే చెప్పవచ్చును. ట్రాన్సువాలులోని దర్శన రుసుము మూడుపౌనులు తప్ప అచ్చట ప్రవేశమునకు ఇతరఆటంకములులేవు. కాని ఈట్రాన్సువాలు లోతట్టున యుండెను. సముద్రపు ఒడ్డునయున్న నేటాలు కేపుకాలనీలు తమ రేవులలో భారతీయులు దిగకుండునట్లు నిషేధించినప్పుడు వీరు ట్రాన్సువాలు పోవలెనన్నను, ఇక్కడ దిగుటకు కష్టమగుచుండెను. డెలగోవాబేనుండి వీరు పోవచ్చును. దాని పాలకులైన బుడతగీచులు ఇంచుమించుగా బ్రిటిషువారిని అనుసరించిరి. నేటాలుగుండను డెలగోవాబే మీదుగను అరుదుగా భారతీయులు ట్రాన్సువాలును చేరుచుండిరని చెప్పవలెను. కాని వారనేకకష్టములకు లొంగవలసి వచ్చెను. లేదా ఉద్యోగస్తులకు లంచమియ్యవలసి వచ్చెను.

---

## 6 వ అ ధ్యా య ము

## తొలిపోరాటముయొక్క వివరములు

వెనుకటి అధ్యాయములలో భారతీయులస్థితిని విచారించునపుడు వారి హక్కులపైన చేయబడిన దండయాత్రలకు వారు ఎట్లు అడ్డుపడిరో కొంతవరకు చూచియున్నాము. సత్యాగ్రహప్రారంభమునుగూర్చి సరియైనభావము యేర్పడవలెనన్న అంతకుపూర్వము భారతీయహక్కులను సంరక్షించుటకు చేయబడిన ప్రయత్నములను గురించి మరికొంత వ్రాయుట అవసరము. ౧౮౯౩ సంవత్సరమువరకు భారతీయోద్యమమును చేబూని నడిపించగలిగిన విద్యాధికుడైన స్వతంత్ర భారతీయుడు దక్షిణాఫ్రికాలో లేడనియె చెప్పవలెను. ఇంగ్లీషు తెలిసిన భారతీయులు పెక్కుమంది గుమాస్తాలుగానుండిరి. వారికి తెలిసినఇంగ్లీషు ఆవృత్తికి తగినంతమాత్రమే. మహాజర్లు తయారుచేయుటకు చాలదు. అంతేగాక వారు కాలమునంతయు తమవృత్తులలో వినియోగించవలసియుండెను. ఇంగ్లీషు తెలిసిన భారతీయులు ఇంకొక మురాగలదు. వారు దక్షిణాఫ్రికాలో పుట్టినవారు. వారిలో హెచ్చుమంది కరారు కూలీలసంతతివారు. వారికి యీ పనిచేయుటకు తగిన అర్హతలు ఉన్నను వారు న్యాయస్థానములలో దుబాషులుగా నుండిరి. అందువలన తమసానుభూతిని తెలుపుటకు హెచ్చు సహాయము చేయజాలరైరి.

మరియు కరారుకూలీలును, కరారు ముగించినకూలీలును ముఖ్యముగా సంయుక్త ప్రాంతములనుండియు చెన్న రాజధానినుండియు వచ్చిరి. లోగడ తెలిపినట్లు మహమ్మదీయులును అందులో హెచ్చుమంది వర్తకులును, హిందువులును; అందులో హెచ్చుమంది గుమాస్తాలును, గుజరాటునుండి వచ్చిరి. వీరే సంపూర్ణస్వాతంత్ర్యభారతీయులలో అధిక సంఖ్యాకులు. వీరుగాక కొద్దిమంది పారశీలువర్తకులుగా గుమాస్తాలుగా ఉండిరి. కాని దక్షిణాఫ్రికా మొత్తము మీద ముప్పది నలుబది మందికి మించరు. స్వాతంత్రభారతీయులలో నాలుగవముఠా, సింధీవర్తకులు. వారు రెండు వందలపైచిలుకు యుందురు. సింధీయులు భారతదేశమువదలి బయట యెక్కడ నివసించినను, పైడాబుసరుకులో వర్తకము చేయుచుందురు. అనగా పట్టు, మెడపట్టాలు, టూకుచేవ, చందనము దంతములతో తయారుఅగు పెట్టెలు, ఇతర సామానులు వగైరాలు వీరు అమ్ముచుండిరి. వీరికి బేరగాండ్లు హెచ్చుమంది యూరోపియనులు.

కరారుకూలీలను యూరపియనులు "కూలీ" అని పిలుతురు. కూలి అనగా మూటమోయువాడు. ఈపదమే మిక్కిలిగా వాడబడుచుండుటబట్టి ఈ కరారుకూలీలు తమను తాముకూడ కూలీలు అని పిలుచుకొనుచుండిరి. వందలకొలది యూరోపియనులు భారతీయవర్తకులను కూలివర్తకులనియు, భారతీయన్యాయవాదులను కూలిన్యాయవాదులనియు, పిలుచు

చుండిరి. కొందరు యూరోపియనులకు ఈ పదములో నింద ఇమిడియున్నదని గుర్తుగాని నమ్మకముగాని లేదు. కొందరు కావలెనని తమ అసహ్యమును తెలుపుటకే యీ పదము వాడుచుండిరి. కాన స్వతంత్రభారతీయులు ఈ కరారుకూలీల కును తమకును భేదములు కల్పించుటకు యత్నించుచుండిరి. ఇందువలన, ఇండియాలోనున్న ప్రత్యేకముగు ఇతర కారణముల చేతను దక్షిణాఫ్రికాలోగూడ కరారుకూలీలకును స్వతంత్ర కూలీలకును ఒకవైపునను, ఈ కూలీలకును సంపూర్ణస్వతంత్ర భారతీయులకును, ఇంకొకవైపునను, భేదములు నేర్పరచ ప్రయత్నములు జరిగెను.

స్వతంత్రభారతీయులును అందులో ముఖ్యముగా మహ మ్మదీయవర్తకులును పైజెప్పిన ఇబ్బందులను నిరోధించుటకు బూనిరి. కాని కరారుకూలీలయొక్క గాని, కరారుముగించిన కూలీలయొక్క గాని, సహకారమును పొందుటకు సరాసరి ప్రయత్నము చేయలేదు. బహుశా అది యెవరికి తోచలేదు. కాబోలు. కొందరికి తోచినను వారిని యీ ఉద్యమములో చేర్చుకొనుటవలన విషయములు మరింత చెడునని వారు తలచి యుందురు. అంతేగాక యూరపియనుల దాడికి గురియైనవారు ముఖ్యముగా ఈ స్వతంత్రవర్తకులు. కాన సంరక్షణోపాయ ములు ఈ తరగతివారితో నిలుపుచేయబడెను. వారికిన్ని చిక్కు లున్నను, ఇంగ్లీషు తెలియకపోయినను, ఇండియాలో జరుగు ప్రజాహితసేవలోని అనుభవము లేకపోయినను, ఈ స్వతంత్ర

భారతీయులు తమకష్టముల నివారించుకొనుటకు చక్కగా పోరాడిరని నిశ్చయముగా చెప్పవచ్చును. వారు యూరోపియను న్యాయవాదుల సహాయమును పొంది, మహాజర్లను తయారుచేయించి, కొన్ని వేళల అధికారులవద్దకు రాయబారములు పంపి వ్యవహారములు నడుపుటకు శక్తికొలది పాటుబడిరి. ౧౮౯౩ వరకు ఉన్న స్థితిగతులు ఇవి.

కొన్ని ముఖ్యమైన తేదీలను గమనించుట పాఠకునకు సహాయకారి యగును. ౧౮౯౩ సంవత్సరమునకు పూర్వమే ఆరంజిరాష్ట్రము నుండి భారతీయులు బైటికి తరుమబడిరి. ట్రాన్సువాలులో ౧౮౮౬ సం॥ న ౩ రు చట్టము అమలులో నుండెను. నేటాలులో కరారుకూలీలు మాత్రమే నివసించుటకును, తక్కినవారిని వెళ్లగొట్టుటకును, తగిన యేర్పాట్లు ఆలోచనలో నుండెను. ఆ ఉద్దేశ్యముతోనే బాధ్యతాయుత ప్రభుత్వమును సంపాదించిరి. ౧౮౯౩ సంవత్సరములో నేను దక్షిణాఫ్రికాకు బయలుదేరితిని. అచ్చటి భారతీయుల పూర్వచరిత్ర అప్పటికి నాకు తెలియదు. నేను అచ్చగా నావృత్తికి సంబంధించిన పనిమీద పోతిని. దర్బానులో దాదాఅబ్దుల్లా అను పేరుతో పోరు బందరు మహమ్మదీయవర్తకసంఘము వ్యాపారము చేయుచుండెను. వీరికి సమానమైన ప్రఖ్యాతిగల ప్రత్యర్థిసంఘము ప్రెటోరియాలో తైబ్ హాజీఖాన్ మహమ్మద్. అను పేరుతో వ్యాపారము చేయుచుండిరి. దురదృష్టమువలన ఈ ఇద్దరి మధ్యను పెద్దవ్యాజ్యము జరుగుచుండెను. దాదా

అబ్దుల్లా తాలూకు భాగస్థుడు ఒకడు పోరుబందరులో ఉన్న వాడు నన్ను వారి తరఫున దక్షిణాఫ్రికా పంపినయెడల వారి దావాకు లాభించు నని తలచెను. నేను అప్పుడే వృత్తిలో ప్రవేశించిన క్రొత్తన్యాయవాదిని. వారి దావాను చెడగొట్టుదునని భయము వారికి లేదు. ఏలనన, నన్ను న్యాయస్థానములో దావా నడుపుటకు గాక, వారు ఇదివరకే యేర్పరుచుకొనిన సమర్థులగు న్యాయవాదులకు సహాయము చేయుటకే నన్ను తీసుకొని పోదలచిరి. క్రొత్త అనుభవములన్న నాకు ప్రీతి. క్రొత్తపొలములను క్రొత్తపచ్చికబీడులను చూడ ప్రేమించుచుందును. ఇచ్చట నావద్దకు దావాలు తెచ్చిన వారికి ఖాయిదా ఇచ్చుట అసహ్యముగా నుండెను. కథియవాడ్‌లోని కుట్రలు మొదలగునవి నాకంతమునకు అడ్డుపడుచుండెను. వీరికి నాకు జరిగిన ఏర్పాటు ఒక సంవత్సరమునకు మాత్రమే. దానిని అంగీకరించుటలో నాకు ఆక్షేపణ కనుపడలేదు. నా రాకపోకల ప్రయాణపు ఖర్చులును, దక్షిణాఫ్రికాలో నున్న రోజులలో భోజనాది ఖర్చులును, పైన ౧౦౫ పౌనులు బహుమతియు, దాదాఅబ్దుల్లా ఇచ్చుటకు సిద్ధముగానుండిరి. నాకు నష్టమేమియు లేదు. ఈ యేర్పాటంతయు చనిపోయిన మా పెద్దన్నగారు చేసిరి. ఆయన నాకు తండ్రివంటివాడు. ఆయన కోరిక నాకు ఆజ్ఞ. నేను దక్షిణాఫ్రికాకు వెళ్లుటకు ఆయన ఇష్టపడెను. కాన ౧౮౯3 సం॥ మే నెలలో నేను దర్బాను చేరితిని.

నేను బారిష్టరు న్యాయవాదిని కనుక, నాకు ఉండవలసిన గౌరవమునకు తగినట్లు అప్పటి అభిప్రాయముల ననుసరించి చక్కగా అలంకరించుకొని దర్బానులో దిగితిని. కాని త్వరలోనే నావ్యూహాలు మాయమయ్యెను. నన్ను ఏర్పరుచుకొనిన భాగస్థుడు నేటాలులో నుండు విషయములను నాకు తెలిపియుండెను. ఆయన చెప్పినది పొరబాటనియు, ఇక్కడ ఉన్నస్థితి దానికి శుద్ధవిరుద్ధమనియు, నాకళ్లతో నేను చూచితిని. కాని ఆ భాగస్థుని నిందించవలసినదీ లేదు. అతడు అమాయకుడు. నేటాలులోని నిజమైన స్థితిగతుల నెరుగడు. బోళా వాడు. నేటాలులో భారతీయులకు కలుగుచున్న ఇక్కట్టులు గూర్చి ఆయనకు ఊహామైనను లేదు. మిక్కిలి అవమానకరమైన పరిస్థితులు ఆయనకు ఆవిధముగా కనుపడలేదు. నేను ప్రవేశించిన మొదటి రోజుననే, భారతీయులను యూరపియనులు అత్యంతఅవమానకరముగా చూచుచుండిరని తెలిసికొంటిని.

నేను ప్రవేశించిన రెండు వారములలో న్యాయస్థానములో నాకు కలిగిన దుస్సహమైన అనుభవములును, అయోమార్గములలో నే నెదుర్కొన్న కష్టములును, దోవలో నేను తినిన దెబ్బలును, పూటకూండ్ల ఇండ్లలో వసతి సంపాదించుటకు గలఇబ్బందిని, దుస్సాధ్యతను నేను వర్ణించను. ఈఅనుభవములన్నియు నాహృదయములో ఇంకిపోయెనని చెప్పిన చాలును. స్వార్థము నిమిత్తమును క్రొత్తప్రదేశములు

చూచు ఉత్సాహముతోను, ఒక్క దావాకొరకు మాత్రమే నేను అక్కడికి పోతిని. కాని మొదటి సంవత్సరములో ఆకష్టములకు గురినై సాక్షినై యుంటిని. అప్పుడు నాకర్తవ్య నిర్ణయమునకు నేను మేలుకొంటిని. స్వార్థచింతనములనుబట్టి దక్షిణాఫ్రికా నాకు లాభములేదని తెలుసుకొంటిని. నన్ను అవమానించిన దేశములో నివసించుటకుగాని, ధనము సంపాదించుటకు గాని, నాకు కోరిక లేకపోవుటయేగాక, ప్రత్యక్షమైన అసహ్యాము వేసెను. నేనప్పుడు కర్తవ్యనిర్ణయమునకు సంకోచపడితిని. నాకు రెండు దోనలు కలవు. లోగడనాకు తెలుపబడని విషయములు ఇప్పుడు తెలిసినందున దాదా అబ్దుల్లాతో నేను ఏర్పరుచుకొన్న ఖరారునామానుండి విముక్తుడనై ఇండియాకు తిరిగి పరుగెత్తి పోవచ్చును. లేదా అన్ని కష్టములను సహించి మొదటి యేర్పాటును పూర్తిచేయవచ్చును. మారెడ్జుబర్గులో పోలీసుజవాను నన్ను అయోమార్గపుబండిలో నుండి బయటికి నెట్టెను. ఆబండి వెడలిపోయెను; అమితచలిలో గడగడవణకుచు విశ్రాంతిశాలలో కూర్చుంటిని. నాసామాను యెక్కడ నున్నదియు తెలియదు. మరల అవమానింతురో కలియబడుదురో అనే భయముచేత దానిని గురించి యెవరిని విచారించుటకుకూడ నేను సాహసించలేదు. నిద్రమాట తలపెట్టగూడదు. సందేహము నామనస్సును స్వాధీనపర్చుకొనెను. రాత్రి చాల ప్రొద్దుపోయిన పిమ్మట ఇండియాకు తిరిగి పరుగెత్తుట పిరికితనము అని

తీర్మానించుకొంటిని. నేను వహించిన బాధ్యతను నిర్వహించి తీరవలెను. అవమానమును దేహశుద్ధినైనను లక్ష్యముచేయక ప్రిటోరియా చేరవలెను. ప్రిటోరియా నాగమ్యస్థానము. దావా అక్కడ జరుగుచుండెను. సాధ్యమైనయెడల నాపనితో పాటు దీనినిగూర్చి కొంతచర్య జరుపబడవలెనని నిశ్చయించు కొంటిని. ఈతీర్మానమువలన కొంతశాంతియు బలమును చేకూరెను. నిద్రమట్టుకు పట్టలేదు.

మరుచటి ఉదయము దాదా అబ్దుల్లాసంఘమునకును అయోమార్గముల కార్యనిర్వాహకునకును తంతెల నిచ్చితిని. ఉభయులనుండి జవాబులు వచ్చెను. దాదాఅబ్దుల్లాయును, అప్పుడు నేటాలులోయున్న అతని భాగస్వామి, సేట్ అబ్దుల్లాఖాజీ, ఆదం ఝవేరియును, గట్టియేర్పాట్లు చేసిరి. వివిధస్థలములోనున్న తమభారతీయ ప్రతినిధులకు నాసౌకర్య ములను చూడమని తంతెల నిచ్చిరి. వారు పైజెప్పిన కార్య నిర్వాహకుని జూచిరి. మారెడ్జుబర్గులోని ప్రతినిధికివచ్చిన తంతినిబట్టి అచ్చటి భారతీయవర్తకులు నన్ను చూడవచ్చిరి. నాకుగలిగిన దుర్భరమైన అనుభవమునే, వారికందరికిని గలిగె ననియు, దానికి అలవాటుపడుటచేత అట్టి విషయములను వారు లక్ష్యముచేయలేదనియు, నాతో చెప్పిరి. నన్ను ఓదార్చి శాంతింపజేయజూచిరి. వర్తకమును అవమానములను సూక్ష్మ ముగా గ్రహించు శక్తియు, కలసిపోజాలవు. ధనమును సంచు లలో వేసుకొనునట్లు అవమానములను జేబులో వేసుకొనుటకు

వారు సిద్ధాంతము చేసుకొనిరి. అయోమార్గములు నెక్కుటకు బండ్లునిలుచుస్థానములలో ప్రధానద్వారములగుండ తామెట్లు ప్రవేశించకూడదో, అచ్చటి ప్రయాణపత్రములను కొనుట ఎట్లుకష్టమో, వారు నాతోచెప్పిరి. ఆ రాత్రియే నేను ప్రెటోరియాకు బయలుదేరితిని. అన్నిహృదయములను పరిశోధించు పరాత్పరుడు నాతీర్మానమును నిండుపరీక్షకు లోనుచేసెను. ప్రెటోరియాకు బోవుదోవలో మరికొన్ని అవమానములు పొందితిని. మరికొన్ని దెబ్బలు తింటిని. కాని ఇవి అన్నియు నాతీర్మానమునే స్థిరపరిచెను.

ఇట్లు ౧౮౯౩ లో దక్షిణాఫ్రికాలోని భారతీయుల స్థితినిగూర్చి నాకు పూర్ణమైన అనుభవము కలిగెను. ఈవిషయమై ప్రెటోరియాలోనున్న భారతీయులతో అడపా దడపా మాట్లాడుటకన్న నేనేమియు చేయలేదు. ఏకకాలముననే ఈదావాపనియును దక్షిణాఫ్రికాలోని భారతీయ ఇక్కట్టుల సమస్య విషయమైనచర్యను, జరుపుట దుస్సాధ్యమని నాకు తోచెను; రెంటిని చేయబూనుట రెంటిని చెడగొట్టుట యని నాకు కనుపట్టెను. ఇంతలోనే ౧౮౯౪ సంవత్సరము నామీద పడెను. నేను దర్బాను తిరిగివచ్చితిని. ఇండియాకుబోవ సిద్ధముగానుంటిని. దాదా అబ్దుల్లాసంఘమువారు నాకు వీడ్కోలు విందుచేయుచుండగా, యెవరోయొకరు నేటాలు మర్క్యూరీ అను వార్తాపత్రిక సంచికను నాచేతిలోపెట్టిరి. దానిని చదివితిని. "భారతీయులకుండు ఎన్నికహక్కు" అను తలకట్టుక్రింద

నేటాలు శాసనసభ కార్యక్రమ వివరములలో కొన్ని పంక్తులు కనుపడెను. భారతీయుల ఎన్నికాధికారములను తీసివేయుటకు ఒక చిత్తుచట్టమును స్థానిక ప్రభుత్వమువారు పెట్టబోవుచుండిరి. అప్పటికి భారతీయు లనుభవించుచున్న కొద్ది హక్కులనుగూడ ఆఖరుచేయుటకు ఆచిత్తుచట్టము మొదటి మెట్టుగానుండెను. ఆసందర్భములలో చేసిన ఉపన్యాసములవల్ల ప్రభుత్వ ఉద్దేశ్యమును గూర్చి అనుమానమునకు తావులేదు. అచ్చట హాజరైన వర్తకులకును, ఇతరులకును, ఆవివరములను చదివి వినిపించితిని. నాశక్తికొలది స్థితిగతులను తెలియచెప్పితిని. అప్పుడునాకు పూర్తిసంజాయిషి తెలియదు. వారిహక్కులను తొలగించుటకు చేయు యీ ప్రయత్నము వారు దృఢముగా నిరోధించవలెనని సూచించితిని. వారు సమ్మతించిరి. కాని ఈపోరాటమును జరుపుటకు తమకు శక్తిలేదనిచెప్పిరి. నన్ను ఉండమని బ్రతిమాలిరి. ఒకనెలగాని ఈపోరాటము తీరునంత వరకుగాని, నేనుండ నంగీకరించితిని. ఆశాసనసభకు పంపుటకై ఒకమహజరును ఆరాత్రియే తయారుచేసితిని. కార్యక్రమమును ఆపమనికోరుచు ప్రభుత్వమునకు తంతి నంపితిమి; సేట్ హాజీ ఆదమును అధ్యక్షుడుగాపెట్టి ఒక ఉపసంఘమును వెంటనే యేర్పరచితిని. తంతి వారిపేరనే పంపితిని. ఆచిత్తుచట్టముపై విచారణ కార్యక్రమమును రెండురోజులవరకు ఆపిరి. దక్షిణాఫ్రికా శాసనసభకు భారతీయులు మొదటపంపిన మహజరు ఇదియే. దానివల్ల ఆచిత్తుచట్టము ఆగకపోయినను, కొంత

వత్తిడి యేర్పడెను. ఈచిత్తుచట్టముయొక్క తదుపరి చరిత్రను ౪ వ. అధ్యాయములో చెప్పియుంటిని. ఇట్టి ఆందోళనము చేయుటలో దక్షిణాఫ్రికా భారతీయులకు మొదట అనుభవ మిదియే. భారతీయబృందమున కంతకును నూతన ఉత్సాహము పులకరించెను. ప్రతిరోజు సభలుచేసిరి. అంతకంతకు జనులు ఎక్కువగా హాజరైరి. కావలసిన దానికన్న మించి చందాలు పడెను. నకళ్లు తయారుచేయుటకును దస్కతులు చేయించుట కును, ఇతరపనిచేయుటకును, వేతనములేకుండా, ఐచ్ఛికులు చాలమంది సహాయముచేసిరి. కొందరు చందాలనిచ్చి పనికూడ చేసిరి. కరారు గడచిన కూలీల సంతతివారు చురుకుగా ఉద్య మములోచేరిరి. వారికి ఇంగ్లీషు తెలియును, చక్కని దస్తూరి వ్రాయుదురు. రాత్రింబవళ్లు నకళ్లువ్రాయుట మొదలగుపనిని, సణుగు గొణుగు లేకుండ, చేయుచుండిరి. నెలలోపల పదివేల దస్కతులతో ఒకమహాజరు రిప్పన్‌ప్రభువుకు పంపబడెను. నేను ఉద్దేశించిన ముఖ్యమైన సన్నిహితమైన కార్యము పూర్తి యయ్యెను.

నేను ఇంటికి వెళ్లుటకు సెలవు అడిగితిని. ఈఆందోళన వలన వారికి అధికమైన అభిరుచి కలిగెను. నన్ను పోనివ్వ మనిరి. వారిట్లు చెప్పిరి. “చిట్టచివరకు పూర్తిగా మనలను నాశనముచేయుటకు ఇదియే మొదటిమెట్టని నీవే మాకు తెలియచెప్పితివి. మన మహాజరుకు అనుకూలముగా జబాబు వచ్చునో లేదో యెవరు చెప్పగలరు. మాఉత్సాహమును

నీవు చూచితివి. పనిచేయుటకు మాకు కోరికయు, సంసిద్ధతయు కలవు. మావద్ద డబ్బు ఉన్నది. మాకు దారిచూపరి లేని యెడల ఇదివరకు చేసినదికూడ వృథాయగును. నీవు యిక్కడ యుండుటయే నీకర్తవ్యమని మేము యెంచెదము." భారతీయ హక్కులను ప్రయోజనములను కనిపెట్టుటకై ఒక స్థిరసంస్థ యేర్పడిన బాగుండునని నాకును తోచెను. కాని నేను యెక్కడ ఉండవలెను. ఎట్లుండవలెను? వారు నాకు సరియైన వేతనము యిత్తుమనిరి. నేను స్పష్టముగా వద్దంటిని. ప్రజాసేవ చేసినందులకు యెవడును పెద్దజీతము పుచ్చుకొనరాదు. మరియు నేనును క్రొత్తవాడను. అప్పటికుండు నాఅభిప్రాయ ములనుబట్టి న్యాయవాదులకు యుక్తమయినట్టియు, భారతీయబృందమునకు మర్యాదకరమైనట్టియు పద్ధతిలో నివసించవలెనని యెంచితిని. అనగా ఖర్చు హెచ్చగును. ఏసంస్థ తన కార్యక్రమమునకై మాటిమాటికి ప్రజలవద్ద ధనమును కోరుచుండునో అట్టిసంస్థపై నాజీవనోపాధికి ఆధారపడుట అక్రమమై యుండును. ఆపని నిర్వహించుటలో నాశక్తిసామర్థ్యములుగూడ క్రుంగిపోవును. ఈమొదలగు కారణములవలన ప్రజాసేవకు వేతనము పుచ్చుకొననని గట్టిగా చెప్పితిని. అచటనుండు ప్రముఖులైన వర్తకులు తమదావాలు వగైరాలు నాకు యిచ్చి ముందుగా కొంత పైకమిచ్చినయెడల నేను అక్కడ యుండుటకు వీలగునని సూచించితిని. ఈ యేర్పాటు ఒక యేడాదివరకే కావచ్చును. ఈలోపల

ఒండొరులు వ్యవహారమును జరుపుకొని అంతమున ఫలితములు విచారించుకొని ఉభయులకు సమ్మతముగా నున్నయెడల ఈ యేర్పాటునే మరికొంతకాలము సాగింపవచ్చును. ఈసల హాను వారు సంతోషముగా అంగీకరించిరి.

నేటాలు ప్రధానన్యాయస్థానములో నన్ను న్యాయ వాదిగా చేర్చుకొనమని నేను దరఖాస్తు పెట్టితిని. నేటాలు న్యాయవాది సంఘమువారు నాదరఖాస్తును యెదిర్చిరి. వారికి ఒక్కటేకారణము గలదు. రంగు న్యాయవాదులను న్యాయ వాదుల జాపితాలో జేర్చుకొనుటకు చట్టము ఉద్దేశించి యుండదని వారి వాదము. చనిపోయిన యస్కోంబు, ప్రఖ్యా తన్యాయవాది, ప్రభుత్వము తరఫున న్యాయవాద సర్వాధికారి పిమ్మట నేటాలు ప్రధానమంత్రి అయినవారు, నాతరఫున న్యాయవాదిగా నుండెను. అచ్చట చాలకాలము నుండి ఆచార మేమనగా అచ్చట ప్రధాన న్యాయవాది రుసుములు పుచ్చు కొనకుండ, యిట్టి దరఖాస్తులు దాఖలు చేయవలెను. దానిని బట్టి యస్కోంబు నాతరఫున వాదించెను. ఆయన మా దాదా అబ్దుల్లా తరఫున న్యాయవాది కూడ అయియుండెను. న్యాయ స్థానమువారు ఆక్షేపణను తోసివేసి నాదరఖాస్తును మంజూరు చేసిరి. ఈ సంఘమువారు కోరకుండగనే, వారి యెదురు వాదము చేత నాకు మరింత ప్రాముఖ్యత వచ్చెను. దక్షిణా ఫ్రికా వార్తాపత్రికలు న్యాయవాదిసంఘమును పరిహసించెను. వారిలో కొందరు నన్నభినందించిరి.

తాత్కాలిక ఉపసంఘమునకు స్థిరమైన యేర్పాట్లు చేసితిమి. భారతదేశీయమహాసభాసమావేశమును నేనెన్నడు చూడలేదు. కాని దానినిగూర్చి చదివితిని. భారతదేశపితామహుడైన దాదాభాయిని చూచితిని; మెచ్చుకుంటిని. కాన నేను మహాసభకు భక్తుడను. ఆపేరు వ్యాపింపకోరితిని. నేను అనుభవము లేనివాడను. క్రొత్తపేరుకై యత్నించలేదు. తప్పుచేయుదునన్న భయముకూడ కలదు. అందుచేత అచ్చటి భారతీయులను తమసంస్థను నేటాలు భారతీయమహాసభ అని పిలువవలెనని నేను సలహా చెప్పితిని. భారతదేశమహాసభను గూర్చి నాకున్న స్వల్పజ్ఞానమును వారికి క్లుప్తముగా తెలిపితిని. ఎట్లయినను, నేటాలు భారతమహాసభ ౧౮౯౪ సం॥రం మే నెల ప్రాంతమున స్థాపితమాయెను. భారతదేశీయమహాసభకును నేటాలు మహాసభకును గలతేడా ఏమనగా నేటాలు మహాసభ యేడాదిపొడుగునను పనిచేయుచుండెను. ఏడాదికి మూడు పౌనులైనను చందా నిచ్చినవారిని సభ్యులుగా చేర్చుకొనిరి. అంతకుమించిన ధనమును కృతజ్ఞతతో నందుకొనిరి. ప్రతి సభ్యునివద్దనుండి అత్యధికమొత్తమును తీసుకొనుటకే యత్నములు జరిగెను. ఏడాదికి ౨౪ పౌనుల చొప్పున ఇచ్చువారు ఆరుగురు యుండిరి. ౧౨ పౌనులు ఇచ్చువారును చాలమంది కలరు. ఒకనెలలో మూడువందలమంది సభ్యులను చేర్చిరి. వారిలో హిందువులు, మహమ్మదీయులు, పారశీలు, క్రైస్తవులు కలరు. ఇండియాలోని ఏయే రాష్ట్రప్రజలు నేటా

లులో నుండిరో, ఆయారాష్ట్రములు అన్నిటినుండి సభ్యులు చేరిరి. మొదటి ఏడాదిలో మిక్కిలి చురుకుగా పనిజరిగెను. స్థితివంతులైన వర్తకులు దూరపుగ్రామములకుగూడ తమ బండ్లలోనే పోయి, క్రొత్తసభ్యులను చేర్చి చందాలు వసూలు చేసిరి. ప్రతివాడును అడగగానే ఇవ్వలేదు. కొందరిని ప్రోత్సాహపెట్టవలసి వచ్చెను. ఈప్రోత్సాహమే రాజకీయ ప్రబోధమయ్యెను. అచ్చటి పరిస్థితులను వారికి యెరుకపర్చెను. ఈమహాసభ నెలకొక పర్యాయమైనను కూడుచుండెను. అప్పుడు వివరములతో లెఖ్ఖలు చదివి వినిపించి మంజూరు చేయబడుచుండెను. అప్పుడు జరుగుచున్న సమాచారములను వారికి తెలియజెప్పి కార్యక్రమపుస్తకములో నమోదుచేయు చుండిరి. సభ్యులు అనేకప్రశ్నలడుగుచుండిరి. క్రొత్తవిషయ ములు చర్చించబడుచుండెను. దీనిలాభమేమనగా యెన్నడు సభలలో మాట్లాడనివారు అట్లు మాట్లాడుటకు అలవాటు పడిరి. మరియు ఆయుపన్యాసములు చక్కని శైలిలో నుండ వలసి వచ్చెను. ఇది యంతయు క్రొత్తఅనుభవము. భారతీయ బృందమునకు అధికమైన అభిరుచి కలిగెను. ఇంతలో సంతోష వార్త వచ్చెను. ఎన్నికహక్కులను తీసివేయుచట్టమును రిప్పన్ ప్రభువు నిరాకరించెను. ఇది వారి శ్రద్ధను ఆత్మవిశ్వాసమును ఇనుమడింపచేసెను.

వెలపలజేయు యీ ఆందోళనతోపాటు భారతీయ బృందములోపల జరుగవలసిన అభివృద్ధిని గురించి యోచింప

బడెను. భారతీయ జీవితవిధానమును ఆక్షేపించుచు దక్షిణాఫ్రికాలోని యూరోపియనులు ఆందోళన చేయుచుండిరి. భారతీయులు మిక్కిలి మురికివారనియు, లుబ్ధులనియు, వారు వాదించిరి. కాపురమున్నచోటనే వర్తకము చేయుదురు. ఇండ్లు గుడిసెలు మాత్రమె. స్వంతసౌఖ్యమునకైనను ఖర్చుచేయరు. పరిశుభ్రముగా నుండినట్టియు, అనేకములైన జీవితావసరములు గలిగినట్టియు, యూరపియనులు ఈ మురికివారును లుబ్ధులును అగు ప్రజలతో యెట్లు వర్తకములో పోటీ చేయగలుగుదురు? అందుచేత గృహారోగ్యము, వ్యక్తి ఆరోగ్యము, దుకాణములకు కాపురములకు వేరు యిండ్లు యుండు ఆవశ్యకత, స్థితివంతులు తమ స్థితికి తగిన పద్ధతిలో నివసించు ఆవశ్యకత, మొదలగు విషయములపై ఉపన్యాసము లియ్యబడెను. వాద ప్రతివాదములు చేయబడెను. సలహాలు సూచింపబడెను. ఇవన్నియు మహాసభ సమావేశములో జరుపబడుచుండెను. కార్యక్రమము గుజరాతీభాషలో నడచెను.

ఇందువలన భారతీయులకు ఎంతటి ఆచరణయోగ్యమైన రాజకీయ ప్రబోధము కలిగెనో పాఠకుడు తెలుసుకొనవచ్చును. కరారు ముగించిన కూలీల పిల్లలు నేటాలులోనె పుట్టినవారును ఇంగ్లీషు మాట్లాడువారును యువకుల లాభము నిమిత్తము, మహాసభ యాజమాన్యమున, నేటాలు భారత విద్యాసంఘము స్థాపించబడెను. దాని సభ్యులు స్వల్పమైన చందాల నిచ్చిరి. ఈ విద్యాసంఘము యొక్క ముఖ్యోద్దేశము

లేమనగా ౧. ఈ యువకులు ఒకచోట కలియునట్లు యేర్పాటు చేయుట, ౨. మాతృదేశము యెడ ప్రేమను వారిలో సృష్టించుట, ౩. మాతృదేశము గురించి సామాన్యజ్ఞానమును వారికి కలుగజేయుట, ౪. స్వతంత్రభారతీయులు వారలను గూడ తమ రక్తబంధువులు గావించుచున్నట్లు నచ్చచెప్పుట, ౫. స్వతంత్ర భారతీయుల మనస్సులో వీరియెడ మర్యాదభావము కల్పింపచేయుట. మహాసభకు యున్న ధనము దాని ఖర్చులు పోను కొంత మిగులుచుండెను. దానిని వినియోగించి భూమిగొనిరి. దానినుండి నేటికిని ఆదా వచ్చుచున్నది.

నేను కావాలనియే ఈ వివరములనన్నిటిని ఇచ్చితిని. ఇవి తెలియనియెడల, సత్యాగ్రహము ఎట్లు స్వతస్సిద్ధముగా అప్రయత్నముగా పుట్టినదో, ఎట్లు దానికై భారతీయులు సహజముగా తయారైరో, పాఠకుడు గ్రహించజాలడు. ఈ మహాసభయొక్క తరువాతిగ్రంథము యెట్లు ప్రఖ్యాతమయ్యెనో, ఎట్లు కష్టములు దానిని యెదుర్కొనెనో, ఎట్లు ప్రభుత్వోద్యోగులు దానిపై దాడివెడలిరో, ఎట్లు ఆదాడుల నుండి అది దెబ్బతినకుండ తప్పించుకొనెనో, వ్రాయక వదలి పెట్టవలసి వచ్చుచున్నది. కాని ఒక్క సంగతిమాత్రము నమోదుచేయకతప్పదు. భారతీయబృందము అతిశయోక్తిగా మాట్లాడు ఆచారములనుండి తప్పించుటకు చర్య తీసుకొనబడెను. ఎప్పుడును తమ లోపములను గమనించుటకై యత్నములు చేయబడెను. యూరపియనులు చెప్పు వాదములలో యున్న బలము ఒప్పుకొనుచుండిరి. సమానహోదాతోడ,

ఆత్మగౌరవమునకు అనుకూలముగను, యూరపియనులతో సహకారము చేయవీలుకలిగినప్పుడెల్లను, హృదయపూర్వకముగా అట్లు ఒనర్చుచుండిరి. భారతీయుల యుద్యమమును గూర్చి వారు ప్రకటించ ఇష్టపడినంత సమాచారము వార్తాపత్రికలకు పంపుచుండిరి. యెప్పుడైనను, అక్రమముగా భారతీయులను వార్తాపత్రికలలో ఖండించినయెడల, ఆయాపత్రికలకు తగిన సమాధానములు పంపబడుచుండెను.

నేటాలు భారతమహాసభవలెనే ట్రాన్సువాలులో కూడ నొకసంస్థ యేర్పరచబడెను. అయ్యది దీనికి అనుబంధముగాక స్వతంత్రమైన సంస్థ. రెండుసంస్థల కట్టుదిట్టములలోను కొన్ని భేదములుకలవు. వానిని యిక్కడ వివరించుట అనవసరము. ఈ నేటాలు ట్రాన్సువాలు సంస్థలకు భిన్నమైన కట్టుదిట్టములుగల ఒకసంస్థ కేపుటవునులోగూడ యుండెను. అయినను ఈమూడుసంస్థలయొక్క కార్యములును షుమారుగా ఒకమాదిరిగానే యుండెను.

౧౮౯౪ మధ్యకాలములో నేటాలుమహాసభ మొదటి సంవత్సరమును పూర్తిచేసెను. న్యాయవాదిగా నేను చేసిన పనిని నాకక్షిదారులు ఆమోదించిరి. నేటాలులో నేనుండు కాలము పెరిగెను. ౧౮౯౬ లో భారతీయబృందమువద్ద ఆరునెలలు సెలవుతీసుకొని నేను ఇండియాకు వెళ్లితిని. ఆ ఆరునెలలు పూర్తికాకముందే వెంటనే నేటాలుకు రమ్మని నాకు తంతివచ్చెను. నేను అట్లే బైలుదేరితిని. ౧౮౯౬-౯౭ సంవత్సరసంగతులు చెప్పుటకు వేరొక అధ్యాయముకావలెను.

---

## 7 వ అ ధ్యా య ము

### మొదటి పోరాటవివరములు — కొరవ



నేటాలు భారతీయమహాసభ ఇట్లు స్థిరపరుపబడెను. ఎక్కువగా రాజకీయపనినే చేయుచు, షుమారు రెండున్నర సంవత్సరములు, నేను నేటాలులోనే గడపితిని. నేను ఇంకను దక్షిణాఫ్రికాలో నుండవలసినయెడల నాకుటుంబమును ఇండియానుండి తీసుకొనిరావలయునని నేను అప్పుడు గ్రహించితిని. మరియు కొద్దికాలము స్వదేశములో గడుపనెంచితిని. నేటాలులోను, దక్షిణాఫ్రికాలో ఇతరభాగములలోను, ఉన్న భారతీయ స్థితిగతులను భారతదేశీయ నాయకులకు వినిపించదలచితిని. నేటాలు భారతమహాసభవారు నాకు ఆరునెలలు సెలవిచ్చిరి. నేటాలు ప్రఖ్యాతవర్తకుడైన చనిపోయిన, ఆదంజీ మియాఖాన్ నాస్థానే కార్యదర్శిగా నియమింపబడెను. ఆయన మిక్కిలి శక్తితో తనకర్తవ్యమును నిర్వహించెను. ఆయనకు చక్కగా ఇంగ్లీషువచ్చును. వాడుకవల్ల ఆజ్ఞానము మిక్కిలి ఎక్కువగా పెరిగెను. మామూలుస్థితిలో ఆయన గుజరాతిచదివెను. జూలూలుతో వ్యాపారసంబంధము యుండుటచేత, ఆయనకు జూలూభాషలో చక్కనిపరిచయముకలదు. వారి ఆచార వ్యవహారములు చక్కగా తెలియును. ఆయన మిక్కిలి శాంతుడు. ప్రేమపాత్రుడు. పెక్కుమాటలువాడు కాడు. ఈవివరములు యెందుకు చెప్పితిననగా ఇంగ్లీషుభాషాజ్ఞానముకన్నను, పాండిత్యముకన్నను, బాధ్యతగల పదవులను నిర్వహించుటకు,

సత్యము, ఓర్పు, పరసహనము, స్థిరత్వము, ధైర్యము, సామాన్య జ్ఞానము, నిశ్చలత్వము, అత్యంత ఆవశ్యకములు. ఈచక్కని లక్షణములు లేనిచోట, అత్యున్నతమైన భాషా జ్ఞానము, ప్రజాసేవలో మిక్కిలి స్వల్పముగానే ఉపయోగ పడును.

౧౮౯౬ సంవత్సరము మధ్యకాలములో నేను ఇండియాకు వచ్చితిని. అప్పుడు బొంబైకన్న కలకత్తాకుబోవు యోడలు తేలికగా దొరకుచున్నందున, నేను కలకత్తాబోవు యోడలో ప్రయాణముచేసితిని. ఏలనన కరారుకూలీలు కలకత్తానుండియు చెన్నపురినుండియు హెచ్చుగావచ్చుచుండిరి. కలకత్తాలోదిగి అటనుండి బొంబైకి పోవుచుండగా దోవలో బండితప్పి, అలహాబాదులో ఒకరోజు ఆగవలసివచ్చెను. నాకార్యక్రమము అక్కడ ప్రారంభమయ్యెను. పైనీరుపత్రికా సంపాదకుడగు ఛస్నీగారిని చూచితిని. ఆయననాతో గౌరవముగా మాట్లాడెను. కాని తన సానుభూతి నేటాలు యూరోపియనులయెడ కలదని మనస్సు విప్పిచెప్పెను. కాని నేను యేమైనను వ్రాసినయెడల, దానిని చదివి తన పత్రికలో ప్రకటింతునని చెప్పెను. నాకదిచాలును—

ఇండియాలోనుండగా, దక్షిణాఫ్రికాలోని భారతీయుల స్థితిగతులను గూర్చి నేనొక చిన్నపుస్తకమును వ్రాసితిని. షుమారుగా అన్ని వార్తాపత్రికలును దానిని గమనించెను. అది రెండుమారులు ముద్రితమయ్యెను. ఇండియాలోని వివిధ

ప్రదేశములలో ౫ వేల పుస్తకములు పంచిపెట్టబడెను. భారతీయ నాయకులైన సర్. ఫిరోజషామెహతా, బదురుద్దీన్—తయాబ్జీ; మహాదేవగోవిందరెనడీ, మొదలగువారిని బొంబైలోను, లోకమాన్యటిలక్, వారి మండలిని, ప్రొఫెసర్. భండార్కరును, గోపాలకృష్ణగోక్లేవారి మండలిని పునహాలోను చూచుఅదృష్టము నాకు యీకాలముననే తటస్థించెను. నేను బొంబయి పూనా చెన్నపురి పట్నములలో ఉపన్యాసములు చేసితిని. వాని వివరములు ఇచ్చట చెప్పదలచలేదు.

ఈ విషయమునకు హెచ్చుసంబంధము లేకున్నను పునహాలో జరిగిన పవిత్రమైన స్మరించతగిన హంశమును ఇచ్చట వర్ణించవలెనను ఉత్సాహమును నేను ఆపజాలకున్నాను. సర్వజనికసభ లోకమాన్యుని చేతిలోనుండెను. డక్కనుసభతో గోక్లేకు సంబంధముండెను. నేను మొట్టమొదట తిలక్ మహారాజును చూచితిని. పునహాలో సభచేయవలెనని నాకు ఉద్దేశ్యము ఉన్నదని వారితో చెప్పినప్పుడు, నేను గోపాలరావును చూచితినా అని ఆయన నన్ను అడిగెను. వారిభావమునాకు అర్థముకాలేదు. నేను గోక్లేగారిని చూచితినా యెరుగుదునా అని ఆయన మరలనన్ను అడిగెను.

"నేను వారిని ఇంకను చూడలేదు. వారి పేరు తెలియును. వారిని చూడదలచితిని" అని నేను జబాబుచెప్పితిని.

"భారతిరాజకీయములతో నీకుపరిచయమున్నట్లు కనుపడదు." అని లోకమాన్యుడు చెప్పెను.

"ఇంగ్లండునుండి తిరిగివచ్చినపిమ్మట, కొద్దికాలము మాత్రమే నేను ఇండియాలోనుంటిని. అప్పుడైనను నాశక్తికి మించినదను కారణమున, రాజకీయసమస్యలలో నేను జోక్యము కలిగించుకొనలేదు" అని చెప్పితిని.

అంతట లోకమాన్యుడు ఇట్లు చెప్పెను. "అట్లైన యెడల నీకు కొంతసమాచారము నేను చెప్పవలెను. పునహాలో రెండు కక్షలుకలవు. ఒకటి సర్వజనికసభ వారిది. రెండవది డక్కనుసభ వారిది."

"దీనినిగురించి కొద్దిగా నాకు తెలుసును" అని నేను జబాబు చెప్పితిని.

లోకమాన్యుడు "ఇచ్చట సభచేయుట తేలికయే. కాని ఇచ్చటి కక్షలు అందరికిని నీవ్యవహారమును తెలియజెప్పి అందరిసహాయమును పొందుటకై నీవు కోరుచున్నావని నాకు తోచుచున్నది. నీ అభిప్రాయము నాకు నచ్చినది. కాని నీ సభకు సార్వజనికసభలోని సభ్యుడు అధ్యక్షుడైనయెడల, డక్కనుసభాసభ్యులు ఒక్కడైననురారు. అలాగుననే డక్కను సభాసభ్యుడు అధ్యక్షుడైనయెడల, సార్వజనికసభాసభ్యులును రారు. గాన ఏకక్షకును చెందనివానిని నీవు అధ్యక్షునిగా సంపాదించవలెను. ఇందువిషయమై నీకు సలహామాత్రము నేను చెప్పగలను. ఇతరసహాయము చేయజాలను. నీవు భండార్కరు విద్వాంసుని యెరుగుదువా? యెరుగకున్నను వారిని దర్శించవలెను. ఆయన తటస్థుడని అనుకొందును.

ఆయన రాజకీయములలో పాల్గొనడు. కాని నీసభకు అధ్యక్షుడుగా నుండుటకు బహుశా నీవు ఒప్పించగలవు. దీనిని గూర్చి గోక్లేగారితో మాట్లాడుము. వారి సలహాకూడా పొందుము. వారున్నూ బహుశః యిదేసలహా ఇయ్యవచ్చును. భండార్కరు విద్వాంసునివంటివారు అధ్యక్షుడైనయెడల మంచిసభ జరుగునట్లు ఉభయపక్షములును ప్రయత్నింతురని నానిశ్చయము. ఎట్లైనను మాపూర్తిసహాయముమీద నీవు ఆధారపడవచ్చును."

నేను అప్పుడు గోక్లేగారిని చూచితిని, మొట్టమొదట చూపులోనే వారిని నేనెట్లు ప్రేమించితినో ఇతరత్రా నేను వ్రాసియున్నాను. కోరికగలవారు ఎంగిండియా, నవజీవను, పత్రికలు వెదుకుకొనవచ్చును. లోకమాన్యుడు నాకిచ్చిన సలహా గోక్లేకును నచ్చెను. ఆప్రకారమే పూజనీయుడైన విద్వాంసునియొద్దకు వెళ్లి నా భక్తిని తెలిపితిని. వారు శ్రద్ధావంతులై నేటాలులోని భారతీయుల కష్టముల చరిత్రను వినిరి. ఇట్లు చెప్పిరి. "ప్రజాహితవ్యవహారములలో మిక్కిలి అరుదుగా నేను పాలుగొనుచున్నానని నీకు తెలియును. అంతేగాక నేను ముసలివాడనగుచున్నాను, కాని నీవు నాతో చెప్పినది నన్ను ఎక్కువగా కల్తపరిచినది. అన్నిపక్షముల సహకారమును పొందవలెనను నీ అభిప్రాయము నాకు నచ్చినది. నీవు చిన్నవాడవు. ఇండియాలోని రాజకీయ పరిస్థితులు నీకు తెలియవు. నీకోరికను నేను అంగీకరించితినని రెండుపక్షముల సభ్యులకును దెలుపుము.

ఫలానిరోజున సభజరుగునని వారెవరైనను నాకు కబురుచేసిన యెడల నేను తప్పకవచ్చి అధ్యక్షతను వహించెదను." పున హాలో జయప్రదమైన సభజరిగెను. రెండుపక్షముల నాయకు లునువచ్చి, నాఉద్యమమునకు బలకరముగా మాట్లాడిరి.

నేను అంతట చెన్నపురిపోతిని. అచ్చట న్యాయమూర్తి సుబ్రహ్మణ్యయ్యరుగారిని, ఆనందాచార్యులను, హిందూపత్రి కకు అప్పటి సంపాదకుడైన జి. సుబ్రహ్మణ్యమును, మద్రాసు స్టాండర్డు పత్రిక సంపాదకుడైన పరమేశ్వరంపిల్లైను, ప్రసిద్ధ న్యాయవాదియైన భాష్యం అయ్యంగారిని, నార్టనుగార్లను ఇతరులను చూచితిని. అచ్చటను పెద్దసభ జరిగెను. అటనుండి కలకత్తా చేరితిని. అచ్చట సురేంద్రనాధబెనర్జీ, మహారాజా జోతీంద్రమోహన్‌టాగూరు, ఇంగ్లీషుమన్ పత్రికాసంపాద కుడు, చనిపోయిన సాండరుసుగార్లను తదితరులను చూచితిని. కలకత్తాలో సభాప్రయత్నములు చేయుచుండగా తక్షణమే బయలుదేరి రమ్మనమని నేటాలునుండి తంతివార్త వచ్చెను. ఇది ౧౮౯౬ నవంబరు నెలలో భారతీయులకు వ్యతిరేకమైన ఉద్యమము సాగింపబడుచున్నదని తీర్మానించుకొంటిని. కాన కలకత్తాలో పనిని అసంపూర్తిగావదలి, బొంబయిపోయి, అక్కడ దొరికిన మొదటి యోడలో నాకుటుంబముతో కూడ బయనమైతిని. దాదా అబ్దుల్లా సంఘమువారు "క్లోర్లెండు" యోడను కొనిరి. పోరుబందరు నేటాలుమధ్య ఓడనడుపుటకు మిక్కిలి సాహసికులైన ఈ సంఘమువారు

చేసిన మరియొక్క ప్రయత్నమిది. ఈ కోర్లండు యోడ తరువాత, వెంటనే పరిషియన్ష్టీము నావిగేషన్ కంపెనివారి, "నాదేరీ" యోడ బయలుదేరెను. రెండుయోడలమీద షుమారు ౮౦౦ మంది ప్రయాణికులు యుండిరి.

ఇండియాలో జరిపిన యీ ఆందోళనము కొంత ప్రాముఖ్యమును పొందెను. ఇండియాలోని ముఖ్యమైన వార్తా పత్రికలు దీనినిగురించి వ్రాసెను. రూటరు దీనినిగురించి ఇంగ్లండుకు తంతివార్త పంపెను. ఈ హాంశము నేను నేటాలు చేరినపిమ్మట, నాకు తెలిసెను. ఇంగ్లండులోనున్న రూటరు ప్రతినిధి నేటాలుకు ఒక చిన్నతంతివార్త పంపెను. అందులో ఇండియాలో నేనిచ్చిన ఉపన్యాసములను గురించి అతిశయోక్తులు తెలుపబడెను. ఇది మామూలుకు భిన్నమైన అనుభవముకాదు. ప్రతిపర్యాయము ఇట్టి అతిశయోక్తి ఉద్దేశ్యపూర్వకముగా చేయబడదు. పూర్తిగా విచారించబడని అభిప్రాయములును, స్వకీయమైన ఇష్టానిష్టములును, వీనితోపాటు హెచ్చుపనులును గలిగిన ప్రజలు, విషయములను పైపైన చదువుదురు. దానిసంగ్రహమును తయారు చేయుదురు. అందులో ఒకొ్కక్కప్పుడు తమ ఊహాకల్పితములు చేరుచుండును. మరియు ఇట్టి సంగ్రహములకు వివిధ ప్రదేశములలో వివిధములుగా అర్థములు చెప్పుదురు. ఎవరును ఉద్దేశించకుండగనే అపభ్రంశములు ఇట్లు యేర్పడును. ప్రజాహితకార్యక్రమములో ఈ చిక్కుగలదు. ఇదియే దానికి

పరిమితియు అయియున్నది. ఇండియాలోనుండగా, నేను నేటాలు యూరోపియనులను విమర్శించితిని. కరారుకూలీల మీద వేసిన 3 పౌనుల పన్నునుగూర్చి మిక్కిలిగట్టిగా మాట్లాడితిని. కరారుకూలీ అయిన సుబ్రహ్మణ్యమును అతని యజమాని దండించెను. ఆయన గాయములను నేను స్వయముగా చూచితిని. ఆతనిదావా నాచేతులలో నుండెను. వానికష్టములను గూర్చి, కన్నులకుగట్టినట్టుగా, ఇండియాలో వర్ణించితిని. నాఉపన్యాసములయొక్క అపార్థము జేయబడిన సంగ్రహమును నేటాలులోని యూరోపియనులు చదివినపుడు, నామీద వారికి హెచ్చుగా కోపమువచ్చెను. కాని ఆశ్చర్యకరమైన సంగతి యేమనగా ఇండియాలో వ్రాసి మాట్లాడిన దానికన్న నేటాలులో నేను వ్రాసినదానిలోనే మరింతకాఠిన్యమును, మరిన్ని వివరములును కలవు. ఇండియాలో నేనిచ్చిన యుపన్యాసములలో రవంతయైనను అతిశయోక్తి లేదు. మనము యేహాంశమునైనను పరాయివానికి వర్ణించి చెప్పినపుడు మనము ఉద్దేశించినదానికన్న వాడు హెచ్చు గ్రహించును. ఇట్టి యనుభవము నాకుండుటచేత, విషయములనుపట్టి చెప్పదగిన దానికంటె, తక్కువబలముగా ఇండియాలో దక్షిణాఫ్రికా స్థితిని, ఉద్దేశ్యపూర్వకముగా, నేను వర్ణించియుంటిని. కాని నేటాలులో నేనువ్రాసినది మిక్కిలి కొద్దిమంది యూరోపియనులు చదువుదురు. ఇంకను తక్కువమంది లక్ష్యముచేయుదురు. ఇండియాలోని నా వ్రాతలయొక్కయు సంభాషణముల

యొక్కయు సంగతి స్పష్టముగా వేరైయుండెను. రూటరు సంగ్రహములను వేలకొలది యూరపియనులు చదువుదురు. అదియునుగాక యేవిషయమునుగూర్చి తంతిద్వారా సమాచారము పంపుట యోగ్యమని యెన్నబడెనో, దానికి స్వతస్సిద్ధముగాలేని ప్రాముఖ్యత ఇందువలనవచ్చును. ఇండియాలో నేను చేసినపనికి వారు ఆరోపించిన ప్రాముఖ్యతకలదనియు, అందువల్ల కరారుకూలీలను పంపుపద్ధతి ఆగిపోవుననియు, అందుచేత వందలకొలది యూరోపియను తోటయజమానులు నష్టపడుదురనియు నేటాలులోని యూరపియనులు తలంచిరి. అంతేగాక ఇండియాలో తమ మర్యాదనశించినదని వారు భావించిరి.

ఇట్టి ఉద్రేకస్థితిలో వారుండగా నేనును నాకుటుంబమును కోర్లెండు యోడమీద నేటాలుకు తిరిగి వచ్చుచున్నామనియు, దానిమీద మూడు నాలుగు వందలు భారత ప్రయాణికులు గలరనియు, అదేసమయమున, అంతిమంది భారతీయులతో నాదెరీ ఓడవచ్చుచున్నదనియు, ఆనేటాలు యూరోపియనులు వినిరి; వారు మరింత మండిపడిరి. అత్యధికమైన భావోద్రేకము ప్రేలెను. నేటాలు యూరోపియనులు పెద్దపెద్ద సభలుచేసిరి. ఆసభలకు షుమారుగా వారి జాతిలోని ప్రముఖులందరు వచ్చుచుండిరి. ఈయోడలలోయున్న భారత ప్రయాణికులు కొంతవరకును ముఖ్యముగా నేనును వారి తీవ్ర విమర్శకు గురియైతిమి. ఈయోడలరాక నేటాలుమీద దండ

యాత్రగా వర్ణింపబడెను. నేను ౮౦౦ మంది ప్రయాణికులను నేటాలుకు తెచ్చుచున్నాననియు, నేటాలును స్వతంత్ర భారతీయులతో ముంచివేయుటకు ఇది నా ప్రథమ ప్రయత్నమనియు, ఆ ఉపన్యాసకులు చెప్పిరి. నాతోకూడ కలిపి ఆ ప్రయాణికులనందరిని నేటాలులో దిగకుండగ ఆపించవలెనని ఏకగ్రీవముగా తీర్మానముచేసిరి. నేటాలు ప్రభుత్వము ఇట్టిపనిచేయ సమ్మతించకపోయినను, లేదా, చేయజాలకపోయినను, ఆసభలో యేర్పరచబడిన యుపసంఘమువారు, చట్టములను ఉల్లంఘించి, తాము స్వయముగా, దౌర్జన్యముచేత ప్రయాణికులను ఆపవలెనని, తీర్మానించుకొనిరి. రెండు యోడలును ఒకే దినము దర్బానుకు చేరెను.

౧౮౯౬ సంవత్సరములో బొబ్బలజాడ్యము మొట్టమొదట ఇండియాలో తలయెత్తెను, అని పాఠకుడు జ్ఞాపకముయుంచుకొని యుండును. అప్పటికి ప్రవేశనిషేధ శాసనము పుట్టనందున నేటాలు ప్రభుత్వమువారు మమ్ము ఆపుటకు చట్ట సంబంధమైన చిక్కులు కలిగెను. ఈచిక్కులేనిచో, పైచెప్పిన యూరపియను ఉపసంఘమునందే వారికి సంపూర్ణ సానుభూతి యుండెను. ఆ ప్రభుత్వ సభ్యుడైన, చనిపోయిన యస్కోంబో ఈ ఉపసంఘ కార్యక్రమములో హెచ్చుగా పాలుగొనెను. వారిని రెచ్చగొట్టినది ఇతడే. ఏ అంటుజాడ్యమైనను యోడ మీదతగిలినను, అంటుజాడ్యములు ఉండిన రేవులనుండి యోడలు వచ్చుచున్నను, దానిని కొంతకాలము పరీక్షార్థము

నిలుపవచ్చునని, రేవు పట్టణములలో ఒక సూత్రము అమలులో నుండెను. ఆరోగ్యము నిమిత్తమును, ఆ రేవులోని ఆరోగ్యాధికారి ఉత్తరువులనుబట్టియు, ఈనిరోధము విధించవచ్చును. నేటాలు ప్రభుత్వమువారు ఈసూత్రమును దుర్వినియోగముచేసి రాజకీయములకై అమలుపరచిరి. ఈయోడలమీద అంటుజాడ్యములు లేకున్నను, మామూలు పరీక్షాకాలముకు అధికముగామించి యిరువైమూడు రోజులవరకు, రెండు యోడలను ఆప్రభుత్వము వారు నిలిపిరి. ఇంతలో పైజెప్పిన యూరపియను ఉపసంఘమువారు, వారి పనులు సాగించిరి. కోర్లెండుకు ఖామందులును, నాడీరీకి ప్రతినిధులును, అయిన దాదాఅబ్దుల్లా సంఘమువారిని యీ యూరపియును ఉపసంఘమువారు మిక్కిలి బాధపెట్ట మొదలిడిరి. ఈ ప్రయాణికులను వెనుకకు పంపినయెడల యేదియోలాభము చూపింతుమని ఆశపెట్టిరి. అట్లు పంపనిరాకరించినయెడల, వర్తకము నశింపజేతుమని బెదిరించిరి. కాని ఆసంఘముయొక్క భాగస్వాములు పిరికివారు కారు. తాము ధ్వంసమైనను లక్ష్యముచేయమని చెప్పిరి. చిట్టచివరకు పోరాడుదుమనిరి. కాని నిస్సహాయకులును నిర్దోషులును, అయిన యీ ప్రయాణీకులను తిరిగి పంపించెడి నేరము చేయుటకు యెంత ఒత్తిడిపెట్టినను అంగీకరించమనిరి. వారు దేశాభిమానమునకు దూరులుగారు. ఈసంఘమునకు న్యాయవాదియైన లాఫ్టన్‌కూడ ధైర్యస్తుడే.

అదృష్టవశాత్తు, సూరత్‌లోని గౌరవనీయుడగు కాయస్థుడును, న్యాయమూర్తి నానాభాయిహరిదాసుగారి మేనల్లుడును అగు మన్‌సుక్లాల్ హీరాలాల్ నాజర్‌గారు ఆసమయముననే ఆఫ్రికాకు చేరెను. ఆయననుగాని ఆయన ప్రయాణముసంగతిగాని నేను ఎరుగను. ఈ "నాదేరీ కోర్లాండు" లో వచ్చిన ప్రయాణీకులను తెచ్చుటలో నాకేజోక్యమును లేదని, నేను చెప్పనక్కరయే లేదు. వారిలో చాలమంది దక్షిణాఫ్రికా పూర్వనివాసులు. వారిమీద గూడ, యూరపియను ఉపసంఘము బెదరింపులుగల యుత్తరములు జారీచేసెను. ఓడయొక్క ముఖ్యాధికారులు దీనిని చదివి వినిపించిరి. నేటాలులోని యూరోపియనులు ఘోరమైన కోపముతో నున్నారనియు, ఈ హెచ్చరికకు భిన్నముగా భారతప్రయాణికులు దిగుటకు ప్రయత్నము చేసిన యెడల, ఆ ఉపసంఘ సభ్యులు రేవు వద్ద హాజరై దిగిన ప్రతిభారతీయుని సముద్రములోకి నెట్టుదురు అనియు ఆప్రకటనలలో స్పష్టముగా చెప్పబడి యుండెను. కోర్లండులో యున్న వారికి దానిని తర్జుమాచేసి నేను చెప్పితిని. నాదేరీలో యున్నవారిలో ఇంగ్లీషు తెలిసినవారు ఒకరు. అందులోని వారికిని అట్లే చెప్పిరి. రెండు ఓడలమీద ప్రయాణికులును తిరిగి పోవుటకు గట్టిగా నిరాకరించిరి. మరి ఇట్లు చెప్పిరి. తమలో చాలమంది ట్రాన్సువాలుకు పోవుచున్నారు. తక్కినవారిలో కొందరు నేటాలులో పూర్వనివాసులు. ఎవరెట్లు పోయినను, వారిలో ప్రతివారికిని అచ్చట దిగుటకు

చట్టప్రకారము హక్కు కలదు. ఈ ఉపసంఘము వారి బెదిరింపులను లక్ష్యముచేయక తమ హక్కును 'పరీక్షించుకొను నిమిత్తము తాము అక్కడ దిగుటకు తీర్మానించుకొనిరి.

నేటాలు ప్రభుత్వము వారికి యేమియు తోచలేదు. అన్యాయమైన నిషేధమును, యెన్నాళ్లు సాగించగలరు? అప్పటికే ఇరువదిమూడు రోజు లయ్యెను. అట దాదాఅబ్దుల్లా సంఘమువారు లొంగలేదు. ఇట ప్రయాణికులును లోబడలేదు. కాన ఇరువదిమూడురోజులు అయిన పిమ్మట నిషేధమును తొలగించి ఓడలను రేవులోనికి రానిచ్చిరి. ఈలోపల ఉద్రేకులైన యూరపియను ఉపసంఘమును యస్కోంబు శాంతింపజేసెను. ఒకసభలో అతడిట్లు చెప్పెను. "దర్బానులో యున్న యూరపియనులు పొగడదగినంత ఐకమత్యమును ధైర్యమును చూపిరి. వీరు చేయగలిగినంత చేసిరి. ప్రభుత్వము గూడ మీకు సహాయము చేసెను. భారతీయులు యిరువైమూడు రోజులు ఆపబడిరి. మీ అభిప్రాయములును మీ ప్రజాహితభావమును స్పష్టముగా ప్రకటించితిరి. సామ్రాజ్య ప్రభుత్వమునకు ఇందువలన మీ అభిప్రాయములు స్పష్టముగా వెల్లడియగును. కొంత ఒత్తిడి కలుగును. మీరు చేసిన పని వలన నేటాలు ప్రభుత్వము వారి మార్గము సులభమైనది. ఇప్పుడు ఒక్క ప్రయాణికునినైనను, మీరు దౌర్జన్యమువల్ల దిగకుండ ఆపినయెడల, మీ ప్రయోజనములను చెడగొట్టుకుందురు. నేటాలుప్రభుత్వమును చిక్కుస్థితిలోనికి దింపెదరు. అప్పటికిని

వారిని దిగకుండ జేయుటలో మీరు జయమునుపొందజాలరు. ఆప్రయాణీకుల తప్పేమియు లేదు. వారిలో స్త్రీలు పిల్లలు కలరు. వారు బొంబయిలో బయలుదేరినపుడు మీ భావములు వారికి తెలియవు. కాన యెవరిదోవను వారు పొండు. ఈ ప్రయాణికులను ఆటంకపరచకుడు. ఇది నా సలహా అయినను ఇకముందు ఇట్టిప్రయాణికుల ప్రవేశమును ఆపుటకు తగిన అధికారములను నేటాలుప్రభుత్వమువారు శాసనసభనుండి పొందెదరు. అని మీకు నేను గట్టిగా చెప్పగలను." ఇది యస్కోంబుగారి ఉపన్యాససారము మాత్రమె. ఆయనమాటలను వినినవారు నిరాశచెందిరి. కాని అతనికి పలుకుబడి హెచ్చుగా నుండెను. ఆసలహాప్రకారము వారు వెడలిపోయిరి. ఓడలు రెండును రేవులోనికి వచ్చెను.

ఇతరులతోగూడ దిగవద్దనియు, సాయంత్రమువరకు ఆగవలసిదనియు అపుడు యింటివరకు నన్ను తీసికొనిపోవుటకు పోలీసు అధికారిని పంపుదుననియు నాకుటుంబమువారు ఎప్పుడైనను దిగవచ్చుననియు, యెస్కోంబో నాకు సమాచారము బంపెను. ఇది చట్టప్రకారము యుత్తరువుగాదు. నన్ను దించక యుండుమని ఓడయధికారికి సలహా, నాతలపై పడనున్న ఆపదను సూచించునది హెచ్చరిక మాత్రమే. నేను దిగకుండ ఓడ యధికారి నన్ను ఆపలేదు. కాని నేను ఈసలహా అంగీకరించవలెనని తీర్మానించుకొంటిని. నాయింటికిగాక నాపాత మిత్రుడును కక్షిదారును అయిన పారసీ రుస్తుంజీ యింటికి

నాకుటుంబమును పంపితిని. అచ్చట వారినికలసెదనని వారితో చెప్పితిని. అందరు ప్రయాణికులు దిగినపిమ్మట దాదాఅబ్దుల్లా న్యాయవాదియు నాస్వంతమిత్రుడును అయిన లాప్టను పైకి వచ్చి నన్ను కలిసెను. నేను ఏల దిగలేదని అడిగెను. యస్కోంబు యుత్తరముసంగతి వానితో చెప్పితిని. సాయంత్రమువరకు ఆగి పిమ్మట దొంగవలెనో, నేరస్తునివలెనో పట్టణములో ప్రవేశించుట తనకు నచ్చలేదని అతను చెప్పెను. నేను భయపడనియెడల తక్షణమే అతనితోగూడ బయలు దేరవలెననియు, యేమియు జరుగనట్లుగానే మేమిద్దరము పట్టణములోనికి నడచి పోదుమనియు అతడు సూచించెను. నేను ఇట్లు జవాబు చెప్పితిని. "నేను భయపడుచున్నానని అనుకొనను. యస్కోంబుగారి సూచనను అంగీకరించుట లేక నిరాకరించుట యేది సత్యము అనునదే సమస్య. ఓడ యధికారి జవాబుదారి యెంతగలదో మనము ఆలోచించవలెను." లాప్టన్ నవ్వి ఇట్లు చెప్పెను. "యస్కోంబు నీకేమి చేసినాడు? ఆతని సలహా నీవేల లక్ష్యముచేయవలెను? అతనికి దురుద్దేశ్యము లేక దయతోడ ఇట్టి సలహా నిచ్చినాడని నమ్ముటకు నీకేమి కారణముగలదు? పట్టణములో యేమి జరిగినదియు, అందులో యస్కోంబుకు యెంతజోక్యమున్నదియు నీకంటె నాకు హెచ్చు తెలుసును." నాతల త్రిప్పి ఆతని ధోరణిని ఆపితిని. లాప్టన్ ఇట్లు చెప్పసాగెను. "అతడు ఉత్తమోత్తమమైన ఉద్దేశ్యములతో సంచరించుచున్నాడని మన మను

కొందము. కాని ఆతని సలహాను నీవు అంగీకరించినయెడల నీవు అవమానమును పొందుదువని నాదృఢమైన అభిప్రాయము కాన తయారుగా నున్నయెడల వెంటనే బయలుదేరుమని నేను సలహా చెప్పెదను. ఓడ అధికారి మనవాడు. అతని బాధ్యత మనబాధ్యతయే. అతను దాదాఅబ్దుల్లాకే జబాబు చెప్పవలెను. వారు ఈవిషయములో హెచ్చు ధైర్యమును కనుపరచిరి గనుక దీనినిగూర్చి వారు యేమి అనుకొనునది నాకు తెలుసును." నేనిట్లు జబాబు చెప్పితిని. "అయితే బయలు దేరుదము. నేను చేయవలసిన యేర్పాట్లు లేవు. నేను చేయవలసినదల్లా నాతలగుడ్డ పెట్టుకొనుటయే. ఓడ అధికారితో చెప్పుదము, బయలు దేరుదము." అని అధికారియొద్ద శెలవు పుచ్చుకొంటిమి.

లాటను దర్బానులో పాతవారును ప్రసిద్ధుడైన న్యాయవాదియు, నేను ఇండియాకు తిరిగి రాకముందు ఆయనకును నాకును సన్నిహితసంబంధ మేర్పడెను. చిక్కు దావాలలో ఆయనతో సంప్రదించుచుంటిని. నాదావాలలో పెద్దన్యాయవాదిగా ఆయనను కుదుర్చుచుంటిని. ఆయన ధైర్యస్తుడు. బలిష్టుడు.

దర్బాను ముఖ్యవీధులగుండ మేము పోవలసియుండెను. మేము వెడలునపుడు సాయంత్రము షుమారు ౪½ గంట అయి యుండెను. కొంచెము మబ్బుపట్టి యుండెను. సూర్యుడు కనపడుటలేదు. కాలినడకను రుస్తుంజీ ఇంటికి పోవుటకు కనీ

సను గంటమైనను పట్టును. రేవువద్ద మామూలుకంటె హెచ్చుజనులు అప్పుడులేరు. మేము దిగగానే కొందరుపిల్లలు మమ్ములను చూచిరి. భారతీయులలో ఒక ప్రత్యేకరకము తల గుడ్డ పెట్టునది నేనొక్కడనే గనుక వారు నన్ను వెంటనే గుర్తించిరి. గాంధి, గాంధి వానిని కొట్టుడు, వానిచుట్టు ముట్ట డించుడు, అని అరవసాగిరి. మావద్దకు వచ్చిరి. కొందరు రాళ్లు విసరిరి. పెద్దవాళ్లగు యూరపియనులు కొందరు పిల్ల లతో చేరిరి. క్రమేణ అల్లరిమూక పెరిగెను. కాలినడకతో పోవుట అపాయము అని లాటన్ తలచెను. కాన ఒకరిక్షాను పిలచెను. మానవులు లాగెడిబండిలో కూర్చుండుట నాకు మిక్కిలి వెగటు కావున అంతకుముందు ఎన్నడును నేను రిక్షాలో కూర్చుండలేదు. కాని అప్పుడావాహనమును ఉప యోగించుట నాకర్తవ్యమని భావించితిని. దేవుడు యెవరిని రక్షించదలచునో వాడు తాను కోరినను పడిపోజాలడని నాజీవితములో ఆరు యేడుమారులు నాకు అనుభవము కలి గెను. నేను పడనియెడల దాని ఘనతను నేను నాకు ఆరో పించుకొనలేను. జూలూలు ఈరిక్షాలు లాగుదురు. రిక్షాలో నన్ను ఎక్కనిచ్చినయెడల వానిని కొట్టుదుమనియు, రిక్షాను బద్దలుచేతుమనియు, ఆయూరపియను పిన్నపెద్దలు రిక్షావానిని బెదిరించిరి: కాన వాడు రానను అర్థముగల "ఖా" అని చెప్పి వెడలిపోయెను. అట్లు రిక్షాను యెక్కు సిగ్గునుండి నేను తప్పించుకొంటిని.

మాగమ్యస్థానమునకు కాలినడను పోవుటతప్ప వేరొక సాధనము కనుపడలేదు. అల్లరిమూక మావెంటపడెను. మేము ముందుకువేసిన ప్రతిఅడుగుతో, అది పెరుగుచుండెను. మేము వెస్టువీధి చేరునప్పటికి ఆమూక అత్యధికమయ్యెను. బలిష్టుడొక్కడు లాట్టనును పట్టుకొని నానుండి చీల్చి దూరముగా పడవేసెను. కాన ఆయన తిరిగి నాయొద్దకు వచ్చుటకు వీలు లేకపోయెను. నన్నుతిట్టుటకు, నామీద రాళ్ళువేయుటకు, చేతికిదొరకినదెల్ల నామీద పడవేయుటకును ఆమూక ప్రారంభించెను. నాతలగుడ్డ క్రిందపడవేసిరి. ఇంతలో ఒకమోటు వాడు నాయొద్దకువచ్చి మొకముమీదకొట్టి అంతట నన్ను తన్నెను. నేను స్మృతితప్పి క్రిందపడబోవుచుంటిని. దగ్గరనున్న ఇంటికమ్ములను పట్టుకొని నిలువబడితిని. ఒకనిమిషము ఊపిరి పీల్చితిని. ఆమూర్ఛతొలగగానే, నాదోవను నడుచుచుంటిని, జీవముతో ఇంటికిచేరుదునన్న ఆశను నా పాల్లు విడిచిపెట్టితిని. కాని నన్నుకొట్టు యీదుండగీడులను అప్పుడైనను నా హృదయము నిందించలేదని నాకు స్పష్టముగా జ్ఞాపకమున్నది.

నేనిట్లు వెళ్లుచుండగా పోలీసు పై అధికారి అలెగ్జాండరు గారి భార్య ఎదురుగావచ్చుచుండెను. మేము ఒకరి నొకరము బాగాయెరుగుదుము. ఆమెధైర్యముగల స్త్రీ. సూర్యాస్తమయము కాబోవుచుండినను, ఆకాశమున మబ్బుపట్టియున్నను, నన్ను రక్షించు నిమిత్తము ఆమె గొడుగు విప్పి నాప్రక్కనే నడువసాగెను. యూరపియనులు స్త్రీని అవమానించరు.

ఆమెకు అపాయముచేయరు. ఈమె సామాన్య స్త్రీ గాక తమలో పాతవాడును ప్రజానురంజకుడైన ఉద్యోగస్తుని భార్య కాన ఈమెకు ఇబ్బందిలేదు. నామీద దెబ్బలుకొట్టుచు ఆమెకు తగులకుండ వారు జాగ్రత్తపడవలెను. కాన ఆమె నాచెంతకు వచ్చిన పిమ్మట నాకు తగిలినవి పెద్దదెబ్బలుకావు. ఇంతలో నామీద జరుగుచున్న దాడిసంగతి ఈమెభర్తకు తెలిసెను. నా సంరక్షణనిమిత్తము ఆయన ఒకపోలీసు ముఠాను పంపెను. వారు నాచుట్టు వలయముగా నేర్పడిరి. మాదోవ లోనే ఆఠాణాయుండెను. మేము అక్కడికి చేరునప్పటికి ఆయన మాకై వేచియున్నట్లు నేను కనుగొంటిని. అక్కడ నాకు ఆశ్రయమిత్తునని ఆయనచెప్పెను. వందనములతో వల దంటిని. మరి ఇట్లుచెప్పితిని. "నేను నాగమ్యస్థానము చేర వలెను. దర్బానుపౌరుల న్యాయబుద్ధిలోను, నాయుద్యమ ధర్మ ములోను, నాకు నమ్మకముగలదు. నన్ను కాపాడుటకై మీరు పోలీసుముఠాను పంపినందులకు మీకు కృతజ్ఞుడ. మీభార్యగూడ నన్ను కాపాడుటకు తోడ్పడినది."

క్రొత్తచిక్కులు లేకుండ రుస్తుంజీ యింటికి చేరితిని. అప్పటి కించుమించుగా సాయంత్రమైనది. కవర్నండు వైద్యాధి కారి దాదీబర్జర్‌గారు రుస్తుంజీసేటుతోనుండిరి. ఆయన నాకు వైద్యము మొదలిడిరి. నాగాయములు పరీక్షించిరి. అవి యెక్కు వగా లేవు. ఒకలోతట్టుగాయము మాత్రము మిక్కిలి బాధకలి గించెను. కాని శాంతముగా విశ్రమించు అదృష్టము నాకింకను

పట్టలేదు. రుస్తుంజీ యింటిముందు వేలకొలది యూరోపియ
నులు చేరిరి. చీకటి పడగానే తుంటరులు గూడ వారితో
కలిసిరి. నన్ను వారికి స్వాధీనపరచనియెడల, ఆయనను ఆయన
యింటిని నాతో గూడ తగలబెట్టెదమని ఆఅల్లరిగుంపు లోప
లికి రుస్తుంజీకి కబురుపంపెను. రుస్తుంజీ స్వచ్ఛమైన భారతీ
యుడు, భయపడలేదు. ఇంతలో పోలీసు పైఅధికారి, అలె
గ్జాండరుకు, యీ సమాచారము తెలిసెను. వెంటనే ఆయన
గూఢచారులతో గూడ, ఈమూకలో జొచ్చెను. ఒక బల్ల
తెప్పించుకొని దానిమీద నిలబడెను. ఆమూకతో మాట్లాడు
మిషమీద, రుస్తుంజీ యింటి సింహద్వారమును వశపరుచు
కొనెను. ఇతరులు యెవరును దానిని బ్రద్దలుకొట్ట వీలులేకుండ
చేసెను. అంతకుముందే తగినచోట్ల గూఢచారులను నిలిపెను.
అక్కడకురాగానే, తన క్రింది ఉద్యోగస్తునకు భారతీయ
వర్తకునివలె వేషమువేసుకొనమనియు, ముఖమునకు రంగు
వేసుకొనమనియు చెప్పి నావద్దకు ఈకబురు అందించమని
ఉత్తరువు చేసెను "నీస్నేహితుని అతని అతిథులను ఆస్తిని
నీ కుటుంబమును కాపాడుకొనుటకు నీవు ఇష్టపడునెడల,
నాసలహావినుము. భారతీయ పోలీసువలె వేషమువేసుకొనుము.
రుస్తుంజీ గిడ్డంగులలోనుండి బైటికిరమ్ము. నామనిషితో గూడ
ఈమూకలోనుండి దొంగతనముగా తప్పించుకొనుము. ఠాణాకు
చేరుము. ఈవీధిమూల ఒకబండివేచియున్నది. నిన్నును ఇత
రులను రక్షించుటకు నాకు ఇదియొకటియే దోవ. ఈమూక

అమితో ద్వేషముతో యున్నది. వారిని వశముచేసుకొనుట నాచేతగాకయున్నది. తీక్షణమే నాసూచనను నీవు అనుసరించనియెడల, ఈమూక రుస్తుంజీ యింటిని నేలతో మట్టము చేయుదురని నేను భయపడుచున్నాను. ఎన్ని ప్రాణములు పోవునో; యెంత ఆస్తి నష్టమగునో, ఊహించ నాకు దుస్సాధ్యము."

ఆస్థితిని వెంటనే గ్రహించితిని. పోలీసువేషము వేసుకొని రుస్తుంజీ యింటిని వెంటనే వదిలితిని. ఆయుద్యోగస్తుడును నేనును వెంటనే ఠాణాకు చేరితిమి. ఈలోపల అలగ్జాండరు ఆమూకతో మాట్లాడుచు వారికి ఇష్టమైన పాటలు పాడుచు వారికి కులాసా కల్పించుచుండెను. నేను ఠానాచేరినట్లు తెలియగానే అప్పుడు కార్యోన్ముఖుడై ఆయన ఇట్లు అడిగెను.

"మీ కేమి కావలెను?"

"మాకు గాంధి కావలెను."

"వానితో యేమి చేసెదరు?"

"వానిని తగులపెట్టెదము."

"ఆయన మీ కేమి అపకారము చేసెను?"

"ఆయన ఇండియాలో మమ్మును దూషించెను. నేటాలును భారతీయులతో ముంచివేయ జూచుచున్నాడు."

"ఆయన బయటికి రానియెడల యేమి జేతురు?"

"అప్పుడు ఈ యిల్లును తగులపెట్టెదము"

"ఆయన భార్య పిల్లలుకూడ నక్కడ నున్నారు. వారు గాక యితర స్త్రీపురుషులు గలరు. స్త్రీలను పిల్లలను తగులబెట్టుటకు మీరు సిగ్గుపడరా?"

"దాని జబాబుదారి నీది. మనుష్యులను నీవు నిస్సహాయులుగా చేసినపుడు మేము యేమిచేయగలము. ఇతరుల కెవ్వరికిని ఆపద కల్పించుటకు మేము కోరుట లేదు. నీవు గాంధిని మాకు స్వాధీనపఱ్చిన చాలును. ఆనేరస్థుని నీవు మాకు వశపరచనియెడల వానిని పట్టుకొనుటకు మేము చేసెడి ప్రయత్నములో ఇతరులకు ఆపదకలిగినచో మహాత్ము నిందించుట మీకు న్యాయముగా తోచుచున్నదా?"

అంతట ఆ యుద్యోగస్థుడు మెల్లగా నవ్వి నేను రస్తుంజీ ఇల్లు వదలి వారి మధ్యగుండనే వెళ్లి అంతకుముందే ఇంకొక ప్రదేశము చేరితినని ఆమూకతో చెప్పెను. ఆ గుంపు బిగ్గరగా నవ్వి "అది అబద్ధము అది అబద్ధము" అని కేకలు వేసిరి.

పోలీసు పైఅధికారి ఇట్లు చెప్పెను. "మీరు పోలీసు పైఅధికారిని నమ్మని యెడల, మీలో ముగ్గురునో నలుగురునో ఒక ఉపసంఘము నేర్పరుచుకొనుడు, తక్కినవారు యింట్లో ప్రవేశించమని వాగ్దత్తము చేయుడు. మీ ఉపసంఘమువారు యీ యింటిలో గాంధి లేడని తెల్పినపిమ్మట మీరందరు మీ మీ యిండ్లకు శాంతముగా పోవుదుమని వాగ్దత్తము చేయుడు. నేడు మీరు ఉద్రేకులై యున్నారు. మీ పోలీసువారి మాట వినలేదు. అది మీ పోలీసుకు గాక

మీకే అవమానము. అందుచేత మీ పోలీసు మిమ్ములను మాయ చేయవలసివచ్చెను. మీరు వేటాడదలచిన జీవము మీమధ్య నుండి తొలగించినారు. మీ వేట ఆగిపోయినది. ఇందుకు నిజముగా మీరు పోలీసువారిని నిందించుటకు వీలులేదు. మీచే నియమింపబడిన పోలీసు తమ కర్తవ్యమును వారు నిర్వహించిరి.

ఇంత స్థిరబుద్ధితోను సరసముగాను ఆయన వారితో భాషించెను. కాన ఆయన కోరినవాగ్దత్తమును వారు చేసిరి. ఉపసంఘము నేర్పరచిరి. ఆయుపసంఘము రుస్తుంజీ ఇల్లు ఆమూలాగ్రముగా వెదకిరి. పైఅధికారి నిజముచెప్పెననియు, యీ ఆటలో తమను ఓడించిరనియు, ఆమూకకు తెలిపిరి. మూక నిరాశ చెందెను. కాని తమ మాటప్రకారము వేరే అల్లరిచేయక చెదిరిపోయిరి. ఇది ౧౩—౧—౯౭ న జరిగెను.

ఓడలమీద నిర్బంధము తొలగించిన యుదయముననే దర్బాను వార్తాపత్రిక యొక్క విలేఖరియొకడు నన్ను ఓడలో చూచెను. అన్నిసంగతులు అడిగెను. నామీద చేయబడిన ఆరోపణలన్నిటిని అబద్ధములని ఆయనకు తృప్తికరముగా నిరూపించితిని. ఏమాత్రము అతిశయోక్తి నేను చెప్పలేదని వివరముగా కనుపరచితిని. నేనుచేసినది నావిధ్యుక్తము మాత్రమే. అట్లు నిర్వహించనియెడల నేను మానవుడనను పేరుకు అనర్హుడనగుదును. ఇదియంతయును మరునాడు పత్రికలలో ప్రకటించబడెను. యూరపియనులలో బుద్ధిమంతులు

తమ తప్పిదమును యొప్పుకొనిరి. నేటాలులోని యూరపియులను దృక్పథముతో వార్తాపత్రికలు సానుభూతిని చూపెను. కాని నేనుచేసిన పనిని పూర్తిగా సమర్థించెను. దీనివలన నాకీర్తియు, భారతీయబృందముయొక్క ప్రతిష్ఠయు పెరిగెను. భారతీయులు బీదవారైనను, పిరికివారుకారనియు, నష్టములను లెక్కసేయక భారతవర్తకులు తమ ఆత్మగౌరవముకొరకును తమ దేశమునిమిత్తమును, పోట్లాడుటకు సంసిద్ధులుగా నున్నారనియు దీనివల్ల ఋజువయ్యెను.

ఈవిధముగా భారతీయబృందము కష్టములుపడినను, దాదాఅబ్దుల్లా సంఘమువారు పెక్కునష్టములను పొందినను, పర్యవసానము శ్రేయోదాయకమయ్యెను అని నానమ్మకము. తమబలమును అంచనావేసుకొనుటకు భారతీయబృందమునకు తగు అవకాశముదొరకెను. వారి ఆత్మవిశ్వాసము అందుచేత పెరిగెను. నాకు మిక్కిలి విలువగల అనుభవముకలిగెను. ఆరోజునుగూర్చి యెప్పుడు ఆలోచించుకొన్నను, సత్యాగ్రహ సాధనలో దైవము నన్ను తర్ఫీయతు చేయుచుండెనని నేను భావించుచున్నాను.

నేటాలులోని యీసంగతులు ఇంగ్లండులో ప్రతిధ్వనించెను. నామీద దౌర్జన్యముచేసిన దుండగీడులపై ఫిర్యాదు చేయించి నాకు న్యాయము సమకూర్చవలెనని వలసమంత్రియైన చేంబర్లైనుగారు నేటాలు ప్రభుత్వమునకు తంతి నంపెను.

నేటాలు ప్రభుత్వములో న్యాయవాద సర్వాధికారి యైన యస్కోంబు నన్నే పిలిపించెను. చాంబరులైను ఇచ్చిన తంతిసంగతి నాతో చెప్పెను. నాకు గలిగిన గాయములకు తన దుఃఖమును వెలిబుచ్చెను. ఇంతకంటె హెచ్చుగాయములు తగలనందుకు సంతసించెను. మరి ఇట్లు చెప్పెను. "నీవుగాని మీ భారతీయబృందములో యేయొక్కరుగాని కష్టపడవలెనని నాకు యేమాత్రము ఉద్దేశ్యము లేదని నేను గట్టిగా చెప్పగలను. నీకు దెబ్బలు తగులవచ్చునని భయపడినందువలననే, రాత్రి పూట దిగమని నేను నీకు కబురుపంపితిని. నాసలహా నీకు రుచించలేదు. నీవు లాటనుసలహా అంగీకరించినందుకు నిన్ను యేమాత్రము దూషించకోరను. నీకు యుక్తమని తోచిన దానిని చేయుటకు నీకు సర్వస్వాతంత్ర్యము కలదు. చాంబర్ లెనుగారి సందేశమును నేటాలు ప్రభుత్వము పూర్తిగా అంగీకరించుచున్నది. నేరస్థులు శిక్షపొందవలెనని మేము కోరుచున్నాము. నిన్ను కొట్టినవారి నెవరినైనను నీవు గుర్తించ గలవా ?"

ఒక రిద్దరిని నేను గుర్తించవచ్చును కాని ఈసంభాషణ ఇంకను జరుగకముందు నన్ను కొట్టినవారిని యెవరిపైనను పిర్యాదు చేయకుండుటకు నేను యిదివరకె తీర్మానించుకొంటిని అని వెంటనే నేను మీతో చెప్పవలెను. వారిలోపము నాకు కనుపడుటలేదు. వారికి తెలిసిన సమాచారము వారి నాయకులనుండియే గ్రహించితిని. అది సరియగునా కాదా యని

వారే చర్చించి తీర్మానించుకొనవలెనని మనము ఊహించ రాదు. వారు నన్ను గూర్చి విన్నదంతయు నిజమైన యెడల వారు ఉద్రేకులగుటయు ఆకోపోద్రేకములో యేతప్పో చేయు టయు, వారికి సహజము. దానికై వారిని దూషించను. ఉద్రేకముతో నున్న మూకలు అట్లే "న్యాయము" చేయుటకు ప్రయత్నించుచుందురు. దానికై యెవరినైన దూషించవలసిన యెడల ఆ యూరపియను సంఘమును, నిన్నును, కాన నేటాలు ప్రభుత్వమును దూషించవలెను. రూటర్, అపభ్రంశము నేదైనను తంతి పంపియుండవచ్చును. కాని నేను నేటాలు వచ్చుచున్నట్లు మీకు తెలిసినప్పుడు ఇండియాలో నేజేసిన పనులను గురించి మీకు కలిగిన సందేహము విషయమై నన్ను ప్రశ్నించుటకును నేను చెప్పునది వినుటకును, అటుపిమ్మట యుక్తమని తోచినదానిని చేయుటకును, నీయొక్కయు, ఆయుపసంఘముయొక్కయు కర్తవ్యమై యుండెను. ఇప్పుడు నీపైనగాని ఆయుపసంఘముపైనగాని నేను ఫిర్యాదుచేయు వీలుగాదు. అట్లు వీలైనను న్యాయస్థానములో పరిహారమునకై నేను ప్రయత్నించను. నేటాలులోని యూరపియనుల ప్రయోజనములను సంరక్షించుటకు యోగ్యమైన చర్యలను నీవు తీసుకొంటివి. అది రాజకీయవిషయము. రాజకీయరంగముననే నేను నీతో పోట్లాడెదను. బ్రిటిషు సామ్రాజ్యములోని జనాభాలో హెచ్చుదామాషాగానున్న భారతీయులు తమ ఆత్మ గౌరవమును నిలుపుకొనుటకును, యూరపియనుల కేమాత్ర

మును నష్టము కలిగించకుండ తమహక్కులను సంరక్షించు కొనుటకును కోరుచున్నారని నీకును ఇతర యూరపియనులకును నేను నచ్చజెప్పెదను. ఇదియే నాకు నిల్చియున్న కర్తవ్యము" అని నేను చెప్పితిని.

యస్కోంబు ఇట్లు జవాబు చెప్పెను. "నీవు చెప్పినది నాకు బాగా అర్థమగుచున్నది. నీభావము మంచిదని గ్రహించగలుగుచున్నాను. నిన్ను కొట్టినవారిపై ఫిర్యాదు జరుపుటకు నీ విష్టపడవని వినుటకు నేను తయారు అయియుండ లేదు. నీవు వారిపై ఫిర్యాదు జరిపినను నాకు యేమాత్రమును చింతగలుగదు. కాని ఫిర్యాదుచేయునని తీర్మానించుకొని చెప్పినపుడు, ఈవిషయములో నీవు సరియైన తీర్మానమునకే వచ్చితివి అనియేగాక, నీనిగ్రహమువలన మీ భారతీయ బృందమునకు మరింత సేవచేయుచున్నావనిగూడ చెప్ప సంకో చింపను. వీరిపై ఫిర్యాదుచేయ నిరాకరించుటచేత, మిక్కిలి చిక్కుస్థితిలో నుండి నేటాలుప్రభుత్వమును కాపాడితి నని నే నొప్పుకొందును. నీవు కోరినయెడల నీపైబడిన దుండగీములను ప్రభుత్వము పట్టించియిచ్చును. కాని దానివలన యూరపియను లకు మరింతకోపము గలిగి, యేప్రభుత్వమును ఇష్టపడనంత అన్నిరకముల విమర్శనలకును కారణమగునని, నీతో చెప్ప నక్కరయేలేదు. ఫిర్యాదు చేయుకుండుటకై చివరతీర్మానమును నీవు చేసుకొన్నయెడల, అట్టి నీయుద్దేశ్యమును తెలుపుచు, నీవు నాకొకకాగితము నిమ్ము. మన సంభాషణ సంగ్రహమును

చాంబర్‌లైనుగారికి పంపుటవల్లనే, మా ప్రభుత్వమును నేను సమర్థించజాలను. నీవు యిచ్చిన కాగితము యొక్క సంగ్రహమును వారికి పంపవలెను. కాని యిప్పుడే ఆకాగితము నిమ్మని కోరను. నీ స్నేహితులతో సంప్రతించుము. లాప్టనును గూడ సంప్రతింపుము. ఆసంప్రతింపులైన పిమ్మట, ఫిర్యాదు చేయరాదను తీర్మానము స్థిరపరుచుకొనిన యెడల, నాకు వ్రాయుము. కాని నీవు నీస్వంత బాధ్యతమీద నీముద్దాయిలపై ఫిర్యాదుచేయ నిరాకరించితివని నీవుత్తరములో స్పష్టముగా నుండవలెను."

నేను ఇట్లుచెప్పితిని. "ఇందునిమిత్తము నాకు నీవు కబురుపంపినట్లు తెలియదు. నేను ఇదివరకు యెవరితోను దీనినిగూర్చి సంప్రదించలేదు. ఇప్పుడును సంప్రదించకోరను. నేను లాప్టనుతోగూడ నడచిపోదము అని తీర్మానించుకొనినపుడే, నాకు ఏ అపాయముజరిగినను, దానికై చింతిల్లరాదని, అప్పుడే నామనస్సులో నిశ్చయించుకొంటిని. కాన ముద్దాయిలపై ఫిర్యాదు జరుపుట, నేను విచారించదగిన పనియేకాదు. ఇది నాకొక మతసమస్య. ఇట్టి నిగ్రహము వలన, నాకును నా భారతీయబృందమునకును మేలొనగూడునని నీవు చెప్పినమాటను, నేను నమ్ముచున్నాను. కాన యావత్తుబాధ్యతను నేనే భరించెదను. నీవుకోరిన లేఖను ఇప్పుడే ఇక్కడనే యిత్తును." అంతట వానివద్ద తెల్లకాగితము తీసుకొని కావలసినమాటలు వ్రాసి దానిని వానికిచ్చితిని.

---

## 8 వ అధ్యాయము

## మొదటిపోరాట వివరములు, ముగింపు - ఇంగ్లండులోనిపని

భారతీయులు తమస్థితులను బాగుచేసుకొనుటకు యెట్లు ప్రయత్నించినదియు, వారి ప్రతిష్ఠను యెట్లు పెంపుచేసుకొనినదియు, గత అధ్యాయములలో పాఠకుడు గ్రహించియుండెను. భారతీయబృందము అంతరంగికబలమును అభివృద్ధి చేసుకొను యత్నముతోపాటు, ఇండియానుండియు, ఇంగ్లాండు నుండియు పొందదగిన సహాయమునకై కృషిచేయుచుండిరి. ఇండియాలోని కార్యములను కొంతవరకు తెలిపియుంటిని. ఇంగ్లండులో సహాయముపొందుటకు చేసినచర్యలను ఇప్పుడు తెలుపవలెను. భారత దేశీయ మహాసభయొక్క బ్రిటిషు ఉపసంఘముతో సంబంధముల నేర్పరుచుకొనుట మొట్టమొదట అవసరమయ్యెను. కాన భారతపితామహుడగు దాదాభాయికిని, ఆ యుపసంఘఅధ్యక్షుడగు. సర్. విలియం వెడ్డర్ బరనుకును, పూర్తివివరములతో ప్రతివారము యుత్తరములు వ్రాయుచుంటిమి. సాహాజరునకల్లు పంప తటస్థించినపుడెల్ల యుపసంఘమువారు సామాన్యఖర్చులకును, తపాలఖర్చులకును విరాళముగా పదిపౌనులకు తగ్గని మొత్తము పంపబడుచుండెను.

దాదాభాయినిగూర్చి పవిత్రమై స్మరించదగిన అంశమును ఇచ్చట చెప్పవలెను. ఈ ఉపసంఘఅధ్యక్షుడు ఆయనకాదు. అయినను మొట్టమొదట ఆయనకు పైకము పంపుటయు,

ఆ ఉపసంఘ అధ్యక్షునకు ఆయన మాతరఫున ఇచ్చుటయు, యుక్తమని మాకు తోచెను. కాని మొదటి మొత్తమునే దాదాభాయి తిరిగి మాకుపంపెను. ఆఉపసంఘమునకు సంబంధించినంతవరకు ఉత్తరములును, ధనమును, సరాసరి వెడ్డర్ బరన్‌గారికే పంపవలసి మాకు ఆయన సలహాచెప్పెను. తన వంతుకు తాను శక్తికొలది సహాయము తప్పక చేతుననెను. వెడ్డరుబరన్‌గారిద్వారా ఆ ఉపసంఘమును మేము సమీపించిన యెడల దానిప్రతిష్ఠ పెరుగును. దాదాభాయి మిక్కిలి వృద్ధుడైనను, ఉత్తరప్రత్యుత్తరములను సక్రమముగా జరుపుచుండెను. ప్రత్యేకముగా వ్రాయవలసినది లేకున్ననూ, మా ఉత్తరము చేరినదని తెలుపుటకైనను వ్రాయుచుండును. అందులో ప్రోత్సాహకరమైన వాక్యమును జొప్పించును. ఇట్టి ఉత్తరములు కూడా తాను స్వయముగా వ్రాయుచుండును. వానికి గూడ నకళ్లుపుస్తకములో నకళ్లు ఉంచుకొనుచుండెను.

మాసంస్థ మహాసభ అని పిలువబడినను, మాయిబ్బందులను యేకపక్షకు ప్రత్యేకించిన సమస్యగా చేయదలచలేదని వెనుక ఒక అధ్యాయములో చూపించియున్నాను. కాన దాదాభాయిగారి పూర్తియైన యెరుకతోనే, ఇతరకక్షలకు చెందిన పెద్దమనుష్యులతో కూడ, యుత్తర ప్రత్యుత్తరములు జరుపుచుంటిమి. వీరిలో ముఖ్యులు భవనగిరి, హంటరు. భవనగిరి అప్పుడు పార్లమెంటు సభ్యుడు. ఆయన సహాయముమిక్కిలి ఉపయోగకారిగానుండెను. ఎప్పుడును ముఖ్యమైన సలహాల

నిచ్చుచుండెడివాడు. భారతీయులకంటె ముందుగానే, దక్షి ణాఫ్రికాలోని భారతీయుల సమస్యయొక్క ప్రాముఖ్యతను గుర్తించి, దానికి హెచ్చుసహాయము చేసినవాడు ఏ ఒక్కడై నను యున్నయెడల, అట్టివాడు హంటర్. టైమ్సుపత్రికలో భారతశాఖకు ఆయన సంపాదకుడుగానుండెను. ఆయన పేర మేము మొదటి ఉత్తరము వ్రాసినదిమొదలు, యీసమస్యను చక్కగా గ్రహించి సరియైన స్థాయిలో దానిని ఆపత్రికలో చర్చించుచుండెడివాడు. ఈఉద్యమమునకు సహాయము చేయ మని, అనేకమంది పెద్దమనుష్యులకు, ఆయన ఉత్తరములు వ్రాయుచుండెను. ముఖ్యమైన విషయములు చర్చలోనున్న ప్పుడు, షుమారు ప్రతివారమును ఆయన మాకు జాబువ్రాయు చుండెను. ఆయనవ్రాసిన మొదటి యుత్తరముయొక్క సారాంశమిది. “అచ్చటి పరిస్థితులు చదువ దుఃఖముకలిగెను. మర్యాదగాను, శాంతముగాను, అతిశయోక్తి లేకుండగాను, మీపోరాటమును మీరు జరుపుచున్నారు. ఇందు విషయమై నా సానుభూతి పూర్తిగా మీకుగలదు. మీకు న్యాయము జరుగుటకై బహిరంగముగాను రహస్యముగాను నాశక్తికొలది పాటుపడెదను. ఇందులో ఒక అంగుళమైనను లొంగరాదు, అని నానిశ్చయము. మీకోరికలు యెంతి సహేతుకములనగా దాని తగ్గించుమని యే నిష్పక్షపాతబుద్ధిగలవాడును మీకు చెప్పజాలడు.” ఇందునుగురించి ఆయన టైమ్సులో వ్రాసిన మొదటి వ్యాసములో యీలేఖలోని ప్రతిమాటను చేర్చెను.

ఆయన భావము బాగున అట్లేయుండెను. ఈయన చనిపోవక పూర్వము, యీ భారత సమస్యమీాద వ్యాసపరంపర వ్రాయుటకు సంగ్రహము కుదుర్చుకొనెనని ఒక ఉత్తరములో ఆయన భార్య మాకు వ్రాసెను.

గత అధ్యాయములో మన్‌సుర్‌లాల్‌నాజరు పేరు ఉదహరించితిని. భారతీయ బృందముతరఫున పరిస్థితులను వివరముగా తెలుపుటకై, ఇతనిని రాయబారిగా ఇంగ్లండుకు పంపిరి. అన్నికక్షులతో చేరి పనిచేయుమని ఇతనికి సూచించిరి. ఇతను ఇంగ్లండులో నుండగా, భా. దే. మ. స. ఉపసంఘముతోను, భావనగిరి హంటరుగార్లతోను, సంప్రదించుచుండెను. ఉపకారవేతనము పొందిన ఐ. సి. యస్. ఉద్యోగస్థులను, ఇండియామంత్రి వలసమంత్రి కార్యస్థానములను, ఈయన కలుసుకొనుచుండెను. ఇట్లు సాధ్యమైనన్నిచోట్ల మా ప్రయత్నము సాగుచుండెను. దీనికంతకును ప్రస్ఫుటమైన ఫలితమేమనగా ఇతరదేశములలోనున్న భారతీయ సమస్య ప్రధానప్రాముఖ్యముగల సమస్యగా సామ్రాజ్య ప్రభుత్వమువారి దృష్టికి కనుబడెను. ఇతర వలసరాజ్యములలో దీనివలన మంచి చెడుగులు రెండును కలిగెను. అనగా భారతీయులు నివాసము లేర్పరుచుకొన్న ప్రతివలసలోను వారు తమ స్థితియొక్క ప్రాముఖ్యమును గ్రహించిరి. అచ్చటనుండు యూరోపియనులు తమ ఆధిక్యతకు ఈభారతీయులవలన ఆపద రావచ్చునని యూహించి తామూహించుకొన్న ఆపదనుగూర్చి మేల్కొనిరి.



# 9 వ అధ్యాయము

## బోయరు యుద్ధము

బోయరు యుద్ధము ప్రారంభమందు దక్షిణాఫ్రికాలో నున్న భారతీయుల స్థితి యేమియో, దానిని చక్కజేయుటకు వారు యేయేచర్యలు తీసుకొనిరో, వెనుకటి అధ్యాయములలో పాఠకుడు చూచియున్నాడు.

బంగారుగనుల యజమానులతో చేసిన కుట్ర ననుసరించి జోహానెస్‌బర్గుపై ౧౮౯౫ సంవత్సరములో డాక్టరు జేమ్సన్, తనదాడిని సాగించెను. జోహానిస్‌బర్గును తాము స్వాధీనపర్చుకొన్న పిమ్మటనే ఈసంగతి బోయరుప్రభుత్వమునకు తెలియవచ్చునని కుట్రదారులు అనుకొనిరి. కాని జేమ్సనును, ఆయనతోడివారును, యీ అంచనాలో మిక్కిలి పొరబడిరి. వారు ఇంకొకభ్రమపడిరి. తమ పన్నుగడ తెలియవచ్చినను, యుద్ధవిద్యలో సాధనపొందని బోయరు వ్యవసాయదారులు రోడేషియాలో తయారు అయిన నేర్పరుల యెదుట నిలువజాలరు అని వారు ఊహించిరి. మరియు జోహానిస్‌బర్గులోని అధికప్రజలు తమను బహిరంగముగా సన్మానింతురని ఈదండయాత్రికులు దలంచిరి. ఇందులో గూడ ఆ పెద్దమనిషి పొరబడెను. ముందుగనే పూర్తిసమాచారము క్రూగరు అధ్యక్షునకు చేరెను. అధికమైన ఆలోచనతో, నేర్పుతో, రహస్యముతో, జేమ్సనును యెదిరించుటకును,

అదేసమయమున వీనితోడి కుట్రదారులను పట్టుకొనుటకును, క్రూగరు యేర్పాట్లు చేసియుండెను. కాన జోహానిస్‌బర్గుకు చాలదూరముగ నుండగనే బోయర్లు తుపాకిమంటలతో జేమ్సనుగారిని సమాదరణజేసిరి. వారికి యెదురుపడిన సేనతో యుద్ధముచేయుటకు, డాక్టరుగారికి శక్యముగాకపోయెను. జోహానిస్‌బర్గులో తిరుగుబాటు ఆపించుటకు అట్లే పూర్తి యేర్పాట్లు చేయబడెను. ఎవరును తల యెత్తలేకపోయిరి. క్రూగరు యొక్క యీ చర్యవలన జోహానిస్‌బర్గులోని కోటీశ్వరులు మూగవారైరి. ఈయనచేసిన శ్రేష్ఠమైన యేర్పాట్లకు ఫలితముగా ధన ప్రాణముల రెంటిలోను అత్యంత స్వల్పనష్టముతో ఈ గండయాత్ర పరిష్కరింపబడెను.

జేమ్సనును, బంగారుగనుల ఖామందులగు యీయన స్నేహితులును, పట్టుకొనబడి ఆలస్యము లేకుండగనే, విచారించబడిరి. కొందరికి ఉరిశిక్ష వేయబడెను. నేరస్థులలో హెచ్చుమంది కోటీశ్వరులు. వారు పట్టపగలు దాడిచేసి నేరస్థులు అయినందున, సామ్రాజ్యప్రభుత్వము వీరికి సాయము చేయలేకపోయెను. ఒక్కమాటుగా క్రూగరు ప్రముఖుడయ్యెను. వలసమంత్రియైన చాంబరులైను క్రూగరువద్దకు వినయవిధేయలతో తంతినంపెను. శిక్షింపబడిన కోటీశ్వరుల తరఫున వారిమీద తన దాక్షిణ్యబుద్ధిని ప్రసరింపచేయవలయునని వేడుకొనెను. ఈ ఆటలో క్రూగరు ఆరితేరిన చతురుడు. దక్షిణాఫ్రికాలోనున్న యేప్రభుత్వమును తన స్వాతంత్ర్యమునకు అడ్డు

వచ్చుననుభీతి ఆయనకు లేదు. ఈ జేమ్సను ఇతనిస్నేహితులు చేసినకుట్ర వారిదృష్టిలో యెంతనిపుణతతో యేర్పరచబడినను, అది శుద్ధబుద్ధిహీనతగా క్రూగరుకు కనుపడెను. కాన ఆయన చాంబరులైనిగారి యొక్క నమ్రమైన కోరికను అంగీకరించెను. శిక్షితుల నెవరిపై ఉరిదండన అమలు జరుపకపోవుటయేగాక, అందరిని పూర్తిగా క్షమించి విడుదలచేసెను.

కాని చాలాకాలము పరిస్థితులు ఇట్లుండజాలవు. ఈజేమ్సను దండయాత్ర మహావ్యాధిలో ఒకచిన్న చిహ్నమని క్రూగరుకు తెలియును. జోహానిస్‌బర్గు కోటీశ్వరులు తమకు గలిగిన అవమానమును తొలగించుకొనుటకు శక్తికొలది పాటు బడక ఊరకుందురనుట దురూహ్యము. మరియు యెందు కొరకై యీజేమ్సను దండయాత్ర పన్నబడెనో, ఆసంస్కరణ ములు సాగించుటకు ప్రయత్నమే జరుగలేదు. కాన కోటీశ్వ రులు నోరుమూసుకొని కూర్చొనజాలకపోయిరి. దక్షిణాఫ్రి కాలో బ్రిటిషు ప్రతినిధియైన మిల్నరు ప్రభువుకు వీరికోరికల యెడ నిండుసానుభూతియుండెను. క్రూగరు చూపిన ఔదార్య మునకు మెచ్చుకొనుచు, చేంబరులైనకూడ సంస్కరణల ఆవశ్యకతను క్రూగరుకు సూచించెను. కత్తిపట్టక తప్పదని ప్రతివాదును నమ్మిరి. ఊట్లెండర్లు (ట్రాన్సువాలులోనున్న బ్రిటిష్ ప్రజలు) కోరికలు, ట్రాన్సువాలులోని బోయరు ప్రభు త్వమును చిట్టచివరకు అంతముచేయుటకే, తగియుండెను. చిట్టచివరకు యుద్ధము తప్పదని ఉభయకక్షులకును తెలియును.

కాన యుభయులును దానికై తయారు అగుచుండిరి. ఈయుభయులమధ్య పెరిగిన వాగ్వాదము గమనించుటకు యోగ్యమై యుండెను. క్రూగరు ఆయుధములకు మందుగుండు సామాగ్రికిని ఉత్తరువు పంపినప్పుడు, బ్రిటిష్‌వారు స్వసంరక్షణకై దక్షిణాఫ్రికాకు సేనలను తేవలసివచ్చునని వారి ప్రతినిధి క్రూగరును హెచ్చరించెను. బ్రిటిష్ సేనలు దక్షిణాఫ్రికాలో దిగినప్పుడు, క్రూగరు వారిని యెత్తిపొడిచెను. తమ యుద్ధ ప్రయత్నములను సాగించుచుండెను. ఇట్లు ఒకరు రెండవవారిని ఆక్షేపించుచు తమ తమ ప్రయత్నములను మాత్రము కొనసాగించుచుండిరి.

తనప్రయత్నములను పూర్తిచేసిన పిమ్మట ఇంకను ఆలస్యము చేసినయెడల శత్రువులకు అదను దొరకునని క్రూగరు కనిపెట్టెను. బ్రిటిషువారికి యెన్నటికినీ తరుగని ధనమును జనమును కలదు. కాన మెల్లమెల్లగా యుద్ధమునకు తయారు అగుచు మధ్యమధ్య ఊట్లెండర్ల యిబ్బందుల నివారించమని కోరుచు అట్లు కాలయాపనచేయుచు, అట్టి నివారణము ఆయన చేయనందున తమకు యుద్ధము తప్పక వచ్చినదని ప్రపంచమునకు బ్రిటిషువారు ప్రకటించుదురు. అప్పుడు బోయర్లు ఆఘాటికి తాళజాలక, బ్రిటిషువారి కోరికలను వినయభావముతో అంగీకరించవలసినంత పెద్ద యేర్పాట్లతో బ్రిటిషువారు యుద్ధములో ప్రవేశింతురు. ౧౬ మొదలు ౬౦ ఏండ్లలోపల నుండు ప్రతిబోయరు పురుషుడును యుద్ధ

విశారదుడే. అవసరమై వారికి బుద్ధిపుట్టినయెడల వారి స్త్రీలును యుద్ధము చేయగలరు. వారి మనస్సులలో జాతీయస్వాతంత్ర్యమన్న ఒక మహాసిద్ధాంతమునకున్న బలముకలదు. ప్రపంచసామ్రాజ్యమునుండికూడ అవమానము పొందుటకు అట్టి ధైర్యముగల జాతి అంగీకరింపదు.

లోగడనే క్రూగరు ఆరంజిఫ్రీస్టేటుతో సమాధానము కుదుర్చుకొనెను. ఈబోయరు ప్రజాస్వామిక ప్రభుత్వములు రెండును, ఒకే కార్యవిధానము ననుసరించెను. బ్రిటిషువారి కోరికలను పూర్తిగాగాని, ఊట్లెండర్లను తృప్తిపరచునంతవరకైననుగాని, అంగీకరించవలెనను ఉద్దేశ్యము క్రూగరుకు యెంతమాత్రమునులేదు. కాన యుద్ధము తప్పనిసరి గనుక బ్రిటిషువారికి మరింత వ్యవధినిచ్చుట వారి ప్రయత్నములకు అవకాశమిచ్చుటయే యగును అని యీబోయరు ప్రభుత్వములు తలచెను. అంతట మిల్నరుకు క్రూగరు అంత్యసందేశము పంపెను. అప్పుడే ఆఉభయరాజ్యములును తమ సరిహద్దులవద్దకు సేనలను నడిపించిరి. దీని ఫలితము అనుకొనినట్లె జరిగెను. ప్రపంచసామ్రాజ్యముగల బ్రిటిషువారు ఇట్టి బెదరింపుకు లొంగజాలరు. అంత్యసందేశములోని గడువు దాటిపోయెను. మెరుపుతీగె వేగముతో వచ్చెడి బోయర్లు లేడిస్మిత్తు, కింబర్లె, మేఫకింగ్ పట్టణమును ముట్టడించిరి. ఈమహాయుద్ధము ౧౮౯౯ లో యిట్లు ప్రారంభమయ్యెను. భారతీయులయెడ బోయర్లు ప్రవర్తించిన విధానము యుద్ధకారణ

ములలో నొక్కటిగా బ్రిటిషువారిచేత చెప్పబడెనని పాఠకుడు జ్ఞాపకము యుంచుకొని యుండును.

దక్షిణాఫ్రికాలోని భారతీలు ఈసందర్భమున యెట్లు ప్రవర్తించవలెనను పెద్దప్రశ్న వారు పరిష్కరింపవలసివచ్చెను. బోయర్లులో మొగవారందరు సేనలో చేరిరి. లాయర్లు తమ వృత్తిని మానిరి. వ్యవసాయదార్లు తమ వ్యవసాయమును, వర్తకులు తమ వర్తకమును, సేవకులు తమ సేవను వదలిరి. దక్షిణాఫ్రికాలోని బ్రిటిషువారు బోయర్లవలె ఈదామాషాను సేనలో చేరలేదు. అయినను కేపుకాలనీ, నేటాలు, రొడేషియాలోని సామాన్యపౌరులు అనేకులు ఐచ్ఛికులుగా చేరిరి. అనేకులు ప్రసిద్ధులైన వర్తకులును, న్యాయవాదులును అగు ఇంగ్లీషుప్రజలు వీరి ననుసరించిరి. నేను పనిచేయుచున్న న్యాయస్థానములో యిప్పుడు బహుకొద్దిమంది న్యాయవాదులే కనుబడిరి. న్యాయవాదప్రముఖులు చాలమంది యుద్ధకార్యములలో ప్రవేశించిరి. ధనసంపాదనకు మాత్రమే భారతీయులు దక్షిణాఫ్రికా పోయిరనియు అచ్చటనున్న బ్రిటిషువారికి వీరు తలబరువు మాత్రమేననియు భారతీయులమీాద ఒకనింద ఆరోపించబడెను. కొయ్యలో ప్రవేశించి దానిని బారున తొర్ర చేసెడి పురుగులవలె భారతీయులు దక్షిణాఫ్రికాలో ప్రవేశించి బలిసిపోవుచున్నారు. కాని దేశముమీాద దాడివచ్చినను, వారియిండ్లకు ఆపదగలిగినను భారతీయులు రవంతయైనను సాయము చేయరు. అట్టిస్థితిలో బ్రిటిషువారు శత్రు

వులనుండి తమ్ముఁతాము కాపాడుకొనుటయే గాక ఈభార తీయులనుకూడ రక్షించివలసి యుండెను. భారతీయులమగు మేము యీఆరోపణను జాగ్రతగా విచారించితిమి. ఇది నిరాధారమని ఋజువు చేయుటకు మాకు బంగారమువంటి అవకాశము దొరకినదని మేము భావించితిమి. కాని ఇంకొకవైపున కొందరు ఈహేతువులను చెప్పిరి.

"బోయర్లతో సమానముగా బ్రిటిషువారు కూడ మనలను నిర్బంధించుచున్నారు. ట్రాన్సువాలులో కష్టములకు మనము లొంగవలసినయెడల, నేటాలులోగాని కేపుకాలనీలోగాని అంతకంటె మంచిస్థితిలో లేము. తేడాయున్నను అది కొలతలో కొంచెము మాత్రమే. మరియు, ఇంచుమించుగా మనము బానిసల బృందమైయున్నాము. బోయర్లవంటి ఒక చిన్నజాతి, తన ప్రాణము నిలుపుకొనుటకై పోరాడుచున్నదని యెరిగియుండియు, వారి నాశనమునకు మనమేల సహాయభూతులము కావలెను. కార్యసాధనను పట్టి చూచినను, చిట్టచివరకు బోయర్లె యోడుదురని యెవరును జ్యోతిషము చెప్పజాలరు; వారేగెల్చినయెడల మనమీద కసిదీర్చుకొనక తప్పరు."

ఈవాదమును బలపరిచినవారు మాలో ఒక పెద్దముఠా గలదు. అదినాకు అర్థమయ్యెను. దానికితగిన గౌరవమును ఇచ్చితిని. అయినను అదినాకు నచ్చలేదు. ఈక్రిందివిధముగా నాకును, భారతీయబృందమునకును సమాధానముచెప్పి దానిని నిరసించితిని.

"దక్షిణాఫ్రికాలో బ్రిటిషు పౌరులుగా మాత్రమే మనము నిలిచియున్నాము. ఇదివరకు మనము పంపిన ప్రతి మహాజరులోను, బ్రిటిషుపౌరులుగానే మనహక్కులకై వాదించితిమి. బ్రిటిషుప్రభుత్వమును గూర్చి మనము గర్వపడితిమి; లేదా అట్లు గర్వపడుచున్నట్లు ప్రభువులకును ప్రపంచమునకును ప్రకటించితిమి. మనము బ్రిటిషుపౌరులము గనుకనే మనహక్కులను రక్షించుచున్నామని మన ప్రభువులు చెప్పుచుందురు. మనకు యేకొద్దిహక్కులు ఇప్పటికియున్నను బ్రిటిషు పౌరుల మగుటచేతనే అవి మనకు నిలిచియున్నవి. వారు మనలను ఇచ్చట నిరాదరణ చేయుచున్నారన్న కారణముచేతనే, వారికిని మనకును తలపైన ఆపద తాండవమాడుచున్నపుడు, చేతులు ముడుచుకొని చూచుచుండుట, మన జాతి గౌరవమునకు తగినపనికాదు. ఇట్టి నింద్యమైన తాటస్థ్యము మన చిక్కులను పెంచుటకే ఉపయోగపడును. మనమీాద చేసిన ఆరోపణ అబద్ధమని ఋజువుచేయుటకు, కోరకుండ లభించిన యీా అవకాశమును, మనము జారవిడిచినయెడల, మనము మనవల్లనే నిరసింపబడినవార మగుదుము. అప్పుడు ఇంగ్లీషువారు పూర్వముకంటె, మనలను హీనముగా జూచినను, మునుపటికంటె హెచ్చుగా వెక్కిరించినను, మనము ఆశ్చర్యపడనక్కరలేదు. ఆలోపము పూర్తిగా మనదే యగును. మనమీాదచేసిన ఆరోపణలు నిర్హేతుకములనియు, యేమాత్రము నిలువజాలవనియు, అప్పుడు చెప్పుట ఆత్మవంచనయే

యగును. సామ్రాజ్యములో మనము బానిసలన్నమాట నిజము. కాని ఇంతవరకు సామ్రాజ్యములోనుండియే మనస్థితి బాగుపరుచుకొన యత్నించితిమి. ఇండియాలో మన నాయకు లందరియొక్కయు కార్యవిధానమదియే. ఇక్కడివారిది అదియే. బ్రిటిషు సామ్రాజ్యములో అంతర్భాగముగా మన స్వాతంత్ర్యమును, యోగక్షేమమును, సంపాదించకోరినయెడల, ఇదియే మంచితరుణము వచ్చినది. మనశక్తికొలది సర్వవిధ ముల యుద్ధములో బ్రిటిషువారికి సహాయముచేసి మనకోరిక లను సంపాదించవచ్చును. బోయర్లదే న్యాయమని హెచ్చుగా ఒప్పుకొనక తప్పదు. ప్రతివిషయములోను ఒకరాజ్యములోని ప్రతిపౌరుడును తనస్వంత అభిప్రాయమునే అమలుపరచకోర రాదు. అధికారులు యెల్లపుడు మంచి చేయకపోవచ్చును. కాని ప్రజలు ఆరాజ్యమునకు పౌరులై యున్నంతవరకు, సామాన్యముగా తామే సర్దుకొని రాజ్యాంగచర్యలకు సహా యముచేయుట వారికి స్పష్టమైన కర్తవ్యము."

"మరియు పౌరులలో యేతరగతివారుగాని, ఆప్రభు త్వముచేయు కార్యము మతరీత్యా అవినీతికరమని యెంచిన యెడల వారు దానికి సాయమో ఆటంకమో చేయకముందు, తమప్రాణముల నర్పించియైనను, పూర్తిగా ప్రయత్నముచేసి, ఆప్రభుత్వము అట్టిదోవను పోకుండ విముఖులను చేయవలెను. మనము ఇట్టిది యేదియు చేసియుండలేదు. అట్టి నైతికక్లిష్ట స్థితి మనకు సంభవించలేదు. అట్టి విశాలవిశ్వసమాదరణీయ

మైన కారణమునకై, మనము యీయుద్ధములో సహాయము చేయక తొలగకోరుచున్నామని యెవరును చెప్పుటలేదు. కాన పౌరులమైన మనసామాన్యకర్తవ్య మేనగా ఈయుద్ధము యొక్క మంచిచెడుగులను ఆలోచించుట కాక, యుద్ధము ప్రారంభము అయినప్పటినుండి మనశక్తికొలది సహాయము చేయుటయే. చిట్టచివరకు బోయర్లు గెలిచినయెడల—బోయరుల విజయముకూడ సాధ్యమైన కార్యమండలిలో చేరియున్నదియే—మన మొదటిస్థితికన్న చివరస్థితి మరింత హీనమగుననియు బోయర్లు మనమీద భయంకరముగా కసి దీర్చుకుందురనియు, సూచించుట, ఈపౌరుషవంతులైన బోయర్లకును, మనకును అన్యాయము నారోపించుటయే యగును. అట్టి సాధ్యతను గురించి లవలేశము ఆలోచననైనను వృథాగా చేయుట, మన పౌరుషహీనతకు చిహ్నముమాత్రమే. మన రాజభక్తికి కళంకము మాత్రమే. ఇంగ్లీషువారు ఓడినయెడల తన కేమగునని ఇంగ్లీషు మనుజుడు ఒకక్షణమైనను యోజించునా, తనపౌరుషమును పోగొట్టుకొనకుండ, యుద్ధములో చేరబోవువా డెవడును ఇట్టి వాదమును చేయజాలడు."

౧౮౯౯ లో ఈహేతువులను దెలిపితిని. నేడైనను వానిని మార్చుటకు దగినకారణము కనుబడుటలేదు. అనగా అప్పుడు బ్రిటిషుసామ్రాజ్యముమీద నాకు ఉన్న నమ్మకము ఇప్పుడు ఉన్నయెడల, ఆసామ్రాజ్యములోనే యుండి మన స్వాతంత్ర్యమును సంపాదించగలమను అప్పుడున్న ఆశ ఇప్పుడు

నాకు నిలచినయెడల, అప్పుడు నేను దక్షిణాఫ్రికాలో చెప్పిన హేతువులనే, నేను ఇండియాలో సహితము అదే సందర్భములలో ప్రతిమాట ఇప్పుడును చెప్పుదును. దక్షిణాఫ్రికాలోను, పిమ్మట ఇంగ్లండులోను, ఈవాదమును నిరసించు ప్రయత్నములను, అనేకము నేనువింటిని. కాని నాఅభిప్రాయము మార్చుకొనుటకు తగినకారణము నాకు కనుపడుట లేదు. నాకు ఇప్పుడున్న అభిప్రాయములు ఈగ్రంథవిషయమునకు సంబంధములేనివే కాని ఇక్కడ నేను వానిని చెప్పుటకు రెండు మంచి హేతువులు కలవు. ౧ ఈపుస్తకమును త్వరపడి చదువు పాఠకుడు దీనికి తగినంత ఓర్పు శ్రద్ధ చూపునని యెంచుటకు నాకు హక్కులేదు. అట్టి పాఠకుడు పైజెప్పిన నాఅభిప్రాయములను, ఇప్పటి నాకార్యక్రమముతో సమన్వయము చేయుటకు కష్టపడును. ౨ పై హేతువులలోని మూలసూత్రము సత్యాగ్రహము. అనగా సత్యముపై పట్టుదల నిలుపుట. ఎవడైనను తాను యదార్థముగా యెట్లున్నాడో అట్లే కనుపడి తదనుకూలముగా ఆచరించుట మతసాధనకు చివరిదిగాక మొదటిమెట్టే యగుచున్నది. ఇట్టి బునాదిలేనిది ఆధ్యాత్మ జీవితము నిర్మించుట దుస్సాధ్యము.

మన కథకు వత్తము.

నా హేతువులు బహుమందికి నచ్చెను. ఇట్టివిచెప్పుటకు నేనొక్కడనే నని పాఠకుడు తలచరాదు. అంతేగాక యీ అభిప్రాయములు చెప్పకపూర్వమే యుద్ధములో శక్తికొలది

పాల్గొనవలెనని యెంచిన భారతీయులు చాలమందిగలరు. ఇట్టి భయంకరయుద్ధ ఝంఝామారుతము వీచుచుండ భారతీయుల దుర్బలస్వరము వినువారు యెవరు? అను కార్యసాధన సమస్య అప్పుడు తలయెత్తెను. సహాయము చేయుదుమను ఈ వాగ్దానమునకు యెట్టివిలువనిత్తురు? మనలో యుద్ధసాధనము పట్టినవారు లేరు. యుద్ధభటులు కానివారు చేయుపనికైనను కొంతతర్బీయతు కావలసియుండెను. అడుగు తప్పక వేయుచు నడుచుట యైనను మాకు తెలియదు. సామానును భుజముపై పెట్టుకొని దూరప్రయాణములు చేయుట తేలికపని కాదు. మరియు తెల్లవారు మనలనందరిని కూలీలుగా చూచి నిందించి అవమానించవచ్చును. దీనినెల్ల సహించుటెట్లు! మనము ఉచిత సేవకు ఇచ్ఛగించినను మన వాగ్దత్తమును ప్రభుత్వము అంగీకరించినట్లు యెట్లు చేయగలము? చిట్టచివరకు ఈ తీర్మానమునకు వచ్చితిమి. మన వాగ్దత్తము అంగీకరించుటకు శ్రద్ధతో కృషి చేయవలెను; పనియొక్క అనుభవమే హెచ్చుపనిని నేర్పును; మనకు కోరికయున్న యెడల, సేవజేయు శక్తిని దైవ మిచ్చును; మనకు అప్పగించిన పనిని యెట్లు చేయగలమని కలవరపడనక్కరలేదు; శక్తికొలది దానికి తర్బీతు కావలెను; సేవజేయుటకు ఒక్కమారు తీర్మానించుకొన్నందు వలన గౌరవమైన పనియా కాదా యని భేదమును విచారించుట మానవలెను; అవసరమైన యెడల దూషణను గూడ భరించి సేవచేయవలెను.

మా వాగ్దానమును అనుకూలముగా ఆలోచింప జేయు టకు దుర్గమమైన కష్టములు మమ్ము నెదుర్కొనెను. ఆ కథ రుచికరముగా నుండును. గాని దానిని చెప్పుటకు ఇది స్థలము గాదు. గాయపడినవారికి, రోగులకు, ఉపచారము చేయుటలో మాలోని నాయకులు తర్ఫీయతునుపొంది, దేహపటుత్వమును గూర్చి వైద్యులయొద్ద యోగ్యతాపత్రములను పొంది, ప్రభు త్వమునకు సవ్యమైన ఉత్తరము పంపితిమని ఇచ్చట చెప్పిన చాలును. ఈ యుత్తరమును, ప్రభుత్వమువారు అంగీకరించిన యెడల ఏపదవిలో నైనను సేవజేయుటకు మేము జూపిన ఆతురతయును, ప్రభుత్వమువారికి మంచిఅభిప్రాయమును కలి గించెను. వారు తమ జవాబులో మాకు వందనము లర్పించి అప్పటికి మాసేవను నిరాకరించిరి. ఇంతలో పెద్దవరదవలె బోయర్లు ముందుకు రాసాగిరి. వారు దర్బను చేరుదు రని భయముకలిగెను. యెక్కడ పట్టినను చచ్చినవారి ప్రోగులును, గాయపడినవారి కుప్పలును అగుపడెను. మేము మా వాగ్దాన మును వరుసగా తెలియచేయుచుంటిమి. చిట్టచివరకు భారతీ ఉపచారసంఘము యేర్పరుచుటకు మంజూరు చేయబడెను. వైద్యశాలలలో, ఊడ్పుపనినైనను పాకీపనినైనను చేయుటకు మా ఇష్టము తెలిపితిమి. కాన ఈ ఉపచారసంఘ నియామకము మాకు మిక్కిలి సంతోషముగా నుండుటలో ఆశ్చర్యములేదు. స్వతంత్రభారతీయులను కరారు గడచిన భారతీయులను మొట్టమొదట చేర్చుకొనమని కోరితిమి. కరారుభారతీయులను

గూడ మాతో చేరనిచ్చుట వాంఛనీయమని సూచించితిమి. ప్రభుత్వమున కప్పటికి దొరికినంతమంది పురుషులు అవసరమై యున్నందున, వారు కరారుభారతీయుల యజమానులను సమీపించి, వారిమనుష్యులను గూడ ఐచ్ఛికులుగా చేరనిమ్మని కోరిరి. ఇట్లొక ఘనమైన సుశోభితమైన సంఘము షుమారు ౧౧౦౦ మంది భారతీయులు గలది, యుద్ధప్రాంతమునకు చేరుటకై దర్బానునుండి బయలుదేరెను. పాఠకునకు ఇదివరకే పరిచితుడును నేటాలులోని యూరపియను ఐచ్ఛికసేవకులకు ప్రధానోద్యోగియు అయిన యస్కాంబు మా ప్రయాణకాలమందు మాకు అభివందనములు ఆశీర్వాదములు పంపెను. మేము గైగొంటిమి.

ఇంగ్లీషు వార్తాపత్రికలకు ఇదంతయు పూర్తియైన దైవసాక్షాత్కారముగా కనుపడెను. భారతీయులు యుద్ధములో పాల్గొందురని యెవరును అనుకొనలేదు. ఒకప్రధాన వార్తాపత్రికలో భారతీయులను పొగడుచు ఒక ఆంగ్లేయుడు ఒక పద్యమును వ్రాసెను. "ఎట్లైనను మనమందరము సామ్రాజ్యముయొక్క కుమాళ్లమే." అనునది దాని పల్లవి.

ఈ ఉపచారసంఘములో స్వతంత్రభారతీయుల ప్రయత్నములవలన చేరిన కరారుగడిచిన భారతీయులు మూడు నాలుగు వందలుండిరి. అందరిలో ముప్పదియేడుగురు నాయకులుగా చూడబడిరి. ప్రభుత్వమునకు పంపిన వుత్తరములో వీరి దస్కతులు యుండబట్టియు, తక్కినవారిని వీరు చేర్చ

బట్టియు, వీరిట్లుయెంచబడిరి. ఈ నాయకులలో న్యాయవాదులును గుమాస్తాలును యుండిరి. ఇతరులలో వడ్రంగులు బేల్దారులు మొదలగు శిల్పకారులును, సామాన్యకార్మికులు (ఆత్మోపజీవులు) ను ఉండిరి. హిందువులు, మహమ్మదీయులు, మద్రాసీయులు, ఉత్తరప్రాంతమువారు, అన్ని తరగతులు, అన్నిమతములు, బాగా ప్రాతినిధ్యము వహించెను. ఈ సంఘములో వర్తకుడు ఒక్కడైనను లేనట్లె: కాని వారు పెక్కుమొత్తమును చందాలువేసిరి. యుద్ధాధికారులు ఇచ్చు భోజనసామగ్రితో పూర్తిగా తీరనిఅవసరములు కొన్ని ఈ సంఘమునకు ఉండెను. అవి తృప్తిపరచినయెడల కఠినమైన వారి శిబిరజీవితములో కొన్ని సౌకర్యములు కలుగును. వర్తకులు యీ సౌఖ్యములు కలిగించుటకు ఒప్పుకొనిరి. మరియు మావశములోనికి వచ్చిన గాయపడినవారికి మిఠాయిలు, చుట్టలు, యితరవస్తువులు, ఇచ్చి సహాయముచేసిరి. మేము పట్టణములదగ్గర శిబిరము ఏర్పరుచుకొనినపుడెల్ల, స్థానిక వర్తకులు మా సౌకర్యములను చూచుటకై మిక్కిలి శ్రద్ధ వహించిరి.

ఈ సంఘములో చేరిన కరారుకార్మికులు వారి వారి పరిశ్రమశాలలనుండి వచ్చిన ఇంగ్లీషుఅధికారులక్రింద నుండిరి. కాని వారు మేము చేయువలసినపని ఒకటియే. మేమందరము కలిసి నివసించుచుంటిమి. కాన యీవత్తు సంఘముయొక్క పరిపాలన సహజముగా మాచేతిలోనికివచ్చెను. ఇట్లు రానున్న

దని తెలిసి వారు మిక్కిలి సంతోషించిరి. ఈ యావత్తు సంఘమునకు భారతీయసంఘమని పేరు వచ్చెను. ఇది చేసినపని కెల్ల భారతీయబృందమునకు గౌరవమువచ్చెను. కరారు మనుజులును ఈసంఘములో చేర్చినది నిజముగా తోటయజమానులు; ఆ మర్యాద వారికిదక్కవలసినది. కాని భారతీయులకు హక్కు లేదు. అయినను స్వతంత్రభారతీయులు అనగా భారతీయ బృందము ఒక్కమారు యేర్పడిన ఈ సంఘమును శ్రేష్ఠముగా నిర్వహించినందుకు గౌరవార్హతను సంపాదించినదని చెప్పుటలో సందియములేదు. జనరల్ బుల్లర్ తన లేఖలలో దీని నంగీకరించెను.

మొట్టమొదట మాకు ఉపచారసేవలో తర్ఫీయతు యిచ్చిన డాక్టరు బూత్, వైద్యాధికారి హోదాతో మా సంఘములో చేరెను. ఆయన పుణ్యాత్ముడైన మతబోధకుడు. ఆయన భారతక్రైస్తువులలోనే ముఖ్యముగా పనిచేయు చున్నను, అన్నిమతముల భారతీయులలోను ఆయన స్వేచ్ఛగా కలసెను. పైజెప్పిన ముప్పదియేడుగురు నాయకులలో హెచ్చు మంది ఈయనవద్దనే తర్ఫీయతుపొందిరి.

భారతీయ ఉపచారసంఘముగాక యూరపియను ఉపచార సంఘము వేరుగానుండెను. రెండును ఒకచోటనేయుండి కలసిమెలసి పనిచేసెను.

మేము ప్రభుత్వమునకు పంపిన వాగ్దానములో యేషరతులునులేవు. కాని మాసేవ నంగీకరించుచు ప్రభుత్వమువారు

వ్రాసిన లేఖలో తుపాకులు ప్రేల్చు హద్దులలోనికి మేము పోనక్కరలేదని మినహాయించబడెను. సేనతోనున్న ఖాయమైన ఉపచారసంఘము గాయపడినవారినెల్ల అప్పుడప్పుడే తీసుకొనివెళ్లి సేనకు వెనుకవైపున ప్రేల్చుడు హద్దులకు అవతల నుంచవలెనని మాకు యిచ్చిన మినహాయింపునకు అర్థము. లేడిస్మిత్తులోనున్న వైటు సేనానికి సహాయము చేయుటకై బుల్లరుసేనాని చేయుచున్న మహాప్రయత్నములో ఖాయమైన ఉపచారసంఘమువారికి శక్యముగానంతమంది, గాయపడినవారుండవచ్చునని భయము కలిగినందున యూరపియనులయొక్కయు భారతీయులయొక్కయు ఉపచారసంఘములు తాత్కాలికముగా అంగీకరించబడెను. సేనలు పోరాడుచున్న ప్రదేశములో యుద్ధభూమికిని ప్రధానవైద్యశాలకును రస్తాలు వేసియుండలేదు. మామూలు వాహనములమీద గాయపడినవారిని తీసుకొనిపోవుట దుస్సాధ్యము. ప్రధాన వైద్యశాల అయోమార్గములు నిలుచుచోట నుండెను. సామాన్యముగా యుద్ధభూమినుండి 7 మొదలు 25 మైళ్ల దూరమున నుండెను.

త్వరలోనే మాకు పనిగల్గెను. మేమనుకొన్నదానికంటె అది కష్టమైనపని, గాయపడినవారిని యేడు యెనిమిదిమైళ్లు తీసుకొనిపోవుట మామూలుపనిలో భాగమయ్యెను. కాని అప్పుడప్పుడు మిక్కిలి గాయపడిన సైనికులును యుద్యోగస్థులును 25 మైళ్లు గూడ మోయవలసి వచ్చెను. ఉదయము 8

గంటలకు బయలుదేరవలెను. త్రోవలో మందు యివ్వవలెను. సాయంత్రము ౭ గంటలకు వైద్యశాల చేరవలయును. నిజముగా ఇది మిక్కిలి కష్టమైనపని. ఒక్కరోజులో ౨౫ మైళ్ల మోత మాకు ఒక్కమారే సంభవించెను. మరియు యీయుద్ధ ప్రారంభములో బ్రిటిషుసేన ఓటమిమీద ఓటమి పొందెను. హెచ్చుమంది గాయపడిరి. కాన ప్రేల్చుడుహద్దులలోనికి మమ్ము తీసుకొని పోరాదను అభిప్రాయమును వారు వదలవలసి వచ్చెను. అట్టి అవసరము వచ్చినప్పుడు వారు మాతో నిట్లు చెప్పిరి. "మీకరారు షరతుల ప్రకారము మీకు యీ సేవనుండి మినహాయింపు కలదు. ఇట్టి కష్టమునకు మీరు తయారు కానియెడల మిమ్ములను నిర్బంధించు ఉద్దేశ్యము బుల్లరుసేనానికి లేదు. కాని మీరు ఐచ్ఛికముగా పూనుకొనిన యెడల మీసేవ మిక్కిలి మెచ్చుకొనబడును. మేము ఈఆపద ప్రాంతములో ప్రవేశించుటకు యెప్పుడును మిక్కిలి తయారుగా నుంటిమి. దాని వెలుపలనుండుటకు యెన్నడును ఇష్టపడలేదు. కాన సంతోషముతో యీఅవకాశమును స్వీకరించితిమి. కానిమాలో యెవరికిని గుండుదెబ్బగాని యితరదెబ్బగాని తగలలేదు.

ఈసంఘమునకు అనేకములైన సంతోషకరములైన అనుభవములు కలిగెను. అవి ఇచట చెప్పపూనను. కాని ఒక్క సంగతి చెప్పితీరవలెను. కొంత మోటువారు అనుకొనబడిన కరారు భారతీయులుగూడ కల మాసంఘము అనేకమారులు

యూరోపియను ఉపచారసంఘ సభ్యులతోను, యూరపియను సైనికులతోను చేతులుకల్పి పనిచేసినను, యూరపియనులు మమ్మును అసహ్యముతోను అగౌరవముతోనైనను చూచినట్లు మేము ఎవరమును అనుకొనలేదు. యుద్ధమునకు పూర్వము భారతీయులకు వ్యతిరేకములైన ఆందోళనలో పాలుగొన్న దక్షిణాఫ్రికా యూరపియనులే యీయూరపియను ఉపచారసంఘములో చేరియుండిరి. కాని తమకష్టముల నెల్ల మరచి భారతీయులు, యూరపియనులకు అవసరము వచ్చిన సమయములో సహాయముచేయ పూనుకొనిరి గదా యను జ్ఞానము తాత్కాలికముగా ఆయూరపియనుల హృదయములను కరిగించెను. బుల్లరుసేనాని తనలేఖలో మాపనిని ఉదహరించెనని లోగడ చెప్పియున్నాను. 32 గురు నాయకులకు యుద్ధపతకములుగూడ యివ్వబడెను.

లేడిస్మిత్తు సహాయమునకై బుల్లరుసేనాని చేయుచున్న కార్యములు పూర్తికాగానే అనగా షుమారు రెండు నెలలలో మాసంఘమును, యూరపియను సంఘముగూడ వెనుకకు పంపివేయబడిరి. యుద్ధము యింకను చాలాకాలము సాగెను. మేము తిరిగి చేరుటకు యెప్పుడును సిద్ధముగా నుంటిమి, మమ్ములను విడుదలజేయు వుత్తరవులో మరల అవసరమువచ్చి హెచ్చువైశాల్యములో యుద్ధము సాగినయెడల తప్పక మా సేనలను ఉపయోగించుకుందుమని ప్రభుత్వమువారు ప్రకటించిరి.

దక్షిణాఫ్రికాలోని భారతీయులు యుద్ధమునకు చేసిన ఈసేవ చాల స్వల్పము. వారికి ప్రాణనష్టము కలుగలేదు. కాని సేవ జేయవలెనను నిష్కళంకమైన కోరికగూడ ఇతరకక్షు వారికి మంచి అభిప్రాయము కల్పించితీరును. అది తలవని తలంపుగా వచ్చినప్పుడు రెట్టింపుగా మెచ్చుకుందురు. యుద్ధము సాగినంతవరకు భారతీయులయెడ యీసద్భావము నిల్చి యుండెను.

ఈ అధ్యాయము ముగించులోపల గమనార్హమైన ఒక విషయమును తెలుపవలెను. లేడిస్మిత్తును బోయర్లు ముట్టడించి నప్పుడు అచ్చటి ఇంగ్లీషువారు కాక కొద్దిమంది భారతీయులును గలరు. వారిలో కొందరు వర్తకులు, తక్కినవారు కరారు కార్మికులు. అయోమార్గముల మీదగాని ఇంగ్లీషు వారికి సేవకులుగా గాని, వీరు పనిచేయుచుండిరి. వీరిలో ప్రభుసింగు అనువాడు ఒకడు యుండెను. లేడిస్మిత్తులోనున్న సైనికోద్యోగి అచట కాపురస్తులు ప్రతివానికిని పనిచెప్పెను. మిక్కిలి అపాయకరమైనట్టియు, బాధ్యతగలిగినట్టియు పని "కూలి" యైన ప్రభుసింగుకు చెప్పబడెను.

లేడిస్మిత్తుదగ్గిర ఒకకొండమీద బోయర్లు ఒక మర ఫిరంగి బెట్టిరి. దానిచర్యవలన అనేకఇండ్లకు నష్టమును, కొంత ప్రాణనష్టము సహితము కలుగుచుండెను. ఆఫిరంగినుండి కాల్చినగుండు దూరముననున్న లేడిస్మిత్తులో తగులునప్పటికి ఒకటి రెండు నిమిషముల వ్యవధియుండును. ఆవ్యవధి సమాచారమైనను ముట్టడింపబడినవారికి తెలిసినయెడల పట్టణ

ములో గుండు పగలకపూర్వము తలలు దాచుకొని రక్షించు కొనవచ్చును. ఆఫిరంగి పనిచేయుచున్నంతవరకును దాని మీదనే కండ్లుపెట్టుకొని చూచుచు, ఒకచెట్టుమీద కూర్చుని, అక్కడ మంట కనపడగానే ప్రభుసింగు గంట వాయించవలెను. గంట వినిన వెంటనే లేడిస్మిత్తు కాపురస్థులు యేగుండు వచ్చుచున్నదని తెలియజేయబడెనో దాని బారినుండి దాగి తప్పించుకొనుచుండిరి.

ఈ ప్రభుసింగు మిక్కిలి శ్రద్ధతో పనిచేసెను. గంట కొట్టుటకు ఒకమారైనను తప్పిపోలేదు అని ఈతనుచేసిన అమూల్యమైన సేవను కొనియాడుచు లేడిస్మిత్తు సైనికోద్యోగి చెప్పెను. ప్రభుసింగు జీవితము యెల్లప్పుడు ఆపదలోనుండెనని చెప్పనక్కరనేలేదు. ఈతని సాహసచరిత్ర నేటాలులో తెలసెను. అప్పుడు ఇండియాలో రాజప్రతినిధిగానున్న కర్జను ప్రభువువద్దకు, చిట్టచివరకు ఆ వార్త చేరెను. ఈ ప్రభుసింగును బహూకరించుటకై కాస్మీరదుస్తునుపంపి సాధ్యమైనంత బహిరంగముగా యీ బహుమానోత్సవము జరుపవలసినదని నేటాలుప్రభుత్వమునకు కర్జనుప్రభువు వ్రాసెను. ఈ పని దర్బాను మేయరుపైనబెట్టిరి. ఆతను దానికై పురమందిరములో పౌరసభ జరిపెను. దీనివలన మనము రెండు నీతులు నేర్చుకొనవచ్చును. (౧) ఎంత హీనుడైనను, యెంత అల్పుడుగా కనుపడినను, యేమనుజుని మనము తిరస్కరించరాదు. (౨) ఎంత పిరికివాడైననుసరే పరీక్షాసమయము వచ్చినపుడు అత్యున్నతపౌరుషమును అతడు చూపగలడు.

---

# 10వ అధ్యాయము

## యుద్ధము తరువాత



యుద్ధములో ముఖ్యభాగము ౧౯౦౦ సంవత్సరములో అయిపోయెను. లేడిస్మిత్తు, కింబర్లే, మేఫ్‌కింగు ఈ మూడు పట్టణముల ముట్టడి తొలగింపబడెను. క్రాంజీ సేనాని పార్డీబర్గు దగ్గర లొంగి వశుడయ్యెను. బ్రిటిషు వారి వలసరాజ్యములలో బోయర్లు ఆక్రమించుకొనిన భాగమును వారిచేతులనుండి లాగికొనబడెను. ట్రాన్సువాలు ఆరంజిఫ్రీస్టేటులను కిచనర్ ప్రభువు జయించెను. బోయర్లు అప్పుడపుడు అకస్మాతుగావచ్చి పడి, వేసినగుర్రపుయెత్తులు తప్ప ఇంకేమియు మిగులలేదు.

దక్షిణాఫ్రికాలో నాపని ఇప్పుడు పూర్తిఅయినదని తలచితిని. మొదట అనుకొనినట్లు ఒక నెలకు బదులు, ఆరుసంవత్సరములు అక్కడ యుంటిని. మేము చేయవలసిన పనియొక్క ముఖ్యమైన రూపురేఖలు షుమారుగా స్థిరపరచబడెను. అయినను అచ్చటి భారతీయబృందము యొక్క హృదయపూర్వకమైన సమ్మతిలేనిది నేను దక్షిణాఫ్రికా వదలజాలకుంటిని. నేను ఇండియా వెళ్లి అచ్చటి ప్రజాసేవ చేయుదలచితినని నాసహచరులతో చెప్పితిని. స్వార్థప్రయోజనము గాక, సేవాపాఠమును దక్షిణాఫ్రికాలో నేను నేర్చుకుంటిని. అట్టి పసికితగిన అవకాశములకై నేను కాంక్షించుచుంటిని "మనుష

కలాల్‌నాజరు" దక్షిణాఫ్రికాలో నుండెను. ఖాను గూడ నుండెను. దక్షిణాఫ్రికాలో పుట్టి పెరిగిన భారతీయయువకులు కొందరు ఇంగ్లండువెళ్లి బారిష్టరు న్యాయవాదులై తిరిగివచ్చిరి. ఈసందర్భములలో నేను ఇండియాకు మరలిన యెడల, అక్రమముగా నుండదు. నేను ఈ హేతువుల నన్నిటిని చెప్పినపుడు నాకు ఒక్క షరతుమీాద అనుమతి నిచ్చిరి. అది యేమనగా :— తలవనితలంపుగా దక్షిణాఫ్రికాలో పరిస్థితులేర్పడి, నాసమక్షము అవసరమైన యెడల, ఏనాడైనను భారతీయబృందము నన్ను పిలిపించవచ్చును. నేను తప్పక రావలెను. నాప్రయాణపు ఖర్చులును దక్షిణాఫ్రికాలో నేనున్నపుడు అగు ఖర్చులును వారు భరింతుమని చెప్పిరి. ఈ యేర్పాటుకు అంగీకరించి ఇండియాకు నేను మరలి వచ్చితిని.

నేను బొంబైలో న్యాయవాదిగా నుండదలచితిని. గోఖ్లేగారి యాజమాన్యమున వారిసలహాతో ప్రజాసేవ చేయవలెననెడు ముఖ్యోద్దేశ్యముతోడను, ప్రజాసేవతోపాటు నా జీవనోపాధిని సంపాదించుకొను తలంపుతోడను, ఇట్లు తీర్మానించుకొంటిని. గదులను అద్దెకు తీసుకొంటిని. కొంతపని కూడ రాసాగెను. దక్షిణాఫ్రికాతో నాకు సంబంధము యున్నందున, ఆ దేశమునుండి తిరిగివచ్చిన కక్షిదార్లు యిచ్చిన పని యొక్కటియే, నా జీవనోపాధికి మించియుండెను. కాని యీజీవితములో శాంతము పొందు అదృష్టము నాకు లేదు. బొంబయిలో మూాడు నాలుగు నెలలు ఉంటినో లేదో,

అప్పుడే దక్షిణాఫ్రికా స్థితి తీవ్రమైనదనియు, త్వరలో చాంబ రులైను రానున్నాడనియు, నాసమక్ష మవసరమనియు, అవసర తంతివార్త దక్షిణాఫ్రికానుండి నాకు వచ్చెను.

బొంబాయి ఇల్లు కార్యస్థానము మూసివేసి, దొరకిన మొదటియోడలో దక్షిణాఫ్రికాకు బయలుదేరితిని. ఇప్పటికి ౧౯౦౨ సంవత్సరము ఆఖరుకావచ్చెను. ౧౯౦౧ చివర నేను ఇండియా చేరితిని. ౧౯౦౨ మార్చి ఆప్రాంతమున బొంబైలో ప్రవేశించితిని. నాకు వచ్చిన తంతివార్తలో పూర్తివివరములు లేవు. ట్రాన్సువాలులో చిక్కు కలిగెనని యూహించితిని. నాలుగు ఆరునెలలో ఇండియాకు తిరిగి వచ్చెద నని యెంచి నాకుటుంబమును వదలి నేనొక్కడనే పోతిని. నేను దర్బాను వెళ్లి అన్నిసంగతులు వినునప్పటికి నాకు అత్యాశ్చర్యము కలిగెను. దక్షిణాఫ్రికాలో భారతీయులస్థితి యుద్ధానంతరము చక్కబడు నని మాలో చాలమందిమి ఆశించితిమి. యుద్ధము ప్రారంభ మైనపుడు ఆబోయర్లు మమ్ములపెట్టిన బాధలు యుద్ధకారణ ములలో నొకటిగా లాన్సుడౌన్ శెలుబోరన్ ప్రభువులును ఇతర పెద్దయుద్యోగస్థులును ప్రకటించి యున్నందున ట్రాన్సు వాలులోను ఫ్రీస్టేటులోను చిక్కులు కలుగునని మేము యెంచ లేదు. ట్రాన్సువాలు బ్రిటిషువలస అయినయెడల, భారతీయు లను పీడించుచున్న ఇక్కట్టు లన్నియు వెంటనే తొలగింపబడు నని ప్రిటోరియాలోనున్న బ్రిటిషుప్రతినిధి నాతో చాల సారులు చెప్పెను. ట్రాన్సువాలు ఇప్పుడు బ్రిటిషువారి హస్త

గతమైనది. గనుక భారతీయులకు వ్యతిరిక్తముగా బోయర్లచే చేయబడిన పాతచట్టములు అమలుజరుప వీలులేదని యూరపి యనులు గూడ నమ్మిరి. ఈసిద్ధాంతము చాలహెచ్చుమందిచే అంగీకరించబడెను. యుద్ధమునకు పూర్వము భూమి విక్రయ ములలో భారతీయుల పాటలను అంగీకరించని వేలంపాట దారులు, ఇప్పుడు బహిరంగముగా వీరిపాటలను అంగీకరించిరి. ఇట్లు బహిరంగవేలములలో భారతీయులు చాలమంది భూములనుకొనిరి. తమ విక్రయదస్తావేజులను "నిదర్శనముల ధృవపరచు"టకై ఆయుద్యోగస్తుని యెదుట దాఖలుచేసి నప్పుడు, ౧౮౮౫ సం॥ 3 వ చట్టమును పేర్కొని ఆయన దస్తావేజులను "రిజస్టరుచేయుట" నిరాకరించెను. దర్బానులో దిగగానే నాకిదియంతయు తెలసెను. చాంబరులైను మొట్ట మొదట దర్బానువచ్చుననియు, ఆయనతో మొదట నేటాలు పరిస్థితులు చెప్పవలెననియు, నాయకులు నాకు తెలిపిరి. ఇది చేసి నేను ఆయనతో గూడ ట్రాన్సువాలు పోవలసి యుండెను.

నేటాలులో ఒకరాయబారము చాంబరులైనుగారిని చూచెను. ఆయన వీరు చెప్పునది మర్యాదగా వినెను. వీరు విన్నవించిన విషయములను నేటాలు ప్రభుత్వముతో సంప్ర దింతునని వాగ్దత్తముచేసెను. యుద్ధమునకు పూర్వము నేటా లులో. అమలులోనున్న చట్టములు అతిత్వరలో సవరించబడు నని నామట్టుకు నేను ఆశపడలేదు. ఈచట్టములన్నిటిని లోగడ ఒక అధ్యాయములో యిదివరకే వర్ణించియున్నాము.

యుద్ధమునకు పూర్వము యెప్పుడైనను యేభారతీయుడైనను ట్రాన్సువాలు ప్రవేశించవచ్చును అని పాఠకులకు తెలిసియున్నది. ఇప్పుడు ఈస్థితి లేదని నేను కనుపెట్టితిని. కాని ఆటంకములు యూరపియనులకు భారతీయులకు సమానముగా వర్తించెను. యుద్ధానంతరము అచట దుకాణములన్నియు తెరువబడలేదు. అందువలన ట్రాన్సువాలులోకి తటాలున ఒకపర్యాయము బహుజనులు వచ్చినయెడల అందరికి సరిపోవు అన్నముగాని, వస్త్రముగాని దొరకదు. దేశస్థితి అట్లుండెను. అదివరకు దుకాణములలో నిలువపెట్టబడిన సరుకునంతను విధినిషేధములను లెక్కచేయకుండ వెనుకటి బోయరు ప్రభుత్వము స్వాధీనపర్చుకొని యుండెను. కాబట్టి ఈఆటంకములు తాత్కాలికములే అయినయెడల భయమునకు కారణమేమియు లేదని నేను యెంచితిని. కాని యూరపియనులకు అనుమతి పత్రముల నిచ్చుటలోను, భారతీయులకు అనుమతిపత్రముల నిచ్చుటలోను అవలంబించిన కార్యక్రమములో కొంతభేదముండెను. అందువలన సందేహమునకును, భయమునకును కారణము కన్పట్టుచుండెను. దక్షిణాఫ్రికాలోని అనేకరేవులలో అనుమతి పత్రములనిచ్చు కార్యస్థానములు యేర్పరచబడెను. సర్వసాధారణముగా యూరపియనులు అడిగినంతమాత్రముననే అనుమతి పత్రము పొందుచుండిరి. భారతీయుల విషయము ఆలోచించుటకు ట్రాన్సువాలులో "ఏషియావాసుల శాఖ" అని ఒక ప్రభుత్వశాఖ

యేర్పరచబడెను. ఈప్రత్యేకశాఖ నేర్పరుచుట ఒక క్రొత్త మార్గము. భారతీయులు మొట్టమొదట ఈశాఖాధికారివద్ద దరఖాస్తులు పెట్టవలసియుండిరి. అతడే దరఖాస్తులు మంజూరు చేసినపిమ్మట, దర్బానులోగాని యే యితర రేవులలోగాని వీరు సామాన్యముగా అనుమతి పత్రముల పొందగలిగి యుండిరి.

ఈతంతు అంతయు జరుగవలసియుండిన యెడల చాంబరులైనుగారు ట్రాన్సువాలు వదలకపూర్వము నాకు అనుమతివచ్చు ఆశ కనుపడలేదు. ట్రాన్సువాలులోనున్న భారతీయులు నాకీ అనుమతి సంపాదించజాలరు. ఇది వారి శక్తికి మించినపని. దర్బానులో నాకున్న స్నేహసంబంధములనుబట్టి నేను అనుమతిని సంపాదించగలుగుదునని వారు నామీదనే ఆధారపడిరి. ఈఅనుమతి ఉద్యోగస్తుని నేను ఎరుగను. కాని దర్బాను పోలీసు పైఅధికారిని నేను ఎరిగి యుంటిని, గనుక అనుమతి కార్యస్థానమునకు నావెంట రమ్మనమని వారిని నేనడిగితిని. ఆయన సమ్మతించి అవసరమైన ధృవవచనముల యిచ్చెను. ౧౮౯౩ లో ఒక యేడాది నేను ట్రాన్సువాలులో నున్న కారణముపై ఆధారపడి నాకు అనుమతి నిచ్చిరి. అట్లు నేను ప్రెటోరియా చేరితిని.

ప్రెటోరియాలోని పరిస్థితులు స్పష్టముగా అశుభముగా నుండెను. ఆశియావాసులశాఖ అనునది భారతీయులను నిర్బంధించుటకు భయంకరయంత్రము అని నేను గ్రహించ గలిగితిని. ఇండియానుండి దక్షిణాఫ్రికాకు వచ్చిన నేనను అను

సరించి అడుగిడి తమ సంపాదనాశక్తులను పరీక్షించుకొనుటకు ఇచ్చట కాపురము లేర్పరచుకొనిన సాహసికులలో కొందరు ఈశాఖలో ఉద్యోగస్తులుగా నుండిరి. వారిలో కొందరు లంచగొండులు. ఇద్దరిపై లంచములకై పిర్యాదులుకూడ తేబడెను. వారు నిర్దోషులని తీర్మానించబడెను, గాని వారు నేరముచేసి నట్లు అనుమానమునులేక స్పష్టము అయినందున తదుపరి వారిని ఉద్యోగములోనుండి తొలగించిరి. పక్షపాతమే యీశాఖలో ఆచరణసూత్రముగా నుండెను. ఇట్లు ఒకప్రత్యేకశాఖ నేర్పరచి నపుడును ఇదివరకున్న హక్కులను తగ్గించుటయే ఆశాఖపెట్టుటకు కారణమైనప్పుడును ఈశాఖను నిలువపెట్టి దీనిని సమర్థించుటకుగాను, అప్పటప్పటికి క్రొత్తఆటంకములను కల్పించుటకు దానిలోని ఉద్యోగస్తులు సహజముగా ప్రయత్నించుచుందురు. తాము తమకర్తవ్యములను చక్కగా నిర్వహించుచున్నట్లు చూపుటకుకూడ ఇట్లే ప్రయత్నించుచుందురు. ఈవర్తమాన వ్యవహారములో జరిగినది సరిగా ఇదియే.

నేను నాపనిని మొదటినుండి ప్రారంభించవలసివచ్చునట్లుగా కనుపడెను. నేను ఎట్లు ట్రాన్సువాలు ప్రవేశించినది ఆశియాశాఖవారు వెంటనే కనుపెట్టలేకపోయిరి. సరాసరి నన్ను అడుగుటకు సాహసించలేదు. దొంగతనముగా ప్రవేశించుటకు నేను పాలుపడనని, వారు తలచిరని, నేను ఊహించెద. నేను అనుమతిపత్రము యెట్లు సంపాదించినది వారు పరోక్షముగా సమాచారమును తెప్పించుకొనిరి. చాంబరులైనుగారిని చూచు

టకు ప్రిటోరియాలో రాయబారము తయారు అయ్యెను. ఆయనకు విన్నవించవలసిన మహజరును నేను తయారుచేసితిని కాని రాయబారములో నేను చేరకుండ ఆశియాశాఖవారు అడ్డుపడిరి. నన్ను రావద్దనినయెడల తాముగూడ చాంబరు లైనుని చూడగూడదని భారతీయనాయకులకు తోచెను. కాని నేను దానిని ఆమోదించలేదు. నాకు జూపిన అవమానమునకు నేను లక్ష్యము చేయరాదని చెప్పితిని. వారుకూడ దానిని నిర్లక్ష్యము చేయవలెనని సలహా చెప్పితిని. మహజరు తయారుగా యుండనేయుండెను. అది చాంబరులైనుగారికి అర్పించుట అవసరము. అప్పుడు అచ్చటనున్న భారతీయ న్యాయవాది జార్జిగాడ్ ఫ్రిగారికి ఈమహజరు చదువుపని యివ్వబడెను. రాయబారము చాంబరులైనును దర్శించెను. సంభాషణమధ్యలో నాపేరురాగా ఆయన ఇట్లు చెప్పెను. "దర్బానులో ఇదివరకే గాంధిని నేను జూచితిని. ట్రాన్సువాలులోని పరిస్థితిని, స్థానికనివాసులనుండి సరాసరి తెలుసుకొనుటకుగాను ఆయన నిక్కడచూడ నేను నిరాకరించితిని." ఈ వాక్యము మంటలో నెయ్యిపోసినట్లు ఉన్నదని నాయభిప్రాయము. ఆశియాశాఖవారు చెప్పిన పాఠమును చాంబరులైను వప్పగించెను. ఇండియాలో వ్యాపించియున్న పరిస్థితులను వారు ఇట్లు ప్రవేశపెట్ట ప్రయత్నించిరి. ఇండియాలో బొంబై కాపురస్తులు చంపారన్ వెళ్లినయెడల బ్రిటిషు యుద్యోగస్తులు యీ బొంబై వారిని విదేశస్థులుగా నెంచుదురని ప్రతివాసికిని

తెలియును. ఆ అంచనాప్రకారము దర్బానులో నివసించెడి నేను ట్రాన్సువాలు పరిస్థితులను విట్లు తెలుసుకొనగలను? ఆశియాశాఖవారు ఇట్లు చాంబరులైనుకు బోధించిరి. నేను ట్రాన్సువాలులో నుండినసంగతి ఆయనకు తెలియనే తెలియదు. నేను అక్కడ యుండకపోయినను అచ్చట భారతీయుల పరిస్థితులు నాకు పూర్తిగా తెలియును. ఈవిషయములో చేయదగినప్రశ్న యొకటియే. ట్రాన్సువాలు పరిస్థితులను గూర్చి యెవరివద్ద పూర్తియైన సమాచారముగలదు? నన్ను ఇండియానుండి ఇంతదూరము రమ్మని పిలిచిన ట్రాన్సువాలు భారతీయులు ఇదివరకే తమతరఫున ఆప్రశ్నకు తగిన జవాబు ఇచ్చియుండిరి. కాని వివేకముమీద ఆధారపడు వాదములు యుద్యోగములో నున్నవారికి యెల్లపుడు నచ్చవనుట క్రొత్త అనుభవముకాదు. స్థానికోద్యోగస్థుల పలుకుబడిక్రింద చాంబరులైను లొంగిపోయెను. అచ్చటి యూరోపియనులను సంతోషపెట్టుటకు ఆతురపడుచుండెను. కావున ఆయన మాకు న్యాయము చేయునను ఆశకు యెడమేలేదు. అయినను పౌరపాటుచేతగాని ఆత్మగౌరవమునకు నష్టము కలిగినదను కారణముచేతగాని పరిహారము పొందుటకు వీలైన సర్వమార్గములను దేనిని వదలకూడదని రుజువుచేయుటకే ఈరాయబారము వాని వద్దకు వెళ్లెను.

౧౮౯౭రలో నాకు కలిగిన సందిగ్ధస్థితికన్న మిక్కిలి కష్టమైనస్థితి నన్ను ఇప్పుడు ఎదుర్కొనెను. ఒకవిధముగా

చూచినయెడల చాంబరులైను దక్షిణాఫ్రికా విడిచిపోగానే, నేను ఇండియాకు మరల వచ్చునని కనుపడెను. దక్షిణాఫ్రికా భారతీయులును, ముఖాముఖి యెదుర్కొనిన మహావిపత్తును పూర్తిగా గ్రహించియు, ఇండియాలో అంతకంటె విశాలమైన రంగమున సేవ చేయవచ్చునను వ్యర్థపు యూహతో నేను ఇండియాకు తిరిగివచ్చినయెడల, నేను సంపాదించిన సేవా భావము స్థంభించిపోవునని స్పష్టముగా చూడగలిగితిని. అందు వల్ల నాజీవితమంతయు దక్షిణాఫ్రికాలో గడుపవలసివచ్చినను, ఆవరించుచున్న మేఘములు విచ్చిపోవువరకుగాని, లేదా తచ్ఛిన్నముగాజేయు మాప్రయత్నముల నన్నిటిని భంగపరచి కుంభవృష్టి కురిసి ఆప్రవాహము మమ్ము ఈడ్చి పారవేయునంత వరకుగాని, నేను అచ్చట యుండవలెనని యోచించితిని. భారతీయనాయకులకు ఇట్లే చెప్పితిని. పూర్వకాలములో వలెనే న్యాయ వాదమువలన జీవనోపాధి సంపాదించ నుద్దేశించితినని ప్రకటించితిని. భారతీయబృందమునకు కావలసిన దిదియే.

ట్రాన్సువాలులో న్యాయవాదవృత్తి చేయుటకు త్వరలో దరఖాస్తు పెట్టితిని. ఇక్కడ కూడ న్యాయవాది సంఘమువారు నాదరఖాస్తును యెదురింతురని కొంతభయము కలిగెను. కాని అది నిర్హేతుకమని రుజువయ్యెను. నన్ను ప్రధానన్యాయస్థానములో న్యాయవాదిగా చేర్చుకొనిరి. జోహానిస్బర్గులో కార్యస్థానము పెట్టితిని. ట్రాన్సువాలులోని అన్నిపట్టణములలోకెల్ల జోహానిస్బర్గులో భారతీయులు

హెచ్చుగానుండిరి. కాన నావృత్తికిని, ప్రజాసేవకును, అచ్చట కాపురము యుండుట యుక్తముగా నెంచెను. ఆశియాశాఖవారి అక్రమప్రవర్తనములను గూర్చి దినదినమును తీవ్రమైన అనుభవము కలుగుచుండెను. ఈ జాడ్యమునకు ఔషధము వేయుట కే. టి, బి. భా. సం. వారి ఉత్తమ కృషి అవసరమయ్యెను. ౧౮౮౫ సం॥ 3 వ చట్టము రద్దుపరుచుట దూరపు ఆదర్శమై వెనుకకు బోయెను. ఈ ఆశియాశాఖ రూపమున పైవచ్చి పడుచున్న వరదనుండి తప్పించుకొనుటయే సన్నిహిత కార్యక్రమమయ్యెను. మిల్నరుప్రభువువద్దకు అక్కడకువచ్చిన సెల్బరన్ప్రభువు వద్దకు ట్రాన్సువాలు పాలకుడుగానుండి పిమ్మట చెన్నపురి రాష్ట్రపాలకుడైన సర్. ఆర్థరులాలీ వద్దకు, తక్కుంగల చిన్న ఉద్యోగస్థుల వద్దకు, భారతరాయబారములు వెళ్లెను. నేను తరుచుగా ప్రభుత్వోద్యోగులను చూచుచుంటిని. అక్కడక్కడ కొద్దిగా పరిహారము కలుగుచుండెను, కాని అది యంతయు అచ్చగా అతుకులుమారిపని. మాకు కలుగు ప్రతిఫలము యెట్టిదనగా దారిదోపిడిగాండ్రచేత యావదాస్తి దోచుకొనబడిన మనుజుడు, వారలను బ్రతిమాలి మిక్కిలి తక్కువ విలువ గలిగిన వస్తువును సంపాదించి నపుడు యెట్టితృప్తి కలుగునో ఆమాదిరి తృప్తియె మాకు కలిగెను. ఇట్టి ఆందోళన మూలకముగనే పై చెప్పబడినట్టి తొలగింపబడిన ఉద్యోగస్థులపై ఫిర్యాదు జరుపబడెను. భారతీయుల ప్రవేశమునకు ఆటంకములు కలిగింతురని మాకు

కలిగిన సందేహములు నిజమయ్యెను. యూరపియనులను అను
మతి పత్రములను అడుగుట మానివేసిరి. మహమ్మదీయులను అడుగు
చునే యుండిరి. గడచిపోయిన బోయరుప్రభుత్వము తాము
జేసిన క్రూరమైన శాసనములను మామీద కఠినముగా
అమలు జరుపలేదు. మామీద దయవల్లగాక వారి ప్రభుత్వ
పరిపాలనలో నుండు లోపములవల్ల అట్లు తటస్థించెను.
బోయరుపరిపాలనలో మంచి ఉద్యోగస్తునకు కల అవకాశము
బ్రిటిషుపరిపాలనక్రింద లేదు. బోయరులక్రింద అతను తన
మంచితనమును చూపవచ్చును. బ్రిటిషురాజ్యాంగపద్ధతి పాత
బడి ఒకేమాదిరి కట్టుబాట్లు గలదిగా నుండెను. ఏకమాత్ర
కానుసారముగా నుండెను. దానిక్రింద పనిచేయు యుద్యో
గస్తులు యంత్రములవలె పనిచేయవలెను. మెట్టుమెట్టుగా
పెట్టిన పైవిమర్శనాధికారమువల్ల వారికుండు కార్యస్వాతం
త్ర్యము నిరోధింపబడినది. బ్రిటిషురాజ్యాంగపద్ధతిక్రింద ప్రభు
త్వకార్యక్రమము ఔదార్యముగా నున్నయెడల, ఆఔదార్య
మునుండి అత్యధికలాభమును పౌరులు పొందుదురు. అట్లు
గాక వారి విధానము నిర్బంధవిధానముగాని లుబ్ధవిధానము
గాని అయినయెడల, దాని కాఠిన్యము అత్యధికముగా ప్రజ
లనుభవింతురు. గడచిన బోయరు ప్రజాస్వామ్య ప్రభుత్వము
వంటి రాజ్యాంగపద్ధతులలో దీనికి భిన్నమైన స్థితి సంభవిం
చును. ఉదారము అయిన చట్టమునుండి ప్రజలకు పూర్తి
లాభము కలుగునా కలుగదా అను అంశము దానిని పరి

పాలించు ఉద్యోగస్థులమీద హెచ్చుగా ఆధారపడియుండును. ట్రాన్సువాలులో బ్రిటిషువారి అధికారము యేర్పడినపుడు భారతీయులకు భిన్నముగానున్న చట్టములను రోజురోజు మరింత కఠినముగా అమలుపరచసాగిరి. యెక్కడనైనను లోపములున్నయెడల వానిని జాగ్రత్తగా సవరించుచుండిరి. ఆశియాశాఖ తన పనులలో కఠినముగా నుండక తప్పదని పైన గమనించియుంటిమి. కాన పాతచట్టములను రద్దుచేయుట దురూహ్యమయ్యెను. ఆచట్టములలో నుండు కష్టములను ఆచరణలో యెంతవరకు తగ్గించవచ్చు ననునదియే భారతీయులకు మిగిలియుండిన కర్తవ్యమయ్యెను.

ముందో వెనుకో ఒకసిద్ధాంతము చర్చించపలెను. దానిని ఇప్పుడేచర్చించినయెడల భారతదృక్పథమును ఇక ముందు గోచరమగు పరిస్థితులును తెలిసుకొనుటకు కొంతవరకు సహాయపడును. ట్రాన్సువాలు ఫ్రీస్టేటులలో బ్రిటిషు అధికారము యేర్పడినవెంటనే మిల్నరు ప్రభువు ఒక ఉపసంఘము యేర్పరచెను. పౌరుని స్వాతంత్ర్యమునకు ఆటంకములు కలిగించునట్టియు, లేదా బ్రిటిషు రాజ్యాంగపద్ధతియొక్క స్వభావమునకు భిన్నమైనట్టియు, బోయరుప్రభుత్వమువల్ల చేయబడియున్న పాతచట్టముల జాబితాను తయారు చేయుటకు యీయుపసంఘ మేర్పరచబడెను. భారతీయులకు వ్యతిరేకమయిన చట్టములుకూడ ఈవర్గలో స్పష్టముగా చేరగలవు. కాని భారతీయుల కష్టములను నివారించుటకుగాక, బ్రిటిషు

పౌరుల కష్టనివారణమునకై ఉద్దేశించి మిల్నరు ఈ సంఘము నేర్పరచెను. బ్రిటిషువారికిపరోక్షముగానైనకష్టములుకలిగించు చట్టములను వీలు అయినంతత్వరలో రద్దుపరుచుటకు ఆయన కోరెను. శీఘ్రకాలములో ఉపసంఘమువారు నివేదికనుపంపిరి. బ్రిటిషువారికి వ్యతిరేకముగానున్న అనేకచట్టములు చిన్నవియు పెద్దవియు ఒక కలముపోటుతో రద్దుచేయబడెనని చెప్పవచ్చును.

ఆయుపసంఘమే భారతీయులకు వ్యతిరిక్తమగు చట్టముల జాబితాను తయారు చేసెను. వీనిని ఒక పుస్తకరూపమున ప్రకటించిరి. ఆశియా శాఖవారు దీనినిబట్టి ఆచట్టములు, ఉపయోగించుటకును, మాఅభిప్రాయములో దుర్వినియోగపరచుటకును వారికి వీలుగలిగెను.

భారతీయులకు వ్యతిరేకమయిన చట్టములు, వారిని పేరుతో ఉదహరించక ప్రత్యేకముగా వారికే వర్తింపజేయక అందరు పౌరులకు వర్తించిన యెడలను, ఉద్యోగస్తుల ఇష్టానుసారము వాటిని అమలుపెట్టుటకు వదలినయెడలను లేదా ఈచట్టములు సర్వజనులకు వర్తించు ఆటంకములను విధించి భారతీయులమీద ప్రత్యేకముగా కఠినమైన విధమున అమలు జరిపిన యెడలను ఆ శాసనాధికారుల ఉద్దేశ్యములు అట్టి చట్టములవలన యేవిధముననైనను నిర్వహింపబడేవి. అట్లయ్యును ఈ చట్టములు సర్వసామాన్యచట్టములు అని పిలువబడి యుండును. అట్టిచట్టములు చేయుటవలన యెవరును అవమా

నము పొందరు. ఇప్పుడున్న విరుద్ధభావము కాలక్రమేణ తగ్గిన యెడల ఆచట్టములను సవరింప అవసరముండదు. వీనిని మరింత ఔదార్యముతో అమలు జరిపినయెడల నిర్బంధితులైన సంఘముయొక్క కష్టము తీరును. రెండవరకము చట్టములను సర్వసామాన్యచట్టములని పిలిచినట్లే మొదటిరకము వానిని ప్రత్యేకచట్టములని గాని జాతిచట్టములని గాని పిలువవలెను. అయ్యవి రంగుభేదమును స్థిరపరచుచున్నవి. యేలనన రంగు అను ప్రత్యేకకారణమునుబట్టియే యూరపియనులమీాదకన్న నలుపు లేక యెరుపు జాతులమీాద హెచ్చు నిషేధములను విధించుచున్నవి.

ఇప్పుడు అమలులోనున్న చట్టములనుండి ఒక ఉదాహరణ తీసుకొందము. నేటాలులో చేయబడిన ఎన్నికాధికారము తీసివేయు మొదటిచట్టము, సామ్రాజ్యప్రభుత్వము వారిచే దరిమిలా రద్దుపరచబడినది. ఆశియావాసులుమీాద, వారు, ఆసియావాసులన్న కారణముచేతనే, వారి యెన్నికాధికారములను తీసివేసెను. ఇది పాఠకుడు జ్ఞాపకము యుంచుకొని యుండును. ఇప్పుడు ఇట్టిచట్టమును రద్దుపరుచుకొనవలెననిన యెడల ప్రజాభిప్రాయములో ఎంత ప్రబోధము జరుగవలెనంటే, అధిక సంఖ్యాకులు ఆశియావాసులకు విరోధభావమును వదలుటయే గాక, స్నేహితులుగానుండు స్థితికికూడ రావలయును. అట్టి సుహృద్భావములు యేర్పడినపుడే మొదటపెట్టిన రంగు భేదము తొలగించ వీలగును. ఇది రంగు

భేదములు లేక తరగతిభేదములనుబట్టి చేసిన చట్టములయొక్క నిదర్శనము. ఆచట్టమును ఉపసంహరించి దానిస్థానే రెండవ చట్టమును చేసిరి. అది మొదటిదాని ఉద్దేశ్యమునే షుమారుగా నిర్వహించెను. కాని అందరికి వర్తించునట్టి స్వభావముతో నుండెను. దానిలోనుండు రంగుభేద మను తెలుగొంగి తొలగింప బడెను. అందులోని ఒక వాక్యముయొక్క సార మిట్లున్నది. "పార్లమెంటు యెన్నికాధికారములమీద ఆధారపడిన ప్రాతి నిధ్య సంస్థలు ఇదివరకు లేని దేశములలో పుట్టినవారు నేటా లులో జాబితాలో చేరరాదు." ఇందులో భారతీయులని గాని ఆశియావాసులనిగాని యుదహరింపబడలేదు. పై వాక్య ములో తెలిపిన ప్రాతినిధ్యసంస్థలు ఇండియాలో ఉన్నవా లేవా అను విషయమై న్యాయవాదులకు భేదాభిప్రాయము కలుగ వచ్చును. కాని ౧౮౯౪ లో ఇండియాలో అట్టి యెన్నికాధి కారము లేదనియు, ఇప్పటికిని లేదనియు వాదముకొరకు ఒప్పుకున్నను ఏ యుద్యోగస్థుడైనను, భారతీయుల పేర్లను నేటాలులో యెన్నికదార్ల జాబితాలో చేర్చినయెడల ఆతడు చట్టవిరుద్ధమైనపని చేసినాడని యేఒక్కడును వెంటనే చెప్ప జాలడు. పౌరునికి హక్కు కలదని అభిప్రాయపడుటకే అను కూలమైన ఊహ చేయుబడును. అప్పటి ప్రభుత్వవర్గము ప్రత్యేకవిరుద్ధభావము వహించనంతవరకు పై చట్టము ఉన్నను కూడ భారతీయుల యొక్కయు, ఇతరుల యొక్కయు పేర్లను ఎన్నికదార్ల జాబితాలో చేర్చ వీలుగలదు. అనగా భారతీయుల

యెడ గలిగిన అయిష్టత ఇంత ప్రత్యక్షముగా నుండక తగ్గిన యెడలను, భారతీయులకు అపకారము చేయుటకు స్థానిక ప్రభుత్వము సిద్ధముగా నుండనియెడలను, పై చట్టమును రవంతయైనను మార్చకుండగనే భారతీయుల పేర్లను ఎన్నిక దార్ల జాబితాలో చేర్చవచ్చును. అందరికి వర్తించు శాసనము యొక్క లాభమిదియే. లోగడ అధ్యాయములలో పలుక రించబడిన దక్షిణాఫ్రికాలో అమలులోనున్న చట్టములలో నుండి ఇవేరకమైన ఇతరనిదర్శనములు యివ్వవచ్చును. కాన వివేకముగల విధానమేమనగా సాధ్యమైనంతవరకు తక్కువగా ప్రత్యేకతరగతులకు వర్తించు శాసనములను చేయుట. దానిని పూర్తిగా విసర్జించుట మరింత వివేకముగా నుండును. ఒక మారు ఒక శాసనము చేసినయెడల దానిని తొలగించుటకు అనేక కష్టములను ఎదుర్కొనవలెను. ప్రజాభిప్రాయము బాగుగా ప్రబోధమొందినపుడే ఆ దేశములో అమలులోనున్న చట్టములను రద్దుపర్చ వీలగును. చీటికి మాటికి చట్టములను సవరించు లేక రద్దుపర్చు, రాజ్యాంగము స్థిరమైనదనిగాని సౌష్టవమైనదనిగాని చెప్ప వీలులేదు.

ట్రాన్సువాలులో ఆశియావాసులకు విరుద్ధమైన చట్టములలో ఇమిడియున్న విషయమును మనము ఇప్పుడు చక్కగా గుర్తించవచ్చును. అవి అన్నియు రంగుభేదమును బట్టియే యేర్పడినవి. ఆశియావాసులు గనుకనే యెన్నికలలో సమ్మతి నివ్వరాదు. అందుచేతనే ప్రభుత్వము నిర్ణయించిన

ప్రత్యేకప్రదేశములకు వెలుపల భూమి సంపాదించరాదు. ఈచట్టములు చట్టముల పుస్తకములలోనుండి తొలగింపబడ నంతవరకు భారతీయులకు పరిపాలకులు సాయముచేయలేరు. మిల్నరు యేర్పరచిన ఉపసంఘము అందరికి వర్తించిన చట్టములయొక్క జాబితామాత్రమే తయారుచేయగలిగెను. భారతీయులకు సంబంధించినవిగూడ అందరికి వర్తించు చట్టములే అయి యున్నయెడల ప్రత్యేకముగా వారిమీద ఉద్దేశింపక పోయినను, ఆశియావాసుల మీదనే అమలు జరుపబడుచున్నప్పటికినికూడ, అట్టి చట్టములు సహితము ఇతరచట్టములతో పాటు రద్దుఅయి యుండెడివి. క్రొత్తశాసనసభ యీశాసనములను రద్దుపరచనంతవరకు తాము నిస్సహాయులమనియు, వానిని అమలుపరచక తమకు తప్పదనియు, ఆయుద్యోగస్థులు వాదించి యుండజాలరు.

ఈ చట్టములు ఆశియాశాఖవారి చేతిలోనికి వచ్చినప్పుడు, వారు వానిని కఠినముగా అమలు జరుపసాగిరి. మరియు యీచట్టములు ఆచరణయోగ్యములే అయినయెడల ఉద్దేశపూర్వకముగాని, పొరబాటువల్లగాని ఆచట్టములలో ఆశియావాసులకు అనుకూలమైన సందుల నన్నిటిని మూయించుటకు ప్రభుత్వమువారు క్రొత్తఅధికారములనుగూడ సంపాదింపవలెను. ఇది సులభముగా, న్యాయముగా కనుబడుచున్నది. ఆచట్టములు చెడ్డవి అయినయెడల, వానిని రద్దుపర్చవలెను. అవి మంచివి అయినయెడల వాని లోపములను సవ

రింపవలెను. ఈచట్టములను అమలుపర్చుటకు మంత్రులుపూను కొనిరి. గతయుద్ధములో బ్రిటిషువారితోపాటు భారతీయులు చేదోడువాదోడుగా నిలువబడి తమ ప్రాణములకుకూడ తెగించిరి. కాని అది మూడునాలుగు సంవత్సరములనాటి పాతకథ అయిపోయెను. ప్రిటోరియాలోనున్న బ్రిటిషు ప్రతినిధి భారతీయుల తరఫున పోరాడెను. కాని అది పాతప్రభుత్వముక్రింద భారతీయుల యిబ్బందులు యుద్ధమునకు ప్రకటించబడిన కారణములలో చేర్చబడెను. కాని స్థానికపరిస్థితులు తెలియని హ్రస్వదృష్టిగల రాజ్యాంగధురీణులచేత ఆ ప్రకటన చేయబడెను. వెనుకటి బోయరు ప్రభుత్వమువారు చేసిన ఆశియావాసులకు విరుద్ధమైన చట్టములు తగినంత కఠినముగా లేవనియు, చక్కని విధానముతో కూడియుండ లేదనియు, స్థానికోద్యోగులు బాగుగా కనిపెట్టిరి. ట్రాన్సువాలులోనికి భారతీయులు ఇష్టమైనపుడెల్ల వచ్చి కావలసిన చోట నెల్ల వర్తకము చేసినయెడల బ్రిటిషువర్తకులు హెచ్చుగా నష్టపడుదురు. ఇవియు ఇట్టి ఇతరవాదములును యూరపియనులకును మంత్రివర్గములోని వారి ప్రతినిధులకును హెచ్చుగా నచ్చెను. వారందరును అత్యంతస్వల్పకాలములో అత్యధికధనము సంపాదింప బూనియుండిరి. తమతోపాటు భారతీయులు భాగస్వాములగుటకు వారెట్లు సహించగలరు? రాజకీయసిద్ధాంతముయొక్క సహాయమునుపొంది పైకి సవ్యముగా కనపడగల ఒక వాదమును కాపట్యము వెల్వారించెను.

అచ్చుగా స్వార్థయుతమైనగాని, లేదా వాణిజ్యసంబంధమైన గాని వాదము దక్షిణాఫ్రికాలోని బుద్ధిమంతులగు యూరపియనులను తృప్తిపరచజాలదు. అన్యాయమును బలపరుచుటకు తగిన యుక్తివాదమును పన్నుటలో మానవధీశక్తి కుతూహలపడుచుండును. ఈ సామాన్యసూత్రమునకు దక్షిణాఫ్రికా యూరోపియనులు ప్రత్యవాయము (మినహాయింపు) గాకుండిరి. స్మట్సు సేనానియు ఇతరులును ఈక్రింది యుక్తులను చెప్పియుండిరి.

"పాశ్చాత్యనాగరికతకు దక్షిణాఫ్రికా ప్రతినిధి. ప్రాచ్యనాగరికతకు ఇండియా కేంద్రము. ఈరెండు నాగరికతలు కలసియుండ జాలవని ఈతరములోని ఆలోచనాపరులు (సిద్ధాంతులు) అభిప్రాయపడుచున్నారు. ఈవిరోధనాగరికతల ప్రతినిధులగు జాతులు చిన్నముఠాలుగానైనను కలసినయెడల సంఘర్షణము గలిగి ఉత్పాతములు (ప్రేలుడు) కలుగును. పాశ్చాత్యులు నిరాడంబర జీవనమునకు వ్యతిరేకులు. తూర్పుదేశవాసులు దానినే ప్రధానమైన సుగుణమని యెంతురు. ఈ భిన్నాభిప్రాయములను సమన్వయించు టెట్లు? ఈరెంటియొక్క పరస్పరయోగ్యతలను యోచించి నిర్ణయించుట కార్యపరులైన రాజకీయధురీణుల కర్తవ్యముకాదు. పాశ్చాత్యనాగరికత మంచిది కావచ్చును కాకపోవచ్చును. కాని పాశ్చాత్యులు దానిని అంటుకొని యుండదలచిరి. దానిని రక్షించుటకు నిరంతరమైన యత్నములు చేసియున్నారు. దానికొరకు

రక్తనదులను ప్రవహింపచేసి యున్నారు. దానికొరకు అనేక కష్టములను సహించి యున్నారు. వారిపుడొక క్రొత్తమార్గమును త్రొక్కుట అసంభవము. ఇట్లు విచారించినయెడల భారతీయుల సమస్యను వర్తకమువలన గలిగిన అసూయలనిగాని జాతిద్వేషమనిగాని తీర్మానించ వీలుకాదు. యెవరినాగరికతను వారు కాపాడుకొనుటయే ఈసమస్య. అనగా ఆత్మసంరక్షణమను ఉత్తమమైన హక్కును అనుభవించుట, దానివలన కలిగెడు కర్తవ్యమును నిర్వహించుట. కొంతమంది ఉపన్యాసకులు భారతీయుల లోపములను యెంచి యూరపియనులకు కోపము కలిగింప తలంపవచ్చును. కాని భారతీయులకు ఉండు సుగుణములే దక్షిణాఫ్రికాలో లోపములని రాజకీయ ఆలోచనాపరులు, సిద్ధాంతులు నమ్ముచున్నారు. అట్లే చెప్పుచున్నారు. నిరాడంబరత్వము, సహనము, పట్టుదల, పొదుపరితనము, పరలోకచింత ఈగుణములకే భారతీయులయెడ దక్షిణాఫ్రికావారు అయిష్టత చూపుచున్నారు. పాశ్చాత్యులు నూతనోద్యమ ఉత్సాహకులు, సహనము లేనివారు, తమ భౌతికవాంఛలను పెంచుట యందును, తృప్తిపరచుట యందును మగ్నులైనవారు, కులాసాను ప్రేమించువారు, కాయకష్టమును తగ్గించదలచువారు, అధికమైన ఖర్చు చేయువారు. కాన వేలకొలది తూర్పుదేశవాసులు దక్షిణాఫ్రికాలో స్థిరపడినయెడల పాశ్చాత్యులు ధ్వంసమగుదురని వారి భయము. దక్షిణాఫ్రికాలోని పాశ్చాత్యులు ఆత్మహత్య చేసుకొనుటకు

సిద్ధముగాలేరు. వారు అట్టి దుస్థితికి తేబడుటకు వారి నాయకులును అనుమతించరు."

యూరపియనులలో ఉత్తమస్వభావముగలవారు చెప్పెడి వాదములను నిష్పక్షపాతముగా ఉదహరించితినని నమ్మెదను. వారివాదములు దొంగవేదాంతములని చెప్పియున్నాను. కాని దానివలన అవి నిరాధారములని సూచించకోరను. కార్యవాదుల దృక్పథమునుండి అనగా సన్నిహితమగు స్వార్థపరత్వమునుబట్టి ఈవాదములో హెచ్చుబలము గలదు. కాని వేదాంతదృక్పథము నుండి ఇవి శుద్ధమైన కపటవాదములు. ఇట్టితీర్మానములను ఏనిష్పక్షపాతబుద్ధిగలవారును అంగీకరించజాలరు. అని నాసవినయమైన అభిప్రాయము. పైవాదములను చెప్పువారు తమ నాగరికతను, యేనిస్సహాయస్థితియందు యుంచుచున్నారో, అట్టిస్థితిలో యేసంస్కృతియు తన నాగరికతను నిలుపడని కూడని సవినయమైన అభిప్రాయము. నేను ఎరిగినంత వరకు, పాశ్చాత్య జాతులు, తూర్పు జాతులతో స్వేచ్ఛగా కలసినయెడల, తూర్పుదేశపు నాగరికత, పాశ్చాత్యనాగరికతయను పెనువాకముందు ఇసుకవలె కొట్టుకొనిపోవునని యే తూర్పుదేశపు సిద్ధాంతియు భయపడుటలేదు. తూర్పుదేశపు ఆలోచనాభావములను నేను గ్రహించినంతవరకు, పాశ్చాత్యనాగరికతతోడ స్వేచ్ఛమైన సంపర్కమును గూర్చి తూర్పుదేశపు నాగరికత భయపడదు సరేగదా, ప్రత్యక్షముగా అట్టి అవకాశమును సన్మానించును. తూర్పుదేశములలో

యెక్కడనైనను వ్యతిరేకనిదర్శనములు ఉన్నయెడల, నేను దెల్పిన సిద్ధాంతమును మార్చజాలవు; యేలనన దీనికిబలకరముగ అనేకనిదర్శనములు యివ్వవచ్చును. అది యెట్లున్నను, పాశ్చాత్యనాగరికతయొక్క బునాది ధర్మముకన్న బలమునకుగల ఆధిక్యతయేయని పాశ్చాత్యసిద్ధాంతులు చెప్పుచుందురు. అందుచేతనే ఆనాగరికత ప్రోత్సహించువారు పశుబలమును కూర్చుటయందు హెచ్చుకాలమును వినియోగింతురు. తమ భౌతికవాంఛలను పెంపుచేయని జాతులు ధ్వంసమగునని ఆసిద్ధాంతులు చెప్పుచున్నారు. ఈసిద్ధాంతముల ననుసరించియే పాశ్చాత్యజాతులు దక్షిణాఫ్రికాలో ప్రవేశించి, స్థిరపడి, సంఖ్యలలో అత్యధికమైన దక్షిణాఫ్రికాజాతులను లోబరుచుకొనిరి. నిరపాయులైన భారతీయులను జూచి యూరపియనులు భయపడుదురనుకొనుట పిచ్చియూహ. ఆశియావాసులనుండి యూరపియనులు భయపడదగిన కారణము లేదని చెప్పువాక్యమునకు శ్రేష్ఠమైన ఋజువు యేదనగా దక్షిణాఫ్రికాలో చేరిన భారతీయులు సర్వకాలమును కార్మికులుగానుండియే పనిచేయుచుండినయెడల, భారతీయప్రవేశమునకు వ్యతిరేకముగా యే ఆందోళనమును ప్రారంభింపబడియుండదు.

ఇక మిగిలియున్న కారణములు వర్తకము రంగు మాత్రమే. భారతీయుల వర్తకము బ్రిటిషుచిల్లరవర్తకులకు గట్టిదెబ్బ కొట్టినదనియు, మెరుపుజాతులయందు యుండు అయిష్టత ఇప్పుడు యూరపియనుల మానసికస్వభావములో

చేరిపోయినదనియు, వేలకొలది యూరపియనులు, తమరు వ్రాసినవ్రాతలలో ఒప్పుకొని యున్నారు. చట్టప్రకారము సమానత్వసిద్ధాంతము అంగీకరించబడిన అమెరికాసంయుక్త రాష్ట్రములలో గూడ శ్రేష్ఠమైన పాశ్చాత్యవిద్యను పొంది క్రైస్తవుడై, ఉత్తమప్రవర్తన కలిగి, పాశ్చాత్యనాగరికతను పూర్తిగా జీర్ణింపచేసుకొనిన, బుక్కరుటీ వాషింగటను వంటి మానవుడు గూడ రూజువెల్టు అధ్యక్షుడు చేయు రాజసభకు అర్హుడని యెంచబడలేదు. నేను కూడ అట్లే ఎంచబడక పోవచ్చును. ' ఆసంయుక్తరాష్ట్రములలోని నీగ్రోలు పాశ్చాత్య నాగరికతను అవలంబించిరి. క్రైస్తవమతమును పుచ్చుకొనిరి. కాని వారి చర్మముయొక్క నల్లరంగే వారినేరముగానున్నది. ఆరాజ్యములో ఉత్తరరాష్ట్రములలో వారిని సాంఘికముగా తృణీకరించినయెడల, తప్పుచేసినట్లు కలిగిన రవంతఅనుమాన ముమీద, దక్షిణరాష్ట్రములలో వారిని బ్రతికియుండగనే తగలపెట్టెదరు.

పైజెప్పిన వేదాంతవాదములలో సారములేదని పాఠకుడు గ్రహించును. కాని ఈ వాదమును చేయువారందరును కపటబుద్ధితో చేయుచున్నట్లు అతడు తీర్మానించుకొనరాదు. వారిలో చాలమంది యీ అభిప్రాయములు ఉత్తమమైనవని న్యాయముగా నమ్ముచున్నారు. వారిస్థితిలో మనమున్న యెడల మనముగూడ అట్టి వాదములనే చేయుట తటస్థించ వచ్చును. మనుజుని ప్రవర్తనయెట్టిదో వాని గ్రహణశక్తియు

గూడ అట్టిదేయని ఇండియాలో నొకసామెతకలదు. మన వాదములన్నియు మన మానసికభావముయొక్క ప్రతిబింబములేననియు, అవి ఇతరులకు నచ్చనియెడల మనము అతృప్తిపడి, ఓర్పునువీడి, కోపమునుకూడ పడుదుమనియు, గ్రహించనివాడు యెవడు?

ఈ సమస్యను కావలెననియే ఇంత వివరములతో చర్చించియుంటిని; యేలనన పాఠకుడు వివిధదృక్పథములును గ్రహించవలెననియు, ఇదివవరకు అట్లు గ్రహించనిపాఠకుడు ఇకముందైనను; అట్లు గ్రహించి గౌరవించు అలవాటును పొందవలెననియు, నాకోరిక. అట్టి విశాలభావమును, అట్టి సహనమును, సత్యాగ్రహమును గ్రహించుటకును, ముఖ్యముగా దానిని ఆచరించుటకును అత్యావశ్యకములు. ఈ గుణములు లేనియెడల సత్యాగ్రహము దుస్సాధ్యము. వ్రాతయందలి కుతూహలముకొరకే నేనీపుస్తకము వ్రాయుటలేదు. దక్షిణాఫ్రికాచరిత్రలోని ఒకభాగమును ప్రజలకు తెలుపుట నాయుద్దేశ్యముకాదు. ఈ పుస్తకము వ్రాయుటలో నాయుద్దేశ్యమేమనగా దేనికై నేను జీవించుచున్నానో, దేనికై నేను జీవించకోరెదనో, దేనికై ఆకోరికతోపాటు చనిపోవుటకు కూడ సిద్ధమని నమ్ముచున్నానో, అట్టి సత్యాగ్రహము యెట్లు ప్రారంభమైనదో, యెట్లు విశాలస్థాయిలో ఆచరించబడినదో, భారతజాతి తెలుసుకొనవలెను.

మన కథకు వత్తము. ట్రాన్సువాలులో క్రొత్తభారతీయులు ప్రవేశించకుండ ఆపుటకును పాతవారు అచ్చగా విసుగుదలతో దేశమువదలిపోవునట్లు నిర్బంధింపగల తగినంత సౌఖ్యవిహీనమైనస్థితిలోనికి వారిని దించుటకును, అప్పటికిని వారు వదలనియెడల, వారిని బానిసత్వమునకు సరిసమానమైన స్థితిలోనికి తెచ్చుటకును, బ్రిటిషుపరిపాలకులు తీర్మానించుకొనిరని మనము చూచియున్నాము. దక్షిణాఫ్రికాలో పెద్ద రాజకీయ ధురంధురులు అని యెంచబడువారు భారతీయులను ఆ దేశములో కట్టెలు కొట్టువారుగను నీరు తోడువారుగను మాత్రమే ఉంచుకొనగలమని అనేకమారులు ప్రకటించిరి. ఆసియాశాఖ ఉద్యోగులలో లైనల్ కర్టిస్, అను వాడొకడుండెను. ఆయనయే ఇండియాలోని ద్వంద్వప్రభుత్వమునకును మతబోధకుడుగా ఇప్పుడు ప్రఖ్యాతినొందెను. అప్పుడితను చిన్నవాడు; మిల్నరు ప్రభువునకు నచ్చినవాడు. అన్నిటిని శాస్త్రీయపద్ధతులప్రకారము చేయుదునని చెప్పువాడు. కాని పెద్దపెద్ద పొరబాట్లు చేయగలవాడు. ఆయనచేసిన ఒకతప్పువల్ల జోహానిస్‌బర్గు పురపాలకసంఘము ౧౪ వేలు పౌనులు నష్టమొందెను. క్రొత్తగా భారతీయుల ప్రవేశమును ఆపదలచిన యెడల, దక్షిణాఫ్రికాలోనున్న పాతభారతీయులందరి నిదర్శనములను ధృవపరుచుట మొదటిపని యని ఆయన సూచించెను. అది జరిగినయెడల ఒకరికిబదులు యింకొకరు మోసముచేసి దేశములోనికి ప్రవేశింపజాలరు. అట్లు ప్రవేశించి

నను వెంటనే తేలికగా కనుగొనవచ్చును. ట్రాన్సువాలులో బ్రిటిషుఅధికారము యేర్పడినపిమ్మట భారతీయులకు ఇచ్చిన అనుమతిపత్రములలో భారతీయుని దస్కతుగాని నిశానిదారు డైనయెడల వాని వేలిముద్రగాని యుండెను. పిమ్మట ఆ భారతీయుని ఛాయాపటముగూడ చేర్చవలెనని యెవరో సూచించిరి. శాసనము అక్కరలేదుగనుక ఉద్యోగరీత్యా ఉత్తరువులవలననే యీ సూచన అంగీకరించబడెను. కాన యీ మార్పు వెంటనే భారతీయనాయకులకు తెలియలేదు. కాలక్రమేణ యీ సంగతులు వారు తెలిసికొనినపుడు వారు అధికారులకు మహజర్లను పంపిరి. భారతీయబృందముల తరఫున రాయబారములను పంపిరి. ఉద్యోగస్తుల వాద మేమనగా: యేదోయొక నీమములేకుండ భారతీయులను దేశములో ప్రవేసించుటకు ప్రభుత్వమువారు ఒప్పుకొనరు. కాన భారతీయులందరును ఒకేవిధమైన అనుమతిపత్రములను సంపాదించుకొనవలెను. సరియైన హక్కుదార్లుతప్ప ఇతరులు దేశములో ప్రవేశించుటకు దుస్సాధ్యముచేయగల వివరములు ఆ అనుమతిపత్రములలో నుండవలెను. చట్టప్రకారము ఇట్టి అనుమతిపత్రము పొందవలసిన నిర్బంధము మాకులేకున్నను, శాంతిసంరక్షణశాసనము అమలులో నున్నంతవరకు ప్రభుత్వము ఇట్లు నిర్బంధపరచవచ్చునని నేను అభిప్రాయపడి యుంటిని. ఇండియాలో ఇండియాడిఫెన్సు ఆక్టువంటిది. ఆ శాంతి సంరక్షణచట్టము అవసరము తీరినపిమ్మటకూడ ప్రజ

లను వేధించుటకు యెట్లు యీ డిఫెన్సుయాక్టు ఇండియాలో నిలుపబడెనో, అట్లే దానిఅవసరము గతించినపిమ్మట చాల కాలమువరకు దక్షిణాఫ్రికాలోని భారతీయులను వేధించుటకై యీ శాంతిరక్షణశాసనము అమలులోనుంచబడెను. యీారపియనులకు సంబంధించబడినంతవరకు అది చచ్చినచట్టమే. అనుమతిపత్రములను పొందవలసివచ్చినయెడల దానిలో మనుజుని గుర్తించగల గుర్తులుండవలెను. కాన నిశానిదారులు వేలిముద్రలు వేయుటలో తప్పులేదు. చాయాపటములను చేర్చుట నాకిష్టములేదు. మరియు మహమ్మదీయులకు దీనిని గూర్చి మతవిషయకమైన ఆక్షేపణలుండెను.

భారతీయబృందమునకును అధికారులకును జరిగిన రాయబారముయొక్క పర్యవసానమేమనగా, భారతీయులు క్రొత్త అనుమతి పత్రములను పొందుటకు సమ్మతించిరి. క్రొత్తగా ప్రవేశించువారు గూడ ఆక్రొత్త అనుమతి పత్రములను పొందవలెనని అనుమతించిరి. చట్టప్రకారము ఇట్లు చేయవలసిన అవసరములేకున్నను, ఐచ్ఛికముగా ఇట్లు మరల ధృవపర్చుకొనుటకు వారు అంగీకరించిన కారణములు యేమనగా, తమమీాద క్రొత్తనిర్బంధములు పెట్టబడవని ఆశ ఒకటి; అక్కడనున్న భారతీయులు క్రొత్తవారిని అక్రమముగా పెట్ట దలచలేదని దెలియపరుచుట ఇంకొకటి. క్రొత్తగా వచ్చువారిని వేధించుటకై శాంతిసంరక్షణశాసనము ఉపయోగింపబడకపోవచ్చునను ఆశ మరియొకటి. సుమారుగా అందరు

భారతీయులును పాత అనుమతిపత్రములను మార్చి క్రొత్తవి పుచ్చుకొనిరి. ఇది స్వల్పమైన అంశము గాదు. చట్టప్రకారము బాధ్యత లేకున్నను, భారతీయసంఘమంతయు ఒక్క మనుజుని వలె అతిశీఘ్రముగా మరల నిదర్శనములను ధృవపరుచుకొనిరి. వారిసత్యము, చాతుర్యము, ఔదార్యము, సామాన్యజ్ఞానము, నమ్రభావము, దీనివల్ల ఋజువయ్యెను. ట్రాన్సువాలులో అమలులో నున్న యేచట్టమును యేవిధముగాను ఉల్లంఘించు కోరిక వీరికి లేదనికూడ దీనివల్ల తేలెను. ప్రభుత్వముతో తాము మర్యాదగా ప్రవర్తించినయెడల ప్రభుత్వముకూడ అట్లే ప్రవర్తించుననియు, తమను గౌరవించుననియు, తమకు క్రొత్తహక్కుల నిచ్చుననియు, భారతీయులు నమ్మిరి. ఈ మర్యాదకరమైన మహత్కార్యమునకు ట్రాన్సువాలులోని బ్రిటిషు ప్రభుత్వమువారు యెట్లు సత్కరించినదియు వచ్చే అధ్యాయములో చూతుము.

---

## 11వ అధ్యాయము

## నెమ్మదికి బహుమతి-నల్ల చట్టము

---

ఈ ధృవపరుచుట పూర్తియగువరకు ౧౯౦౩ సం॥ చాలభాగము గడిచెను. ౧౯౦౩ లో ట్రాన్సువాలుకు తిరిగి ప్రవేశించితిని. ఆసంవత్సరము మధ్యకాలమున జోహనిస్సుబర్గులో కార్యస్థానము పెట్టితిని. ఆశియాశాఖవారు చేయు

చున్న అక్రమములను నిరోధించుటకే రెండు సంవత్సరములు పట్టెను. ఇట్లు ధృవపర్చినయెడల ప్రభుత్వము తృప్తిపొందునని మేమందరము ఆశించితిమి. కొంతకాలము శాంతముగా గడుపవచ్చునని నమ్మితిమి. కాని అది తటస్థించకపోయెను. పాఠకునికి లయనల్ కర్టిసుతో ఇదివరకే పరిచయము చేయబడెను. భారతీయులు పాతపత్రములను మార్చి క్రొత్తవి తీసుకొనినంతమాత్రముచేత యూరపియనుల ఆదర్శము నెరవేరలేదని యీపెద్దమనుష్యుడు అభిప్రాయపడెను. సరస్పరసమాధానముతో పెద్దపనులు నెరవేరుట ఈయనదృష్టిలో చాలకుండెను. ఈ చేసినపనులకు చట్టముయొక్క బలముండవలయుననియు, దీనిలోని సిద్ధాంతము సర్వకాలము స్థిరపడవలెననియు, యీాయన అభిప్రాయపడెను. దక్షిణాఫ్రికా అంతను ఆకర్షించ తగినవియు, సామ్రాజ్యములోని ఇతరభాగములు ఆదర్శములుగా అనుసరించదగినవియు అగు నిర్బంధములను పెట్టవలెనని ఈయన కోరెను. దక్షిణాఫ్రికాలో యేచిన్నహాంశములోనైనను భారతీయులకు సందుదొరకినయెడల, ట్రాన్సువాలు సురక్షితము అయినట్లు ఈయన యెంచడు. మరియు కర్టిసు భారతీయబృందప్రతిష్ఠను అణచివేయుదలచగా, ఉభయుల సమ్మతిమీాద జరిగిన ధృవపత్రములవలన వీరి మర్యాద పెరుగునట్లుండెను. భారతీయ అభిప్రాయమును తనకు అనుకూలముగా చేసుకొనుటకు యీాయన లక్ష్యముచేయడు. కఠినమైన శిక్షలతో గూడిన చట్టయుతమైన నిర్బంధములను పెట్టి

మేము లొంగునట్లు భయపెట్టదలచెను. కాన ఆశియా చిత్తుచట్ట మొకదానిని తయారుచేసెను. తన చిత్తుచట్టము అంగీకరించ నంతవరకు, భారతీయులు దొంగతనముగా ట్రాన్సువాలులో ప్రవేశింపకుండ ఆపుటకు గాని, హక్కులేకుండ ప్రవేశించిన వారిని తొలగించుటకుగాని, ఇదివరకుయున్న శాసనములలో తగినయేర్పాట్లు లేవని ఆయన ప్రభుత్వమునకు సలహా చెప్పెను. ప్రభుత్వమువారు ఈయన వాదములను ఉత్సాహముతో నంగీకరించిరి. వారి శాసనసభలో ప్రవేశపెట్టుటకై ట్రాన్సు వాలు ప్రభుత్వపు గెజటులో ఒక చిత్తుచట్టమును ప్రకటించిరి.

ఈ చట్టముయొక్క వివరములలోనికి దిగుటకుముందు, కొద్దిమాటలలో ఒకముఖ్యాంశమును పరిష్కరించుట మంచిది. సత్యాగ్రహోద్యమమునకు నేను కారకుడను గనుక నాజీవిత ములో కొన్ని అంశములను పూర్తిగా అర్థము చేసుకొనుటకు, ఈవిషయము తెలుసుకొనుట అవసరము. ట్రాన్సువాలులో భారతీయులమీద క్రొత్తనిర్బంధములను పెట్టుటకై యత్నము చేయుచుండు ఈసమయముననే నేటాలులో జూలూ విద్రో హము సంభవించెను. అప్పుడు సందేహించితిని ఇప్పటికిని సందేహించుచున్నాను. (ఆతిరుగుబాటును విద్రోహము అన వచ్చునా లేదా యని) కాని నేటాలులో యెల్లప్పుడును దాని నట్లే వర్ణించుచున్నారు. బోయరు యుద్ధములోవలెనే నేటాలు లోని యూరపియనులు అనేకులు ఐచ్ఛికముగా సేనలో చేరిరి. నేనుకూడ నేటాలు వాసుడనని యెంచబడుచుండుటను బట్టి

యీ యుద్ధములో, నాశక్తికొలది సహాయము చేయవలెనని తలచితిని. భారతీయబృందము వారి అనుమతిని బొందితిని. సేనతోయుండి సేవజేయుటకు మొత్తముతా నొక దానిని యేర్పరుతునని ప్రభుత్వమునకు వ్రాసితిని. ప్రభుత్వమువారు అంగీకరించిరి. జోహానిస్బర్గులో నాకాపురము యెత్తివేసితిని. నేటాలులోని ఫొనీక్సుకు నాకుటుంబమును పంపితిని. అచట నా సహచరులు చేరియుండిరి. అచటనుండియే ఇండియన్ ఒపీనియన్ అను వార్తాపత్రిక ప్రకటింపబడుచుండెను. హెచ్చుకాలము దూరముగ నుండనని తెలిసినందున నా కార్యస్థానము పూర్తిగ యెత్తివేయలేదు.

౨౦-౨౫ మంది మనుజులతో నేను సేనలో జేరితిని. ఈచిన్న ముఠాలో కూడ, ఇండియా రాష్ట్రములలో హెచ్చు రాష్ట్రీయుల ప్రజలు చేరియుండిరి. ఒక నెలరోజులు గట్టిగా పని చేయవలసివచ్చెను. అప్పుడు మాకు లభించినపనికి యెప్పటికిని దైవమునకు కృతజ్ఞుడను. మేము సేవ చేయనియెడల ఆగాయ పడిన జూలూలకు వేరె దిక్కుండదని మేము కనుగొంటిమి. వారి గాయములకు కట్లుకట్టుటకు యే యూరపియనుడును సహాయము చేయడు. ఉపచారసంఘమునకు అధికారిగానున్న శావేజ్ అను వైద్యుడు స్వయముగా మిక్కిలి దయగలవాడు. వైద్యశాలకు గాయపడినవానిని చేర్చినపిమ్మట వారికి ఉపచారముచేయుట మాపనిగాదు. మాకర్తవ్యము అయినను కాకపోయినను శక్తికొలది సేవచేయుటకు మేము చేరియుంటిమి.

జూలూలుకు సేవ చేయుమని యూరపియనులకు తాను నచ్చ చెప్పలేకపోతిననియు, వారిని నిర్బంధించుటకు తనకు అధికారము లేదనియు, యీ దాక్షిణ్యకృత్యమునకు మేము పూనినయెడల తాను సంతోషింతుననియు, ఆవైద్యుడు మాతో చెప్పెను. మేము ఇది చేయుటకు మిక్కిలి సంతసించితిమి. అయిదు ఆరు రోజులనుండి కట్లు కట్టబడక, అందుచే చెడుకంపు కొట్టుచున్న కురుపులను మేము కడగవలసివచ్చెను. మేము ఆపనికి ఇష్టపడితిమి. ఆజూలూలు మాతో మాట్లాడజాలరు. కాని వారి అభినయములవల్లను, వారి కన్నులలో కనుపరచిన భావములవల్లను, వారి సహాయమునిమిత్తము మమ్ము దేవుడే పంపించినట్లు వారు తలచిరి.

మేము చేసినపని మిక్కిలి కఠినముగా నుండెను. ఏలనన ఆనెలలో అప్పుడప్పుడు రోజుకు ౪౦ మైళ్లు కూడ నడవవలసి వచ్చెను.

ఒకనెలలో యీముతాను విడిచిపెట్టిరి. వారి లేఖలలో మాపనిని ఉదహరించిరి. అపుడు ప్రత్యేకముగా కొట్టబడిన పతకములను ప్రతివారికిని యిచ్చిరి. వందనములు తెలుపుచు రాష్ట్రపాలకుడు ఉత్తరము వ్రాసెను. దీనికి నాయకులు ముగ్గురు గుజరాతీలు. ఉమాశంకర్ మంచారాంసేలట్, సురేంద్రరాయి బాబుభాయి, మేఢ్ హరిశంకర్ ఈశ్వర్ జోషి; ముగ్గురును మంచి దేహపటుత్వము గలిగి పనిచేసిరి. తక్కిన భారతీయుల పేర్లు ఇప్పుడు జ్ఞాపకములేవు. కాని వారిలో ఒక్క పఠాను

ఉన్నట్లు బాగా జ్ఞాపకము. వానితోపాటు సమానమైన బరువు మోయుచు, వానికంటె ముందుగా మేము నడుచుచుండుట చూచి అతను ఆశ్చర్యపడుచుండెడివాడు. ఈ ముఠాతో పనిచేయుచుండగా అదివరకు నామనసులో తేలియాడుచున్న రెండు అభిప్రాయములు గట్టిగా స్థిరపడెను. ౧ పూర్తిగా సేవకే తనజీవితమును వినియోగించ తలచినవాడు బ్రహ్మచర్యము తప్పక జరుపవలెను. ౨ జీవితాంతమువరకు దారిద్ర్యమును యెడతెగని నెచ్చెలిగా స్వీకరించవలెను. హీనాతిహీనమైన పనులను పూనుటకుగాని, అత్యంత ఆపదలను కలిగించు పరిస్థితులలో తెగువతో ప్రవేశించుటకుగాని, ఆటంకమయ్యెడి లేదా వెనుకంజవేయించెడి యేవృత్తిని తాను పెట్టుకొనరాదు.

నేను యీ ముఠాతో సేవచేయుచుండగనే, ట్రాన్సువాలు వెంటనే నన్ను రమ్మనమని వుత్తరములును తంతివార్తలును వచ్చి పడుచుండెను. కాన యుద్ధమునుండి తిరిగి రాగానే ఫోనిక్సు స్నేహితులను ఒక్కపరి కలసి వెంటనే జోహాన్సుబర్గు చేరితిని. అచ్చట పైచెప్పిన చిత్తుచట్టము చదివితిని. ౧౯౦౬ సం॥ ౨౨ అగష్టు తేదీగల ప్రభుత్వగజెట్టు అసాధారణసంచికలో యీచిత్తుచట్టము ప్రచురించబడి యుండెను. దానిని కార్యస్థానమునుండి ఇంటికి తీసుకొనిపోతిని. ఇంటివద్దయుండే ఒక కొండమీదికి ఒక స్నేహితునితో కూడ కలసిపోయి, ఇండియను ఒపీనియనులో ప్రకటించుటకు గుజ

రాతిలోకి తర్జుమాచేయ మొదలుపెట్టితిని. దానిలోని సూత్రములను ఒకటి పిమ్మట ఒకటి చదువుచుండగా నాదేహము కంపమెత్తెను. భారతీయులయెడ ద్వేషముతప్ప మరేమియు అందులో కనుపడలేదు. ఆచట్టమే మంజూరుఅయి భారతీయులుమెల్లగా అంగీకరించినయెడల, దక్షిణాఫ్రికాలోని భారతీయులకు సంపూర్ణనాశనము కలుగునని నాకు తోచెను. ఇది ప్రాణాపాయకరమైన సమస్యయని నాకుస్పష్టముగా కనుపడెను. మహాజరులును విజ్ఞాపనములును వృథయైనను, భారతీయ బృందము చేతులుముడుచుకొని కూర్చుండరాదని నాకుతట్టెను. ఇట్టి చట్టమునకు లొంగుటకన్న చావే మేలు. కాని మేము యెట్లు చావవలెను? యేపని చేసిన యేపనికి సాహసించిన జయమో, మరణమో, తప్ప మరొకటి కనుపడని స్థితికి రాగలము? దుర్భేద్యమైన గోడ నాముందు యున్నట్లుగా తోచెను. దానిగుండ అవతలిదోవ నేను చూడలేకపోతిని. నాకింత దుర్భరవేదనను కలిగించిన ఆచిత్తుచట్టముయొక్క వివరమును పాఠకులకు తెలుపవలెను. దానిసంగ్రహమిదుగో.

ట్రాన్సువాలులో నివసించుటకు హక్కుగల యెనిమిది యేండ్లుగాని అంతకుమించిన ప్రతిభారతీయుడు స్త్రీ పురుషుడు బిడ్డ ఆసియావాసుల రిజిష్ట్రారువద్ద తనపేరును ధృవపరచి ధృవపత్రమును పొందవలెను.

ధృవపత్రమునుపొందు దరఖాస్తుదారులు రిజిష్ట్రారుకు తమప్రాత అనుమతిపత్రములను ఇవ్వవలెను. తమదరఖాస్తులో

తమ పేరు, నివాసగ్రామము, కులము, వయసు మొదలుగునవి నమోదుచేయవలెను. గుర్తించుటకు తగిన ముఖ్యగుర్తులను దరఖాస్తుదారుని శరీరమున గమనించి రిజిస్ట్రారు వ్రాసు కొనవలెను. అతనియొక్క బొటనవ్రేళ్ల ఇతరవ్రేళ్ల ముద్రలను తీసుకొనవలెను. ఒకానొక తేదీలోపల ఇట్టి దరఖాస్తు పెట్టని వారు ట్రాన్సువాలులో కాపురముండుహక్కును పోగొట్టు కుందురు. దరఖాస్తుపెట్టకపోవుట చట్టప్రకారము నేరముగా తలపబడును. దానికై న్యాయస్థానమువారి ఇష్టప్రకారము జరిమానా, ఖైదు, లేక ప్రవాసశిక్ష విధించవచ్చును. పౌగం డుల తరఫున తలిదండ్రులే దరఖాస్తు పెట్టవలెను. వారలను గూడ రిజిస్ట్రారువద్దకు తెచ్చి ముద్రలు యిప్పించవలెను. తమమీదపెట్టిన కర్తవ్యమును వారు నిర్వహించనియెడల, ఆపౌగండునికి పదహారుసంవత్సరములు రాగానే, అతనే దానిని నిర్వహించవలెను. అతను అట్లుచేయక తప్పిపోయినయెడల దలిదండ్రులకు వేయదగినశిక్షలకు, తాను లోనుగావలసి వచ్చును. ఎప్పుడు యెక్కడ అడిగినను పోలీసుయుద్యోగస్తు నకు ఈ ధృవపత్రము చూపవలెను. అట్లు చూపకపోయిన యెడల, అది యొకనేరము. దానికి జరిమానా ఖైదు విధించ వచ్చును. రాజమార్గములలో తిరుగువారినిగూడ ధృవపత్రము చూపుమని అడగవచ్చును. ధృవపత్రమును తనిఖీచేయుటకు పోలీసుఉద్యోగస్తులు వ్యక్తులఇండ్లలో ప్రవేశింపవచ్చును. ఇతరరాష్ట్రములోనుండి ట్రాన్సువాలులో ప్రవేశించు భారతీ

యులు అచ్చట పారాచేయుచున్న ఉద్యోగికి ధృవపత్రము చూపవలెను. పనిమీద న్యాయస్థానములకు వెళ్లినపుడును వర్తకమునకుగాని ద్విచక్రి (బైసికిల్) కి గాని అనుమతి పొందుటకు కచ్చేరీలకు బోయినపుడును, కోరబడినయెడల ధృవ పత్రము చూపవలెను. అనగా యేప్రభుత్వకచ్చేరినైనను దాని అధికారమునకు లోబడినపనిని చేయుమని భారతీయుడు కోరిన యెడల, ఆ కోరికనంగీకరించకముందు అచ్చటి ఉద్యోగస్తుడు ధృవపత్రముం జూపమనికోరవచ్చును. ధృవపత్రము చూపక పోవుట, చట్టప్రకారము నియమింపబడిన గుర్తింపుసాక్ష్యమును మొదలగు వివరములను ఇవ్వకపోవుటగూడ నేరములు; వానికి ఖైదు జరిమానా విధించవచ్చును.

ప్రపంచములో యేభాగములో కాని స్వాతంత్ర్యముగల వారిమీద ఇట్టి చట్టము ప్రయోగింపబడినదని నాకెన్నడును తెలియదు. నేటాలులో కరారు కార్మికులకు అనుమతి పత్రముల విషయమై కఠిననీమములు గలవని నాకు తెలుసును. కాని యీదౌర్భాగ్యులను స్వాతంత్ర్యము గలవారని యెంచుటకే వీలులేదు. అయినను వారిమీద అమలుజరుపు చట్టములుకూడ పైచెప్పిన చిత్తుచట్టముతో పోల్చినయెడల సులభతరమనియే చెప్పవలెను. ఆచట్టములు విధించు శిక్షలు యీచిత్తుచట్టముక్రింది శిక్షలతో పోల్చినయెడల దోమకాటనియే వర్ణించవలెను. ఈచట్టప్రకారము లక్షలుకొలది ఆస్తిగల వర్తకుడు ప్రవాసములోకి పంపబడి పూర్ణముగా

ధ్వంసము కావచ్చును. ఈచట్టనియమములు కొన్నిటిని ఉల్లంఘించినందుకు ప్రజలు యెట్లు ప్రవాసమునకు పంపబడిరో ఓపికగల పాఠకులు మున్ముందు చూడగలరు. ఇండియాలో నేరస్థులైన జాతులపై విధించబడిన కఠినశాసనములు కలవు. వానితో యీచట్టమును తేలికగా పోల్చవచ్చును. ఆపోలికవల్ల దీనికి లోపము వాటిల్లదు. ఈచట్టము విధించిన వ్రేలిముద్రలు ఇచ్చు నియమము దక్షిణాఫ్రికాలో మిక్కిలి క్రొత్తవిషయము. దీనినిగూర్చిన గ్రంథములను చదువ నుద్దేశించి ఒక పోలీసు ఉద్యోగస్తుడు హెన్రి యనువాడు వ్రేలిముద్రలమీాద వ్రాసిన గ్రంథమును చదివితిని. నేరస్థులదగ్గరనే చట్టప్రకారము వ్రేలిముద్రలు తీసుకొనబడునని దానివల్ల నాకు తెలిసెను. ఇట్లు నిర్బంధముగా వ్రేలిముద్రలను తీసుకొను నియమమువలన నేను కంపమొందితిని. మరియు స్త్రీలయొక్కయు, పదహారుయేండ్లకు లోబడిన బిడ్డలయొక్కయు ధృవపర్చుటను మొదటిపర్యాయము, ఈచట్టము విధించెను.

మరునాడు భారతీయుల ప్రముఖులయొక్క ఒక చిన్న సభ జరుపబడెను. వారికి చట్టములోని ప్రతిమాటను నేను వివరించి చెప్పితిని. నాకు కంపము కలిగినట్లే వారికిని కంపము కలిగెను. వారిలో నొకడు ఉద్రేకముతో నిట్లు చెప్పెను. "ఎవడైనను నాభార్యను ధృవపత్రము ఇమ్మని అడిగినయెడల వానిని అప్పుడే తుపాకిపెట్టి కాల్చెదను. ఆఫలితముల ననుభవించెదను." వానిని నేను శాంతపరచితిని, సభలో ఇట్లు

చెప్పితిని. "ఇది మిక్కిలి తీవ్రమైన క్లిష్టసమయము. ఈచట్టము మంజూరై మనము దానికి సమ్మతించితిమా దక్షిణాఫ్రికా మొత్తముమీద ఇది అనుసరింపబడును. దక్షిణాఫ్రికాలో మన ఉనికిని కుంకుటివేరుతో తెగగొట్టుటకు ఇది ఉద్దేశింపబడినట్లు తోచుచున్నది. ఈదేశములోనుండి వేటాడి మనలను బైటకుపంపుటకు ఇది ఆఖరుమెట్టుగాదు మొదటిమెట్టే. కాన ట్రాన్సువాలులో నున్న ౧౦, ౧౫ వేల భారతీయుల యొక్కయేగాక దక్షిణాఫ్రికాలో నున్న యావన్మంది భారతీయుల యొక్కయు క్షేమమునకు మనము జబాబుదారి వహించవలెను. మరియు ఈచట్టము యొక్క అంతర్భావములను మనము పూర్తిగా గ్రహించిన యెడల ఇండియా యొక్క గౌరవము గూడ మనచేతిలో నున్నదని గ్రహించగలము. ఏలనన, మనలనే గాక మన మాతృదేశమును గూడ అవమానించుటకు యీచట్టము ప్రయత్నించుచున్నది. నిర్దోషులకు పతనము కలిగించుటయే మాతృదేశమునకు కలిగెడు అవమానము. ఇట్టి అవమానము పొందుటకు తగినపనిని మనము చేసినాము అని యెవరుచెప్ప సాహసించరు. మనము నిర్దోషులము. ఒకజాతిలోని ఒకనిర్దోషసభ్యుని, నిందించిన యెడల ఆజాతినంతయు నిందించినట్లే, కాన తొందర, అసహనము, కోపముపడుట ఇప్పుడు తగదు. అది మనను ఈదాడినుండి రక్షించదు. శాంతముగా విచారించి, సకాలమున, నిరోధకార్యములను జరిపి, ఆనిరోధమునకు ఫలితముగా కలిగెడి

కష్టములను ఐకమత్యముతో యెదుర్కొని, సహించినయెడల, దైవము మనకు సహాయము చేయును. అక్కడ యున్నవారందరును పరిస్థితుల తీవ్రతను గ్రహించిరి. బహిరంగసభ చేయుటకును, అచట కొన్ని తీర్మానములను అంగీకరించుటకును, నిర్ణయించుకొనిరి. యూదుల నాటకశాల అందుకై అద్దెకు తీసుకొనబడెను.

---

## 12 వ అధ్యాయము

## సత్యాగ్రహ ప్రవేశము

౧౧-౯-౧౯౦౬ తేదీన సభ సవ్యముగా జరుపబడెను. ట్రాన్సువాలులోని వివిధప్రదేశములనుండి ప్రతినిధులువచ్చిరి. కాని అచ్చట నాసహాయముతో వ్రాయబడి మంజూరుకాబడిన తీర్మానములయొక్క అంతర్భావముల నన్నిటిని అప్పుడు నేనైనను పూర్తిగా గ్రహించలేదని ఒప్పుకొనక తప్పదు. ఆతీర్మానములనుండి వెల్వడు పర్యవసానములలోనుండిన సాధ్యతలను నేను గమనించియుండలేదు. ఆప్రాతసామ్రాజ్య నాటకశాల నేలనుండి కప్పువరకును నిండిపోయెను. ప్రతివాని మొగము మీదను యేదియో విశేషము జరుపబడునని గాని, లేక సంభవించునని గాని, ఆశ కనుపడుచుండెను. టీ. బీ. భా. సం. అధ్యక్షుడైన అబ్దుల్‌గని సభాధ్యక్షుడుగా నుండెను. ట్రాన్సువాలులో మొదటినుండి యుండియున్న కాపురస్థులలో

ఈయన ఒకరు. ప్రసిద్ధులైన మమద్ ఖసం కమ్రుద్దీన్ వర్తక సంఘము యొక్క భాగస్థుడును, దానితాలూకు జోహానిస్బర్గులోని శాఖకు నిర్వాహకుడును అయియుండెను. ఆనాడు చేసిన తీర్మానములలో కెల్ల ముఖ్యమైనది ప్రఖ్యాతమైన నాల్గవతీర్మానము. తాము ప్రకటించు విరోధభావమునంతను తృణీకరించి ఆచిత్తుచట్టము మంజూరైనయెడల, దానికిలొంగ కూడదనియు, అట్లు లొంగనందున గలిగెడి సమస్త శిక్షలకును ఓర్చుకొనవలెననియు భారతీయులు ఆతీర్మానము క్రింద శపథములు చేసిరి.

నేను ఈతీర్మానమును సభవారికి పూర్తిగా వివరించితిని. శాంతముగా వినిరి. సభాకార్యక్రమము హిందీలోను లేక గుజరాతీలోను నడుపబడెను. కాన అచ్చట హాజరైనవారు ఆకార్యము తెలిసికొనలేకపోవుట అసాధ్యము. హిందీ తెలియని అరవలు ఆంధ్రులనిమిత్తము, ఆయాభాషలలో యుపన్యాసకులు ప్రతివిషయమును పూర్తిగా వివరముతో చెప్పిరి. ఆతీర్మానమును అనేకమంది యుపన్యాసకులు సవ్యముగా ఉపపాదించి ఆమోదించి బలపరచిరి. వారిలో సేట్ హాజీ హాబీబ్బు ఒక ఉపన్యాసకుడు. ఆయనకూడ దక్షిణాఫ్రికాలో పురాతన అనుభవముగల నివాసి. ఉత్సాహపూరితమైన ఉపన్యాసము చేసెను. ఆయన హృదయము మిక్కిలి పొంగిపోయెను. ఆయన యెంతవరకు పోయెననగా, దైవమును సాక్షిగా నుంచుకొని మనము యీతీర్మానము మంజూరు

చేయవలెననియు ఇట్టి అవమానకరమైన శాసనమునకు పిరికి పందలవలె యెన్నడును లొంగరాదనియు ఆయన వచించెను. అంతట తానీచట్టమునకు యెన్నడు లొంగనని దైవము పేర సాక్షిగా గంభీరముగా ప్రకటించెను. హాజరైనవారందరును అట్లే చేయవలెనని సలహా నిచ్చెను. తీర్మానములు బలపర చుచు ఇతరులుకూడ గంభీరమైనట్టియు, కోపముతో కూడి నట్టియు యుపన్యాసములు చేసిరి. సేట్ హాజీ, తన ఉపన్యా సములో ఈ ప్రతిజ్ఞాప్రకటన చేసినపుడు తక్షణమే నేను త్రుళ్లి పడితిని. మేలుకొని జాగ్రతపడితిని. అప్పుడే నా బాధ్యతను భారతీయబృందముయొక్క బాధ్యతను పూర్తిగా నేను గ్రహించితిని. భారతీయబృందము ఇదివరకు అనేకతీర్మాన ములు చేసియుండెను. దరిమిలా గలిగిన ఆలోచనలవల్లగాని, అనుభవములవల్లగాని వానిని సవరించి యుండెను. కొన్ని తీర్మానములను తత్సంబంధీకులు అందరును ఆచరించనవియు కలవు. ప్రపంచములో నంతటను ప్రజాహితజీవితములో ఇట్టి అనుభవము సామాన్యము. తీర్మానములను చేయుట, సవరిం చుట, వానిని అంగీకరించినవారే ఆచరించకపోవుట, కాని యిట్టి తీర్మానములలోనికి దేవునిపేరు యెవరును తీసుకొని రారు. ఒక తీర్మానమునకును, దేవునిపేర చేసిన ఒకప్రమాణ మునకును, తత్వరీత్యా భేదముండజనదు. బుద్ధిమంతుడు హృదయపూర్వకముగా ఒక తీర్మానము చేసినపుడు దాని నుండి వెంట్రుకవాసియైనను పైదొలగడు. దేవునిసాక్షిగా

చేసిన శపథమెట్లో వానికి యీతీర్మానమును అంతముఖ్యమే. కాని ప్రపంచకము యీతత్వసిద్ధాంతములను గ్రహించదు. సామాన్య తీర్మానమునకును, దేవునిపేర ప్రమాణమునకు, ఉత్తరధృవ, దక్షిణధృవములయంతదూరమున్నదని యూహింతురు. సామాన్యతీర్మానముచేసిన మానవుడు దానినుండి పైతొలగినపుడు ఆయన తననుచూచి లజ్జపడడు. కాని ప్రమాణముచేసి భంగపరచినవాడు తనంతటతాను లజ్జపడుటయే గాక సంఘమువల్ల పాపిగా చూడబడును. ఈకల్పితభేదము మానవుల మనస్సులో మిక్కిలిలోతుగా వేరునాటుకొని యున్నది. కాన న్యాయమూర్తి యెదుట ప్రమాణముమీద కైఫియ్యదు ఇచ్చినవాడు అది అబద్ధమని ఋజువు అయిన యెడల చట్టప్రకారము నేరము చేసినవాడుగా యెంచబడును. కఠినముగా శిక్షించబడును.

ఇట్టి భావముతో నిండియున్న నేను, ప్రమాణముల యొక్క అధిక అనుభవము కలిగి వానివల్ల లాభముపొందిన వాడనగుటచేత హాజి హబీబ్బు ప్రమాణము చేయవలెనని సూచించినపుడు ఒక్కమారు జంకితిని. ఒక్కనిమిషములో దీని సాధ్యాసాధ్యములను, యోచించుకొంటిని. నాసందిగ్ధము మారి ఉత్సాహమేర్పడెను. సభకువెళ్లినపుడు, నేను ప్రమాణముచేయు ఉద్దేశ్యముగాని, ఇతరులను చేయమనికోరు తలంపుగాని నాకు లేకపోయినప్పటికిని, సేట్ సలహాను కుతూహలముతో ఆమోదించితిని. కాని ప్రమాణముయొక్క

అర్థము పూర్తిగా సభ్యులకు వివరించవలెననియు, దాని ఫలితములను సమస్తమును వారికి తెలుపవలెననియు, నాకు అప్పుడేతోచెను. ఆసమయమునందే వారు ప్రమాణముచేయుటకు అంగీకరించినయెడల, వారిని ప్రోత్సాహపరచవలెను. లేదా వారు చివరపరీక్షకు ఇంకా తయారుకాలేదని, అర్థము చేసుకొనవలెను. కాన హాజీ సలహాయొక్క ఆంతర్యమును సభకు వివరించుటకు అనుమతినిమ్మని సభాధ్యక్షుని కోరితిని. ఆయన తక్షణమే అంగీకరించెను, నేను మాట్లాడుటకు లేచి నిలువబడితిని. నాకు జ్ఞాపకమున్నంతవరకు అప్పటిభావముల సారాంశము ఈక్రింద తెలుపుచున్నాను.

" ఈతీర్మానమునకును, నేటివరకు మనముచేసిన ఇతర తీర్మానములకును విస్తారమైన భేదముకలదనియు, యీతీర్మానములు చేయుపద్ధతిలోకూడ మిక్కిలి తేడాగలదనియు, ఈసభకు వివరించకోరెదను. నేడు మనముచేయునది మిక్కిలి ముఖ్యమైన తీర్మానము. దక్షిణాఫ్రికాలో మన ఉనికియంతయు దానిని మనము పూర్తిగా ఆచరించుటకై ఆధారపడియుండును. ఈ మనస్నేహితుడు తీర్మానముచేయుటకు సూచించిన విధానము క్రొత్తదియును, మత సంస్కార స్వభావముగలదియును, అయియున్నది. ఈతీర్మానమును యీరూపమున మంజూరుచేయించు యుద్దేశ్యముతో నేను యీసభకురాలేదు. ఈసలహాచెప్పిన గౌరవము సేట్ హాజీ హాబూబ్బుకు చెందుచున్నది. అతనిమీద బరువైన బాధ్యతను గూడ పెట్టుచు

న్నది, అతనిని నేను అభినందించుచున్నాను. అతని సలహాను మిక్కిలి మెచ్చుకొనుచున్నాను. దీనిని మీరు అనుసరించిన యెడల, ఆయన బాధ్యతను మీరు కూడ పంచుకొందురు. ఆబాధ్యత యేమియో మీరు గ్రహించవలెను. భారతీయ బృందమునకు సలహాదారుడను, సేవకుడను, గాన మీకు దానిని పూర్తిగా వివరించుట నాకర్తవ్యము.

హిందూమతములోను మహమ్మదీయ మతములోను, గల పేర్ల భేదముల నట్లుంచిన యెడల, మనమందరము సమానమైన దేవుని ఒకనినే నమ్ముచున్నాము. మనము ప్రతిజ్ఞ చేయుటగాని దేవునిపేరగాని లేదా ఆయన సాక్షిగాగాని, ప్రమాణముచేయుట పరిహాసించతగిన అంశము కాదు. మనము ప్రమాణముచేసి దానిని భంగపరిచినయెడల మానవుడు దేవుడు ఇద్దరిదృష్టియందుగూడ నేరస్థులమగుదుము. హృదయ పూర్వకముగా, వివేచనజ్ఞానముతో, ప్రతిజ్ఞ చేసినపిమ్మట, భంగపరచినవాడు, మానవత్వమును కోలుపోవుచున్నాడని నాస్వంతఅభిప్రాయము. రాగినాణెముపై పాదరసముపోసిన యెడల, అది కనిపెట్టబడినపుడు యెట్లువిలువలేనిది అగుటయే గాక దానిఖామందును శిక్షార్హునిగా యెట్లుచేయునో, అదే విధముగా తేలికగా ప్రమాణముచేసి, దానిని భంగపరచిన వాడు, గడ్డిపరకయగుచున్నాడు. ఇక్కడను పరలోకమున గూడ శిక్షకు అర్హుడుఅగుచున్నాడు. అట్టి తీవ్రస్వభావము గల ప్రమాణముచేయుడని హాజీ హాబీబ్బు సలహా చెప్పు

చున్నాడు. పసివాడనిగాని బుద్ధిహీనుడనిగాని చెప్పదగిన వాడు యీ సభలో లేడు. మీరు అందరు బాగా వయసు ముదిరినవారు, లోకమును చూచినవారు. మీలో అనేకులు ప్రతినిధులు, కొంచెముగనో గొప్పగనో బాధ్యతను నిర్వహించినవారు. కాన యీ ప్రమాణము తీసుకొనునపుడు, తానుచేయునది యేదియో, తనకు తెలియదని చెప్పుటచేత, నేడుహాజరైనవాడు యెవడును తప్పించుకొనజాలడు. అట్లు తలపెట్టనుజాలడు.

ప్రతిజ్ఞలను ప్రమాణములను అరుదుగానే తీసుకొనుచున్నారనియు, తీసుకొనవలెననియు, నేనెరుగుదును. మాటిమాటికి ప్రమాణముచేయువాడు తప్పకదెబ్బతిని పడిపోవును. దక్షిణాఫ్రికాలోని భారతీయబృందముయొక్క చరిత్రలో ప్రమాణము తీసుకొనుటకు యుక్తమైన స్థితిని నేను యూహించగలిగినయెడల, ఆ క్లిష్టసమయము నిశ్చయముగా ఇపుడే. ఎక్కువ జాగ్రత్తతోడను, మిక్కిలిసంకోచముతోడను, ఆలోచించియే తీవ్రమైనచర్యకు పూనుటలో జ్ఞానము ఇమిడియున్నది. కాని జాగ్రత్తలకును సంకోచములకును హద్దులు గలవు. వాటిని ఇప్పుడు మనము దాటినాము. ప్రభుత్వము వారు తమ సౌమ్యబుద్ధికి వీడ్కోలుపుచేసి పంపినారు. ఇప్పుడు మనలను ఆవరించెడి కారుచిచ్చుయెదుట మనకున్నదంతయు హోమముచేయక చేతులుముడుచుకొని కూర్చున్నయెడల మన అయోగ్యతను, పిరికితనమును, మాత్రమే ప్రదర్శింతుము. కాన

ప్రమాణములు చేయుటకు ఈ సమయముయుక్తమని చెప్పు టకు సందేహములేదు. ప్రమాణముచేయుటకు కోరికయు, శక్తియు, గల ప్రతివాడును తనలో తాను విచారించుకొన వలెను. ఇట్టి స్వభావములుగల తీర్మానములను అధికసంఖ్యా కుల సమ్మతితో మంజూరుచేయరాదు. ప్రమాణముచేయు వాడే దానివల్ల బద్ధుడగును. వెలుపలనున్నవారిలో పరివర్త నము గలిగించునుద్దేశ్యముతో ఈ ప్రమాణముచేయరాదు. స్థానికప్రభుత్వమునకును, సామ్రాజ్య ప్రభుత్వమునకును, లేక ఇండియాప్రభుత్వమునకును, యేమి అభిప్రాయముకలుగునని ఆలోచించుటకు ఒక్కరును శ్రమపడరాదు. ప్రతివాడును తన యొక్క హృదయమునుమాత్రమే శోధించుకొనవలెను. చివర వరకు దీనిని సాగించుటకు తగినంతబలముగలదని తన అంత రాత్మ గట్టిపరచినపుడే తాను ఈ ప్రమాణమును తీసుకొన వలెను. అప్పుడే యీ ప్రమాణము ఫలవంతమగును.

"దీని ఫలితములను గురించి కొద్దిమాటలను ఇప్పుడు చెప్పెదను. మంచిగా జరుగునని ఆశించినయెడల, మనము ఇట్లనుకొనదగును. భారతీయులలో అధికసంఖ్యాకులు యీనిరో ధము చేయుటకు ప్రమాణము చేసినయెడలను, ప్రమాణము చేసినవారందరు సత్యముగా ప్రవర్తించినయెడలను, ఈచట్టము మంజూరు కానేకాకుండవచ్చును. మంజూరైనను వెంటనే రద్దు పడవచ్చును. మనలో నెవరును బాధపడవలసిన ఆవశ్యకతయే రాకపోవచ్చును. కాని ప్రమాణము తీసుకొనిన ప్రతివాడును

ఒకవైపున, దృఢమైన శుభాకాంక్షిగా యెట్లుండవలయునో అట్లే రెండవవైపున అత్యంతకష్టములు బొందుటకును సిద్ధము గానుండవలెను. కాన యీప్రస్తుత పోరాటములో మనకు రాదగిన అత్యధికమైన కీడు ఏదియో మీకు చెప్పదలచినాను. ఈసభలోనున్న మూడువేలు మాత్రమే ప్రమాణముచేసినా మనుకొనుడు. తక్కిన పదివేల భారతీయులు ప్రమాణము చేయలేదనుకొనుడు. మొదటమనము పరిహాసమునకే పాత్రులమగుదుము అనియు ఊహించుడు. ఈహెచ్చరింపుకు భిన్నముగా యీప్రమాణములు చేసినవారిలో, కొందరో, అనేకులో, మొదట పరీక్షలోనే జారుటకూడ తటస్థించవచ్చును. మనము చెరసాలకు పంపబడవచ్చును. అక్కడ అవమానించబడవచ్చును. ఉపవాసములు చేయవలసివచ్చును. అధికమైన యెండను చలిని సహించవలసి వచ్చును. మనచేత కష్టమైన పనులు చేయించవచ్చును. మోటువారైన చెరసాలరక్షకులు మనలను కొరడాలతో కొట్టవచ్చును. హెచ్చుగా జరిమానాలు పడవచ్చును. మన ఆస్తులు జప్తుకావచ్చును. కొద్దిమంది నిరోధకులే మిగిలినయెడల, ఆస్తి వేలముగావచ్చును. నేడు భాగ్యవంతులము రేపు కటికబీదవారము కావచ్చును. మనము ప్రవాసమునకు పంపబడవచ్చును. ఆకలిబాధనుండియు తదితరబాధలనుండియు చెరసాలలో బాధపడుచు మనలో కొందరు జబ్బుపడవచ్చును. చావవచ్చును. కాన ఇంతయేల మనము యూహించదగినన్ని కష్టములు భరించవలసివచ్చును. ఇయ్యది

అసంభవముకాదు. కాన ఇది యంతియు, ఇంతకంటె కఠినమైనదియు, భరించవలెనని గ్రహించియే ప్రమాణముచేయుట వివేకము. ఎవరైనను యీపోరాటము యెప్పుడు యెట్లు అంతమగునని అడిగినయెడల, భారతీయబృందము అంతయు పౌరుషముతో ఈపరీక్షలో నిలువబడినయెడల, దీని అంతము దగ్గరనేయున్నదని నేను చెప్పెదను. వచ్చెడి తుపానులో మనలో అనేకమంది వెనుకాడినయెడల, ఈపోరాటము చాల కాలము సాగును. కాని తమ ప్రమాణములను న్యాయముగా పరిపాలించు జనులు కొద్దిమందియైనను నిలిచినయెడల, యీపోరాటమునకు ఒకటే ఫలితము గలుగుననియు, ఆఫలితము విజయమేననియు, నేను నిశ్చయముగా ధైర్యముగా ప్రకటించగలను.

“నాస్వంతబాధ్యతను గురించి ఒకమాట. ఈప్రమాణముచేయుట యందుగల కష్టములను గూర్చి మిమ్ము నేను హెచ్చరించుచున్నను, అప్పుడే మీరీప్రమాణములను చేయవలసినదనియు కోరుచున్నాను. ఇట్లు కోరుటలో నాబాధ్యతను నేను పూర్తిగా గ్రహించితిని. ఇచ్చట నున్నవారిలో అధిక సంఖ్యాకులు ఉత్సాహోద్రేకములోగాని, కోపోద్రేకములోగాని యీప్రమాణము చేయవచ్చును. చివరపరీక్షకు తాళువారు కొద్దిమందియే కావచ్చును. అప్పుడైనను నావంటివానికి ఒకటేత్రోవ గలదు. చావవలసినదేగాని యీచట్టమునకు లొంగజాలను. బహుశః అట్లు సంభవించకపోవచ్చును. కాని

యీబరువు మోయుటకు నన్ను ఒక్కనినే వదలి తక్కిన వారందరును పైదొలగినను నాప్రమాణము నేను ఎన్నడును భంగపరచనని నాకు విశ్వాసముగలదు. నామాటకు అపార్థము చేయకుడని బ్రతిమాలెదను. నేను బడాయికొరకు ఈమాట చెప్పుటలేదు. కాని మిమ్మును, యీవేదికమీద కూర్చుండిన నాయకులను, "ప్రత్యేకముగాను జాగ్రత్తపడుడు" అని చెప్ప కోరెదను. మిమ్ములను పూర్తిగా ఇతరులనుండి విడిచేసినప్పుడు సహితము గట్టిగా నిలువబడుటకు బలముగాని, ఇచ్ఛగాని లేనియెడల మీరీప్రమాణమును తీసుకొనవలదు. అంతేగాక ఈతీర్మానము సభవారియెదుట ఆమోదము నిమిత్తము ఉంచబడులోపల వారు ప్రమాణములు చేయుటకు ప్రారంభించుటకు ముందు, మీవ్యతిరేకాభిప్రాయమును మీరు ప్రకటించవలెను. మీరు యీతీర్మానమునకు కారకులు కాగూడదు. అని మర్యాదగా మీకు చెప్పదలచెదను. సభ్యుల మొత్తముమీద మనము ప్రమాణము చేయుచున్నను, మనలో ఒకరుగాని, అనేకులుగాని ఆచరించక తప్పిపోవుట వలన తక్కినవారి బాధ్యత తొలగిపోవునని ఒక్కడును యెంచరాదు. ప్రతివాడును తనబాధ్యతను పూర్తిగా గ్రహించవలెను. ఇతరులతో సంబంధములేకుండ స్వతంత్రముగ తాను ప్రమాణము చేయువలెను. ఇతరులు యేమిచేసినను సరే తాను తనమట్టుకు తనప్రమాణమును మరణాంతమువరకు న్యాయముగా పరిపాలించవలెనని తప్పక గ్రహించవలెను."

నేను ఈరీతిగా మాట్లాడి కూర్చుంటిని. సభవారు మిక్కిలి నిశ్శబ్దముగా నేను చెప్పిన ప్రతిమాటను వినిరి. ఇతర నాయకులు గూడ మాట్లాడిరి. తమ స్వంత బాధ్యతను గూర్చియు, సభవారి బాధ్యతను గూర్చియు వారుపన్యసించిరి. అధ్యక్షుడు లేచెను. ఆయనకూడ స్థితిగతులను స్పష్టపరచెను. చిట్టచివరకు హాజరైన అందరును చేతులను పైకెత్తి దైవమును సాక్షిగా పిలిచి ఈచిత్తుచట్టము మంజూరైనయెడల దానికి లొంగము అని ప్రమాణముచేసిరి. ఆదృశ్యమును నేనెన్నడును మరువజాలను. ఇది వ్రాయుచున్నపుడును ఆదృశ్యము నామనో నేత్రమునకు గోచరమగుచున్నది. భారతీయబృందము యొక్క ఉత్సాహమునకు మేరలేకుండెను. ఆమరునాడే ఆనాటకశాల దైవయోగమువలన తగులబడిపోయెను. మూడవనాడు స్నేహితులు యీ సమాచారము నాకు వినుపించి ఇది శుభశకునమని చెప్పి భారతీయబృందమును అభినందించిరి. నాటకశాలకు గలిగినఅవస్థయే యీ చట్టమునకు కలుగునని ఆ శకునము వారికి సూచించెను. ఇట్టి సూచనలను యెన్నడును గమనించను. కాన దీనికి నేను ప్రాముఖ్యత నివ్వలేదు. భారతీయబృందము యొక్క ధైర్యమునకును విశ్వాసమునకు ఋజువుగా మాత్రమే దీనిని ఉదహరించితిని. ఈ ప్రజలయొక్క ఈ ఉత్తమగుణములు రెంటికిని అనేక ఋజువులను వచ్చే అధ్యాయములో పాఠకులు కనుపెట్టగలరు.

ఈ మహాసభ అయినపిమ్మట ప్రచారకులు ఒక్క నిమిషమైనను వ్యర్థము చేయలేదు. ఎల్లెడల సభలు చేసిరి. ప్రతిచోటను నిరోధప్రమాణములు చేయబడెను. ఇండియను ఒపినియనులో ఈనల్లచట్టము ఇప్పుడు ముఖ్యమైన చర్చనీయాంశమయ్యెను. రెండవవైపున స్థానిక ప్రభుత్వమును కలియుటకు చర్య గైకొనబడెను. వలసకార్యదర్శియైన డంకను వద్దకు రాయబారము వెళ్లెను. ఇతర విషయములతోపాటు ఈప్రమాణములను గూర్చి గూడ ఆయనకు తెలిపిరి. ఈరాయబారములో సభ్యుడుగానున్న సేటు హాజీ హాబీబ్బు ఇట్లు చెప్పెను. "ఏ యుద్యోగియైనను వచ్చి, నాభార్య వ్రేలిముద్రలు వేయించసాగగానే, నన్ను నేను ఆపుకొనజాలను. వానినప్పుడే చంపెదను. నేను వెంటనే చచ్చెదను." ఆమంత్రి యీ సేట్ మొగమును కొంతసేపు తేరిపారజూచెను. మరి యిట్లు చెప్పెను. "ఈచట్టమును స్త్రీలకు వర్తింపచేయుట వాంఛనీయమాయని ప్రభుత్వము తిరిగి విచారించుచున్నారు. స్త్రీలకు సంబంధించిన వాక్యములు తొలగించబడునని మీకిప్పుడే నేను గట్టిమాట ఇవ్వగలను. ఈవిషయములో మీ భావమును ప్రభుత్వమువారు గ్రహించిరి. దానిని గౌరవింపదలచిరి. తక్కిన నీమములను గూర్చి ప్రభుత్వమువారు వజ్రమువలె కఠినముగానున్నారు. అట్లే ఉండతలచినారు. అని మీతో చెప్పవలసి వచ్చినందుకు నేను చింతిల్లుచున్నాను. పూర్తిగా విచారించుకొని పిమ్మట మీరీశాసనమునకు అంగీకరించవలసిన

దని బోథా సేనాని మిమ్ములను కోరుచున్నాడు. యూరోపి యనుల ఉనికికి ఇది అత్యవసరమని ప్రభుత్వమువారు తలచు చున్నారు. ఈచట్టముయొక్క ప్రధానోద్దేశ్యములకు భిన్నము గాకుండ వివరములను గూర్చి మీరు సలహాల నిచ్చినయెడల ప్రభుత్వమువారు తప్పక ఆలోచించెదరు. రాయబారమునకు నాసలహా యేమనగా యీచట్టమునకు మీరు సమ్మతించుట లోను, వివరములనుగూర్చి మాత్రమే మార్పులు సూచించుట లోను మీకు లాభముకలదు. మంత్రితో జరిగిన చర్చయొక్క వివరములను యిక్కడ వ్రాయక వదులుచున్నాను. ఏలనన ఆ వాదములన్నియు యిదివరకే చెప్పబడియున్నవి. ఆవాదముల భావములు ఒక్కటే. గాని మంత్రియెదుట వాడిన భాషలో మాత్రము కొంతభేదము కలదు. వారి సలహాకు వ్యతిరేకము అయినప్పటికిని సరే యీరాబోవు శాసనముకు అంగీకరించుట సంభవించనేరదని తెలిపి దాని నీమములనుండి స్త్రీలను మినహాయించ నుద్దేశించినందుకు ప్రభుత్వమువారికి వందన ములు చెప్పుచు, రాయబారము తిరిగి వచ్చెను. స్త్రీలను మినహాయించుట అనునది దేనివలన కలిగినదియు చెప్పుట కష్టము. అది భారతీయబృందముచేసిన ఆందోళనకు మొదటి ఫలితమా? లేక తన శాస్త్రీయపద్ధతులలో చోటులేదని కర్టిసు గారు త్రోసివేసిన కార్యవాదులకు కలుగగల ఆలోచనలను ప్రభుత్వమువారు గమనించి చేసిన తదనంతరపు ఆలోచనా ఫలితమా? భారతీయ ఆందోళనకు సంబంధము లేకుండగనే

స్త్రీలను మినహాయించితిమని ప్రభుత్వమువారు చెప్పుచుండిరి. అది యెట్లున్నను ఆందోళనకును మినహాయింపునకును కార్య కారణసంబంధము కలదని భారతీయబృందము తృప్తికరముగా స్థిరపరుచుకొనెను. దాని కనుకూలముగా వారికి యీ యుద్ధము నందు ఉత్సాహము ప్రబలెను.

ఈ ఉద్యమమునకు యేమిపేరు పెట్టవలసినదియు మా కెవరికిని తెలియదు. దానిని వర్ణించుచు సాత్వికనిరోధమని (passive resistance) అని నేనప్పుడు వాడితిని. నే పెట్టిన ఆపేరుకు, అంతర్యభావములు యేమియో నేను పూర్తిగా గ్రహించలేదు. ఏదో నూతనసిద్ధాంతము పుట్టినదని మాత్రము నాకు తెలియును. ఈ పోరాటము సాగినకొలదియు ఈ సాత్విక నిరోధమను పదము భావక్లిష్టతకు తావిచ్చెను. ఈ పెద్దపోరా టమును ఇంగ్లీషు పేరుతో నే పిలుచుట లజ్జాకరముగా కనుపడెను. మరియు యీ పరభాషలోని శబ్దము భారతీయబృందములో సామాన్యనాణెమువలె ప్రచారములో నుండ చాలదు. కాన యీ పోరాటమునకు చక్కని పేరు కనుపెట్టిన పాఠకునకు బహుమతి నిత్తుమని ఇండియను ఒపినియనులో ప్రకటించితిమి. కొన్ని సలహాలు వచ్చెను. ఇండియను ఒపినియనులో ఈపోరా టము యొక్క అర్థము పూర్తిగా చర్చించబడెను. ఆబహు మతికి పోటీచేయువారు ఈపత్రికాపాఠకులే గనుక వారు చేయవలసిన శోధనకు తగిన సామగ్రి చేకూరియుండెను.

ఈ పోటీదారులలో మగన్‌లాలు గాంధి ఒకడుగా నుండెను. సదుద్యమములో స్థిరత్వము అను అర్థమునిచ్చు "సదాగ్రహము" అను పదమును ఆయన సూచించెను. ఆ మాట నాకిష్టముగా నుండెను. కాని నేను చెప్పదలచిన భావమునంతయు అది పూర్తిగా ప్రతిబింబింప చేయలేదు. కాన నేను దానిని సత్యాగ్రహమని మార్చితిని. సత్యము అనగా ప్రేమ; ఆగ్రహ మనగా దానివలన కలుగు స్థిరత్వము, బలము, అనుదానికి సరిపోవును కాన భారతీయుఉద్యమమును సత్యాగ్రహమని పిలువసాగితిని. అనగా ప్రేమ, సత్యము, లేక దౌర్జన్యరాహిత్యము నుండి పుట్టినశక్తి, అని అర్థము. అప్పటినుండి సాత్వికనిరోధము అను పదమును వదలివేసితిమి. ఇంగ్లీషుభాషలో వ్రాయునపుడు గూడ దానిని విడచి యీ సత్యాగ్రహము అను పదమును గాని దీనికి సమానమగు మరియొక ఇంగ్లీషుపదమును గాని వాడుచుంటిమి. కాన తరువాత సత్యాగ్రహము అని పిలువ బడిన ఉద్యమము యొక్క ప్రారంభమును, దానికిపెట్టిన పేరు యొక్క ఉత్పత్తియు, ఇట్లు సంభవించెను. తరువాత చరిత్ర చెప్పకముందు యీ సత్యాగ్రహమునకును సాత్వికనిరోధము నకును గల భేదములను గమనించుట మంచిది. ఇదియే రాబోవు అధ్యాయములోని విషయము.

---

## 13వ అధ్యాయము
## సత్యాగ్రహము — సాత్వికనిరోధము

ఉద్యమము సాగినకొలదియు ఆంగ్లేయులుకూడ శ్రద్ధతో గమనింపజొచ్చిరి. ట్రాన్సువాలులోని ఆంగ్లేయవార్తా పత్రికలు సామాన్యముగా యూరపియనులకును, నల్లచట్టము నకును, అనుకూలముగా వ్రాయుచున్నను, ప్రముఖులైన భారతీయులు పంపిన లేఖలనుగూడ ఇష్టముతోనే ప్రకటించు చుండిరి. ప్రభుత్వమునకు పంపించిన మహజర్లను పూర్తిగానో కనీసము సంగ్రహమునైనను, వారు ప్రకటించుచుండిరి. భారతీయముఖ్యసభలకు వారి విలేఖరులను పంపుచుండిరి. అట్లు చేయనపుడు మేము పంపెడిక్లుప్తమైన నివేదికలను ప్రకటించుచుండిరి.

ఈ సౌకర్యములు భారతీయబృందమునకు మిక్కిలి ఉపయోగకరముగా నుండెను. కాని పోనుపోను, ఉద్యమము అభివృద్ధి అయినకొలదియు, ప్రముఖులగు యూరపియనులు దీనిలో శ్రద్ధపుచ్చుకొనుచుండిరి. జోహానిస్బర్గు ధనాఢ్యు లలో ఒక్కడైన హాస్కిన్, ఇట్టి శ్రద్ధతీసికొనినవారిలో చేరి యుండెను. ఆయనకు మొదటినుండియు రంగుభేదభావము లేకుండెను. కాని సత్యాగ్రహము ఆరంభించిన పిమ్మట భారత తీయ సమస్యలో ఆయనకు శ్రద్ధ పెరిగెను. జోహానిస్బర్గుకు వరగ్రామము లేక పేట అని చెప్పదగిన జర్మిస్టన్‌లో నుండిన

యూరపియనులు నన్ను మాట్లాడమనికోరిరి. ఒక సభజరిగెను. నన్ను నాకుసంబంధించిన ఉద్యమమునను సభవారికి యెరుక పరుచుచు, హాస్కిన్ ఇట్లు చెప్పెను. "ట్రాన్సువాలులోని భారతీయులు తమకష్టములను నివారించుకొనుటకు తక్కిన సాధనములన్నియు నిష్ప్రయోజనమని తేలినందున, సాత్విక నిరోధమును పూనిరి. వారికి యెన్నికహక్కు లేదు. సంఖ్యలలో వారు కొద్దిమందివారు దుర్బలులు. వారికి ఆయుధములు లేవు. కాన దుర్బలుల ఆయుధమైన సాత్వికనిరోధమును వారు బూనిరి." ఈ వాక్యములు నాకు ఆశ్చర్యమునుకలిగించెను. అందుచేత నేను చెప్పదలచిన ఉపన్యాసము పూర్తిగా భిన్న రూపమునుదాల్చెను. హాస్కినును, ఖండించుచు, మాసాత్విక నిరోధమును ఆత్మశక్తి యని నేను నిర్వచించితిని. సాత్విక నిరోధము అను పదము వాడుటవలన, భయంకరమైన అపార్థములు కలుగవచ్చునని ఈ సభలో నేను తెలిసికొంటిని. ఆ సభయెదుట చెప్పినవాదమును విస్తరింపచేసి విషయములు స్పష్టమగునట్లు సాత్వికనిరోధమునకును ఆత్మశక్తికినిగల భేదములను తెలుప యత్నించెదను.

ఇంగ్లీషుభాషలో యెప్పుడు యెవనివలన సాత్విక నిరోధమను సమాసము వాడబడెనో నాకు తెలియదు. కాని ఆంగ్లేయులలో దుష్టమైన శాసనమును అంగీకరించనికొలది జనులు విద్రోహముచేయక సాత్వికమైన లేదా మరింతనెమ్మది మైన చర్య తీసుకొనుచుండిరి. ఆ చట్టమునకు లొంగకుండు

టయు, అట్లు లొంగకపోవుటవలన కలిగెడి శిక్షలను శిరసావహించుటయు, వారు అవలంబించెడు మార్గమైయున్నది. కొన్ని సంవత్సరములక్రిందట బ్రిటిషుపార్లమెంటు విద్యాచట్టము చేసినప్పుడు నాన్‌కన్ఫరుమిస్టు తెగవారు డాక్టరు క్లిఫర్డు నాయకత్వముక్రింద సాత్వికనిరోధము నొనర్చిరి. ఎన్నికహక్కు సంపాదించుటకై ఆంగ్లేయస్త్రీలుచేసిన మహోద్యమముకూడ సాత్వికనిరోధమని పిలువబడెను. ఈ రెండును మనసులో పెట్టుకొనియే సాత్వికనిరోధము దుర్బలులు లేక ఎన్నికహక్కు లేనివారి ఆయుధమని హాస్కిను వర్ణించియుండెను. క్లిఫర్డుకును ఆయన స్నేహితునకును ఎన్నికహక్కు యుండెను. కాని వారు పార్లమెంటులో కొద్దిమంది అయిరి. విద్యాచట్టము మంజూరుకాకుండ ఆపలేకపోయిరి. అనగా వారు సంఖ్యలో దుర్బలులు, వారి ఉద్దేశ్యనిర్వాహణమునకై కత్తిగట్టుటకు వారు అయిష్టులనికాదు. బలప్రయోగమువలన గెలిచెడి ఆశ వారికిలేదు. చక్కగా వ్యవహరించెడి రాజ్యములో ప్రజలు హక్కులను సంపాదించుటకు చీటికిమాటికి ఆయుధములను బూనుచుండినయెడల వారి ఉద్దేశ్యము అపజయము పొందితీరును. మరియు ఈ నాన్‌కన్ఫరుమిస్టులలో కొంతమంది ఆచరణయోగ్యము అయినప్పటికిని ఆయుధములు పట్టుటకు సామాన్యముగా ఆక్షేపింతురు. స్త్రీయుద్యమము నడిపినవారికి ఓటుహక్కులేదు. వారు సంఖ్యలలోను శారీరకశక్తిలోను దుర్బలులు. వీరి నిదర్శనముగూడ హాస్కిన్‌పడిన

అభిప్రాయములకు కొంత బలకరముగానుండెను. ఈ స్త్రీయుద్యమమువారు పశుబలప్రయోగమును విడిచిపెట్టలేదు. కొందరు, ఇండ్లను తగులపెట్టిరి. కొందరు, పురుషులనుకూడ కొట్టిరి. వారు యెప్పుడైన యెవరినైన చంప ఉద్దేశించిరని నేను తలంచను. కాని అవకాశమువచ్చినప్పుడు ప్రజలను దంచుటకు వారు ఉద్దేశించిరి. మరియు వారు భరింపశక్యముగాని పరిస్థితులను కలిపించుటకును ఉద్దేశించిరి.

భారతీయోద్యమములో యేసందర్భములోను పశుబలమునకు ఒక్కింతయును తావులేదు. ముందు సాగినకొలదియు పాఠకుడు దీనిని గ్రహించగలుగును. ఎట్టికష్టములను పడినను, సత్యాగ్రహీలు, ఎన్నడును పశుబలమును వాడలేదు. దానిని ఉపయోగకరముగా వాడుటకు తగిన అవకాశములున్నను, వారు పశుబలమును వాడలేదు. మరియు భారతీయులకు ఎన్నికాధికారము లేకపోయినను, వారు దుర్బలులే అయినను, సత్యాగ్రహము స్థాపించుటకును ఈ ఆలోచనలకును సంబంధములేదు. అంటే భారతీయులకు ఆయుధములుగాని, ఎన్నికాధికారముగాని, యున్నప్పుడు సహితము, వారీసత్యాగ్రహము ప్రారంభించియుందురు అని నేను చెప్పుటలేదు. వారికి ఎన్నికాధికారము ఉండినయెడల, సత్యాగ్రహమునకే బహుశః ఏ అవకాశమును కలుగనేరదు. వారికి ఆయుధములు యున్నయెడల, వారితో విరోధము పెట్టుకొనకముందు యెదుటకక్షవారు రెండుపర్యాయములు ఆలోచించియుందురు. (ప్రస్తా

యించి యుందురు) కాన ఆయుధులైన జనులకు సత్యాగ్ర హాము జరుపుటకు అవకాశములు తక్కువగా నుండునని మనము గ్రహించవచ్చును. సాయుధమైన నిరోధము జరుపుట సాధ్యమా అసాధ్యమా యనునది రవ్వంతయైనను యోజించు కుండగనే భారతీయోద్యమము యేర్పరచబడినదని నేను స్పష్ట ముగా చెప్పగలను. అదియే నా ముఖ్యాభిప్రాయము. సత్యా గ్రహము పవిత్రమైన, కళంకరహితమైన ఆత్మశక్తి అయి యున్నది. ఎప్పుడు యెంతవరకు ఆయుధముల, దేహబల, పశుబల, ఉపయోగమునకు అవకాశము యున్నదో, అక్కడ అంతవరకు, ఆత్మశక్తికి అవకాశము తగ్గియున్నది. ఇవి రెండును ప్రత్యక్షవిరుద్ధమైవ శక్తులు, అని నా అభిప్రాయము. సత్యాగ్రహము ప్రవేశమయిన సమయమందే యీ వైరుధ్య మును పూర్తిగా నేను గ్రహించియుంటిని.

ఈ అభిప్రాయములు తప్పా ఒప్పా యని విచారించు టకు ఇచ్చట మనము ఆగనక్కరలేదు. సత్యాగ్రహము సాత్వి కనిరోధముల మధ్య భేదములు తెలిసికొనుటయే మన పని. ఈ రెంటిమధ్య ప్రధానమైన, మహత్తరమైన భేదము గలదని మనము గ్రహించితిమి. దీనిని అర్థము చేసుకొనకుండ, సత్యా గ్రహులనిగాని, సాత్వికనిరోధకులు అనిగాని పిలుచుకొను వారు, యీ రెండు ఒకటే యని నమ్మినయెడల, వారు రెంటికిని అన్యాయము చేతురు. అసందర్భములగు ఫలితములు చేకూ రును. దక్షిణాఫ్రికాలో సాత్వికనిరోధ మని పదమును మేము

వాడినందుకు ఫలితము యేమైనదనగా స్త్రీయుద్యమవ్యాప కులు చూపిన ధైర్యమును, స్వార్థత్యాగమును, మాకు ఆరోపించిప్రజలు మమ్ముల మెచ్చుకొనలేదు; కాని ఆ స్త్రీలవలెనే మేముకూడ ధనప్రాణములకు నష్టకారులమని పొరబడిరి. ఉదారుడైన హాస్కిను వంటి స్నేహితుడుకూడ మేము దుర్బలులమని యూహించెను. భావనయొక్క శక్తి యెట్టిదనగా మనుజుడు తా నెట్టివాడనని నమ్ముచున్నాడో, చిట్టచివరకు తా నట్టివాడే యగుచున్నాడు. మనము దుర్బలుల మనియు, నిస్సహాయులమనియు, కాన సాత్వికనిరోధముల ఆచరించుచున్నామనియు, మనంతట మనము నమ్మి, ఇతరులనుగూడ అట్లే నమ్మింపచేసిన యెడల, మన నిరోధమువలన మన కెన్నన్నడును బలము చేకూరదు. దొరికిన మొదటి అవకాశములోనే దుర్బలుల ఆయుధముగదా యని ఈ సాత్వికనిరోధమును వదలిపెట్టుదుము. అట్లుకాక మనము సత్యాగ్రహులమై, బలముగలవారల మని నమ్మి, సత్యాగ్రహమును ఆచరించినయెడల, దానివలన రెండు స్పష్టమైన ఫలితములు సమకూరును. (౧) బలభావమును పోషించుచు ప్రతిరోజు మనమంతకంతకు బలిష్ఠుల మగుదుము. (౨) బలము పెరిగిన కొలది మన సత్యాగ్రహముకూడ మరింత ఫలకారి యగును. దీనిని యెప్పుడు వదులుదుమా యని అవకాశమునకై వెదకులాడము. మరియు సాత్వికనిరోధములో ప్రేమకు తావేలేదు. సత్యాగ్రహములో ద్వేషమునకు తావు లేకపోవుటయేగాక

దాని ప్రధానసిద్ధాంతమునకు ఇది ప్రత్యక్షఉల్లంఘన మగును. సాత్వికనిరోధములో సరియైన తరుణము వచ్చినప్పుడు, ఆయుధ ప్రయోగమునకు అవకాశము కలదు. సత్యాగ్రహములో అత్యంత అనుకూలమైన పరిస్థితులలోగూడ దేహబలము నిషేధించబడినది. దౌర్జన్యప్రయోగమునకు సాత్వికనిరోధమును సాధనయని అనేకమారులు తలచుదురు. సత్యాగ్రహమును ఎన్నడును అట్లు వినియోగించ వీలుకాదు. ఆయుధప్రయోగముతోబాటు సాత్వికనిరోధమును జరుపవచ్చును. సత్యాగ్రహమును, పశుబలమును పరస్పరము ధ్వంసకారులు గనుక ఇవిరెండును యెన్నడును కలిసిపోజాలవు. తనకు మిక్కిలి దగ్గరవైనట్టియు, మిక్కిలి ప్రియులైనట్టియు వారియెడగూడ సత్యాగ్రహము జరుపవచ్చును. వారు మనకు ప్రియులుగా నుండుటమాని ద్వేషమునకు గురియైనయెడలతప్ప వారి యెడల ఇట్లు యెన్నడును సాత్వికనిరోధమును జరుప వీలు లేదు. సాత్వికనిరోధములో యెదుటివారిని ఇబ్బందిపెట్టు భావము యెప్పుడును యుండును. దానితోపాటు అట్టి చర్యల వలన మనకు కలిగెడు కష్టములను భరించెడి సంసిద్ధతయు యుండును. సత్యాగ్రహములో ప్రత్యర్థికి అపకారముచేయు భావము లేశమైనను యుండదు. తాను స్వంతముగా బాధల నోర్చి ప్రత్యర్థిని గెలుచుటయే సత్యాగ్రహముయొక్క ప్రధానసూత్రము.

ఈ రెండుశక్తులకును ఇవియే భేదములు కాని సాత్విక నిరోధమను పేరుతో పిలువబడు ప్రతి ఉద్యమములోను పైన జెప్పిన యోగ్యతలు లేదా నీకిష్టమైతే లోపములు కలవని సూచించుటకు నేను కోరుటలేదు. కాని సాత్వికనిరోధమని చెప్పు అనేక ఉద్యమములలో ఈ లోపములు కలవని చూపవచ్చును. జీసెస్ క్రీస్తును సాత్వికనిరోధులకు రాజని పొగడుచున్నారు. కాని అక్కడ సాత్వికనిరోధమన్నపుడు సత్యాగ్రహ మొక్కటియే అర్థము. దేశచరిత్రలో ఇట్టి అర్థములో జరిగిన సాత్వికనిరోధములు పెక్కుగాలేవు. టాల్‌స్టాయి చెప్పిన రషియాలోని డౌఖోబార్సు విషయము ఒక్కటికలదు. క్రైస్తవమత ప్రారంభకాలములో భక్తులగు క్రైస్తవులు వేలకొలది, నిర్బంధములను ఓర్పుతో సహించినప్పుడు, దానికి సాత్వికనిరోధమని పేరుపెట్టలేదు. కాన వారిని నేను సత్యాగ్రహీల తరగతిలో చేర్చెదను. వారి ప్రవర్తనను సాత్విక నిరోధమని వర్ణించినయెడల అప్పుడు సాత్వికనిరోధమును సత్యాగ్రహమును ఒకే అర్థముగల పదములగును. ఈ అధ్యాయములో నాయుద్దేశ్య మేమనగా ఇంగ్లీషుభాషలో సాత్విక నిరోధమను పదమువలన సామాన్యముగా ప్రజలు అర్థము చేసుకొను దానికంటె సత్యాగ్రహము ప్రధానసూత్రములలో భిన్నమైనదని తెలుపుటయే.

సాత్వికనిరోధలక్షణములను చెప్పుచుండగా దానిని అవలంబించినవారికి అన్యాయము జరుగకుండుటకై నేను

హెచ్చరికవాక్యము చెప్పవలసి వచ్చెను. సత్యాగ్రహము యొక్క ప్రధానలక్షణములని నేను వర్ణించిన యోగ్యతలు సత్యాగ్రహులని పిలుచుకొనువారి అందరియందు కలవని నేను చెప్పుటలేదని గుర్తించుటకూడ అవసరము. సత్యాగ్రహులని పేరుపెట్టుకొనిన చాలమంది సత్యాగ్రహములో చెప్పబడిన ముఖ్యాంశములకు అత్యంతదూరస్థులని నాకు తెలియక పోలేదు. సత్యాగ్రహము దుర్బలుల ఆయుధమని అనేకమంది యూహించెదరు. అది సాయుధనిరోధమునకు సాధనమని యితరులు చెప్పెదరు. కాని ఇప్పుడున్న సత్యాగ్రహులను వారున్న స్థితిలో వర్ణించుట నాయుద్దేశ్యము కాదనియు, సత్యాగ్రహములోయున్న భావమును వెలిబుచ్చుటయు, సత్యాగ్రహులు ఉండవలసిన స్థితిలో వారికుండు లక్షణములు తెలుపుటయు నాయుద్దేశ్యమని మరొక్కమారు చెప్పవలయును.

క్లుప్తముగా చెప్పినయెడల దక్షిణాఫ్రికాలో భారతీయులు జరుపుచున్న ఉద్యమమును స్పష్టముగా నిర్వచించగల ఒక క్రొత్తపదమును సృష్టించుటయు, సామాన్యముగా సాత్విక నిరోధమని పిలువబడు దానితో దీనిని ఐక్యముచేసి పొరబడకుండ ఆపుటయు, మాకర్తవ్యమై యుండెను. ఆపదములో స్ఫురించుచున్న అర్థములో లీనమైయున్నట్లు అప్పుడు ఎంచిన వివిధసూత్రములును తెలుపుటకై యీఅధ్యాయములో ప్రయత్నించితిని.

---

# 14వ అధ్యాయము

## ఇంగ్లండుకు రాయబారము

ఈ నల్లచట్టమును నిరోధించుటకుగాను స్థానికప్రభుత్వమునకు మహజర్లుపంపుట మొదలగు అన్నిపనులను ట్రాన్సువాలులో చేసితిమి. స్త్రీలకు సంబంధించిన వాక్యమును శాసన సభవారు తొలగించిరి; కాని తక్కిన శాసనమును మొదటి చిత్తుప్రకారము రవంతయైన మార్చకుండ, అంగీకరించిరి. భారతసంఘము ఉత్సాహపూరితముగా నుండెను. భేదాభిప్రాయములను సర్దుకొని ఏకగ్రీవముగా ఈ చట్టమును నిరోధించెను. ఎవరును నిరాశచెందలేదు. కాని మొట్టమొదట తీర్మానించినట్లు, మునుముందుగా సవ్యమైన ఆందోళనా విధానములను ప్రయత్నించదలచితిమి. ట్రాన్సువాలు ఇంకను చక్రవర్తి పరిపాలనమునకు లోబడిన వలసరాజ్యముగానే యుండెను. కాన ఇచ్చట శాసనాధికారమునకును, పరిపాలనాధికారమునకును, సామ్రాజ్యప్రభుత్వమువారే బాధ్యులుగానుండిరి. ఇచ్చటి శాసనసభ అంగీకరించిన చట్టములకు రాజుగారి సమ్మతి పొందవలసి యుండెను. అయ్యది సామాన్యకృత్యము (మామూలుతంతు) గాక ముఖ్యాంశముగానే యుండెను. బ్రిటిష్‌రాజ్యాంగ విధాన భావమునకు విరుద్ధముగా నున్న చట్టములకు రాజుగారు సమ్మతి నియ్యక నిరాకరించవచ్చును. రాజునకు మంత్రులు అట్లు సలహా చెప్పవచ్చును. బాధ్యతా

యుత ప్రభుత్వముగల వలసరాజ్యముల సంగతి ఇట్లుండెను. అట్టి రాజ్యములుచేసిన *చట్టములకు రాజు సమ్మతి మామూలుగా ఇవ్వబడును.

ఇంగ్లండునకు రాయబారము పంపదలచినయెడల మన బాధ్యతలను మరింతగుర్తించుట మంచిదని నేను అచ్చటి భారతీయబృందమునకు సలహా చెప్పితిని. మా రాజకీయసంఘమునకు మూడు సలహాల నిచ్చితిని. ౧ సామ్రాజ్యనాటకశాలలో జరిగిన సభయందు మేము ప్రమాణములను చేసితిమి. అయినను భారతీయనాయకులు ప్రత్యేకముగా ఒక్కొక్కరు తిరిగి ప్రమాణముచేయుట మంచిది. అనుమానముగాని, దుర్బలముగాని కలవారు బయటపడుదురు. ఈసలహా చెప్పుటకు ఒక కారణము ఏమన :—ఇంగ్లండుబోవు రాయబారము సత్యాగ్రహముపై ఆధారపడినయెడల వారు భయములేకుండ ప్రవర్తించవచ్చును. ఇండియామంత్రికిని వలసరాజ్యముల మంత్రికిని భారతీయబృందముయొక్క తీర్మానమును గూర్చి ధైర్యముగా చెప్పవచ్చును. ౨ రాయబారమునకు కావలసిన ధనము వసూలు చేయవలసి యుండెను. 3 రాయబార వర్గములో వెళ్లదగిన అధికసంఖ్యను నిర్ణయించవలసి యుండెను. ఈ చివరసూచన చేయుటకు కారణమేమన :— హెచ్చుమంది సభ్యులు వెళ్లినయెడల ఎక్కువపని చేయగలుగుదురని ఒక అపోహ వ్యాపించియుండెను. దానిని సవరించుట అవసరము. రాయబారవర్గములో వెళ్లుట గౌరవమని యెంచువారిని

గాక ఉద్యమమునందు అనన్యమైన భక్తికలవారినే చేర్చు కొనవలెనని తెలియజెప్పవలసి యుండెను. నామూడు సలహా లను వారు అంగీకరించిరి. ప్రమాణపత్రములమీద సంతక ములు చేయబడెను. చాలమంది సంతకములు చేసిరి. కాని నాటకశాలలో మూజువాణీగా ప్రమాణములు చేసినవారిలో కొందరు కాగితముమీద దస్కతు చేయుటకు సంకోచించిరి. ఒకమారు ఒకడు ప్రమాణము చేసినయెడల దానిని నూరు మాట్లు చేయుటకైనను సంకోచింపనవసరములేదు. కాని బుద్ధి పూర్వకముగా ప్రమాణముచేసిన మనుజులే ఆమూజువాణి ప్రమాణమునకే తెల్లకాగితము నలుపుచేయుమని అడిగినపుడు, జంకుచుండుటకూడ అప్పుడప్పుడు అనుభవములో చూచు చున్నాము. కావలసిన ధనము సమకూర్చిరి. రాయబారవర్గ సభ్యులను నిర్ణయించుటలో హెచ్చుకష్టము తటస్థించెను. నేను వెళ్లవలసినదే కాని నాతో వచ్చువారు ఎవరు. ఇది తీర్మానించుటలో మారాజకీయసంఘము చాలకాలము గడ పెను. అనేకరాత్రిళ్లు జారిపోయెను. ఇట్టి ఉపసంఘములలో సామాన్యముగా వ్యాపించియుండు దురలవాట్లు మాకు పూర్తిగా అనుభవములోనికి వచ్చెను. ఈపీటముడిని కత్తిరించ దలచిరి కొందరు. ఆ ఉద్దేశ్యముతో నన్ను ఒంటరిగా పొమ్మ నిరి. కాని నేను ససేమిరా అంటిని. దక్షిణాఫ్రికాలో హిందూ మహమ్మదీయ సమస్య లేదనియే చెప్పవచ్చును. కాని రెండు జాతులమధ్య తేడాలే లేవని అనజాలము. ఈ తేడాలు తీవ్ర

రూపము దాల్చకపోవుటకు దక్షిణాఫ్రికా ప్రత్యేకపరిస్థితులు ఒక కారణము. అంతకుమించిన విస్పష్టమైన కారణము ఇంకొకటి కలదు. ఏమన:—నాయకులు భక్తితోడను బోళాతనముతోడను కృషిచేసి భారతీయబృందమునకు చక్కని ఆదర్శమును చూపిరి. రాయబారవర్గములో ఇద్దరు ఉండవలయు ననియు, ఒకరు మహమ్మదీయులుగా ఉండవలెననియు నేను సలహా చెప్పితిని. కాని వెంటనే నేను భారతీయబృందమునకంతకు ప్రతినిధినిగాన హిందువులకు ప్రత్యేక ప్రతినిధి ఒకరు ఉండవలెనని అచ్చటి హిందువులు కోరిరి. కొంకణదేశపు మహమ్మదీయుడు ఉండవలెనని కొందరును, మెమన్‌మహమ్మదీయుడు కావలెనని కొందరును, గుజరాతీపాటీదారు కావలెనని కొందరును, ఇట్లు చెప్పసాగిరి. చివరకు నిజస్థితిని అందరు గ్రహించిరి. నన్నును, హెచ్. ఓ. ఆలీగారిని ఇద్దరిని సక్రమముగా ఎన్నుకొనిరి.

ఆలీ మలయాద్వీపమునకు సంబంధము కలవాడు. ఈయనతల్లి మలయా స్త్రీ, తండ్రి భారతమహమ్మదీయుడు. వీని మాతృభాష డచ్చి అని చెప్పవచ్చును. ఇతను ఇంగ్లీషు బాగా చదువుకొనెను. రెండు భాషలు బాగా సమానముగా మాట్లాడగలుగును. వార్తాపత్రికలకు వ్రాయుటలో నేర్పరి. ట్రాన్సువాల్ బ్రిటిష్ ఇండియన్ అసోషియేషన్ (ట్రాన్సువాలులోనున్న బ్రిటిషు పౌరులైన భారతీయుల సంఘము బదులు టి. బి. భా. సం. అని ముందు క్లుప్తముగా వ్రాయ

బడును.) లో ఇతను సభ్యుడు. ప్రజాహిత ఉద్యమములలో చాలకాలమునుండి పాల్గొనుచుండెను. హిందూస్తానికూడ సాఫుగా మాట్లాడగలుగును.

ఇంగ్లండు చేరగానే మేము పని ప్రారంభించితిమి. ఓడలో నున్నపుడే మంత్రులకు ఇవ్వవలసిన మహాజరుయొక్క చిత్తును వ్రాసితిమి. దానిని ఇప్పుడు అచ్చువేయించితిమి. మార్లె అప్పుడు ఇండియామంత్రిగా నుండెను. ఎలిజన్ ప్రభువు వలసమంత్రిగా నుండెను. దాదాభాయిగారిని వారిద్వారా భారతజాతీయమహాసభయొక్క బ్రిటిష్ ఉపసంఘమును కలిసితిమి. దాదాభాయిగారి సలహా ప్రకారము, మావ్యవహారము వారికి చెప్పితిమి; మరియు ఇంగ్లండులోని రాజకీయకక్షల అందరి సహకారమును పొందవలెనను మాకోరికను తెలియ జేసితిమి. మాకార్యవిధానమును ఆ ఉపసంఘమువారు ఆమోదించిరి. సర్. మంచ్చర్జీభవనగిరిగారిని కలిసితిమి. ఆయన గూడ చాల సహాయపడెను. భారత దేశములో ఉద్యోగము చేసిన నిస్పక్షపాతులైన, ప్రఖ్యాతులైన ఆంగ్లేయుల సలహా పొందమని ఆయనయు దాదాభాయియు మాకు సలహా చెప్పిరి. అట్టి వాడొకడు మారాయబారమును యెలిజన్‌గారి వద్ద పరిచయమొనర్చవలెనని వారు సూచించిరి. భవనగిరి గారు కొన్ని పేర్లు చెప్పిరి. అందులో సర్. లెపెల్‌గ్రిఫిన్ ఒకడు. సర్ డబ్లియు. డబ్లియు. హంటర్ అప్పుడు జీవించి యుండ లేదు. ఉన్నయెడల దక్షిణాఫ్రికా పరిస్థితులగూర్చి ఆయనకు

కలిగిన అనుభవాతిశయముచేత ఆయనయే మాకు నాయకుడుగా నుండియుండును.* లేదా ప్రభువుల సభలో ప్రముఖుని మాకు నాయకునిగా యేర్పరచి యుండును.

మేము గ్రిఫెనుగారిని కలిసితిమి. భారతదేశములో అప్పుడున్న రాజకీయఉద్యమములకు ఆయన వ్యతిరేకుడు. కాని ఈ సమస్యలో హెచ్చుశ్రద్ధపుచ్చుకొనెను. మర్యాదకొరకుగాక మాఉద్యమమందలి న్యాయమును ధర్మమును విచారించి, మాకు నాయకుడగుటకు అంగీకరించెను. దీనికి సంబంధించిన కాగితములన్నిటిని చదివి బోధపరుచుకొనెను. అట్లే భారతదేశ ఉద్యోగస్థులగు ఇతరఆంగ్లేయులను, పార్లమెంటు సభ్యులను మా అందికలోనున్న ఇతరప్రముఖులను, చూచి సంభాషించితిమి. ఎలిజన్ప్రభువు మా రాయబారము చెప్పినదంతయు శ్రద్ధతోవినెను. సానుభూతిని దెలిపెను. తన కష్టములను వివరించెను. అయినను శక్తికొలది సహాయము చేయుటకు వాగ్దత్తముచేసెను. రాయబారము మూర్లేగారిని కలసెను. ఆయనగూడ సానుభూతిదెలిపెను. ఆయన వాక్యముల సారాంశమును వెనుక నొక అధ్యాయములో తెలిపియున్నాను. కామన్సుసభ్యులలో భారతీయవ్యవహార ఉపసంఘము అని ఒకటిగలదు. ఆ కామన్సుభవనములోనే ఆ ఉపసంఘ సభ సర్ విలియంవెడ్డర్ బరన్గారి మూలకముగా జరుపబడెను. మాశక్తికొలది వారికి మా వ్యవహారము వినిపించితిమి. ఐరిష్పార్టీకి అప్పటి నాయకుడైన రెడ్మండుగారిని

కలసితిమి. ఇంతయేల వారివారి కక్షులతో నిమిత్తములేకుండ పిలైనంతమంది పార్లమెంటుసభ్యులనే, కలసితిమి. భారత జాతీయమహాసభయొక్క ఉపసంఘము మాకు చాల సహాయ పడిరి. ఆంగ్లసాంప్రదాయముల ప్రకారము ఒక రాజు కక్షకు చెందినవారు కొన్ని అభిప్రాయములు గలవారు మాత్రమే ఈ ఉపసంఘములో నుండిరి. ఈ ఉపసంఘముతో జోక్యము లేని అనేకులు మాకు తగినంతసహాయముచేసినవారు కలరు. ఇట్టివారినందరిని ఒకచోటచేర్చి మా వ్యవహారమును కనిపెట్టి యుండుటకు ఒక స్థాయిసంఘము నేర్పరచదలచితిమి. అన్ని కక్షులవారు దీనిని ఆమోదించిరి. ఏ సంస్థకైనను నడుపు జవాబుదారి కార్యదర్శిమీద ముఖ్యముగా పడును. ఆ సంస్థ యొక్క ఉద్దేశ్యములలోను ఆదర్శములలోను పూర్తిగా నమ్మకముండుటయేగాక, వాని నిర్వాహణములో తనకాలము నంతయు వినియోగించవలెను. పరిశ్రమ చేయుటయందు హెచ్చుశక్తి సామర్థ్యము లుండవలెను. ఇట్టివాడే కార్య దర్శి పదవికి తగినవాడు. దక్షిణాఫ్రికా కాపురస్తుడు యల్. డబ్లియు. రిచ్చిగారు పూర్వము నాదగ్గిర పని నేర్చుకొనిరి. ఇప్పుడు లండనులో బారిష్టరుపరీక్ష చదువుచుండిరి. ఆయనకు పైజెప్పిన యోగ్యతలన్నియు కలవు. ఈ పనిచేయుటకు ఆయన సిద్ధముగానుండెను. అందుచేత దక్షిణాఫ్రికా బ్రిటిష్ ఇండియన్ స్థాయిసంఘము ఏర్పరుచుటకు మేము సాహసించి తిమి. ఇంగ్లండులోను, ఇతర పాశ్చాత్యదేశములలోను, భోజన

కాలములయందు ఉద్యమములను ప్రారంభించు ఆచారము కలదు. ఇది అనాగరికము అని నా అభిప్రాయము. ప్రతి నవంబరు తొమ్మిదవ తేదీన, రాజమందిరములో బ్రిటిషు ప్రధానమంత్రి ముఖ్యమైన ఉపన్యాసముచేయును. అందులో సంవత్సర కార్యక్రమములను వివరించును. భవిష్యత్తులను గురించి తన అభిప్రాయమును తెలుపును. అందుచేత దీనిని సకలజనులు గమనింతురు. లండననగరపు లార్డుమేయరు మంత్రిమండలిని విందునకు పిలుచును. భోజనముకాగానే సారాబుడ్ల బిరడాలుతీతురు. హాజరైనవారందరును గృహస్థు అతిథులయొక్క ఆరోగ్యమునకై త్రాగుదురు. ఈ కులాసా జరుగుచుండగా ఉపన్యాసములు చేతురు. బ్రిటిషుమంత్రివర్గము నకు సన్మానమును ఉపపాదింతురు. ప్రధానమంత్రి పైనదెల్పిన ముఖ్యోపన్యాసమును దాని ప్రత్యుత్తరముగా ప్రకటించును. ప్రజాహిత వ్యవహారములలో నెట్లో వ్యక్తివ్యవహారములలో గూడ అట్లే జరుగుచుండును. ఎవరితోనైన ముఖ్యముగా మాట్లాడదలచినయెడల, ఆచారప్రకారము వారిని విందుకు పిలుతురు. విందుమధ్యనుగాని పిమ్మటగాని విషయములను గూర్చి మాట్లాడుదురు. మేముగూడ ఈ ఆచారప్రకారము ఒకమారుగాక అనేకపర్యాయములు ప్రవర్తించవలసివచ్చెను. కాని మేముమాత్రము మాంసమును మద్యమును ముట్టలేదు. మా ముఖ్యసహాయకులను ౧౦౦ మందిని అల్పాహారమునకు పిలిచితిమి. మేము శెలవుతీసుకొనుటకును, స్థాయిసంఘమును

యేర్పరుచుటకును ఉద్దేశించితిమి. ఇచ్చటను భోజనానంతరము ఉపన్యాసము చేయబడెను. ఉపసంఘమేర్పాటుచేయబడెను. మా ఉద్యమమునకు అధిక ప్రచారము సంపాదించితిమి.

ఇంగ్లండులో ఆరువారము లుండి దక్షిణాఫ్రికాకు తిరిగి పయనమయితిమి. మెడీరా మకామునకు వచ్చునప్పటికి మాకు రిచ్చిగారి వద్దనుండి తంతివార్త వచ్చెను. ఇంకను విచారించకుండ ట్రాన్సువాలుచట్టమును అమలులో పెట్టుటకు సమ్మతి నియ్యమని చక్రవర్తిగారికి సలహానిచ్చుటకు తానసమర్థుడనని ఎలిజన్ ప్రకటించినట్లు ఈతంతివార్తలో కలదు. (ట్రాన్సువాలుచట్టము తాత్కాలికముగా నిరాకరింపబడినదని దీనిభావము) మా సంతోషమునకు మేరలేదు. తరువాత రెండువారములలో మేము కేపుటవును చేరితిమి. ఈరోజులు సంతోషముతో గడిపితిమి. మా ఇతరకష్టములు నివారించుట కొరకు అనేక ఊహలు పన్నితిమి. కాని దైవకృత్యములు ఊహించనలవికాదు. మేము కట్టిన ఆకాశహర్మ్యములన్నియు క్రిందకు దొర్లిపడి శూన్యములోనికి ఎట్లు శుష్కించిపోయెనో తరువాత అధ్యాయములో చూతుము.

ఈ అధ్యాయము ముగించులోపల ఒకటిరెండు స్మరించదగిన పవిత్రమైన అంశములను చెప్పవలెను. ఇంగ్లండులో నున్న కాలములో ప్రతినిమిషము ఉపయోగించితిమి. అనేకములైన ప్రకటనలు ఉత్తరములు మొదలగునవి పంపుటకు మాకు అలవికాకపోయెను. ఇతర సహాయము అవుసర

మయ్యెను. ధనము ఇట్టి సహాయము చేకూర్చును. కాని డబ్బు ఇచ్చికొన్న సహాయము పూర్తిగా ఐచ్ఛికమైన సేవతో యెన్నడును పోల్చతగదని నలుబదియేండ్ల పైకాలముగా నున్న నాయనుభవమే నాకు చెప్పుచున్నది. అదృష్టవశమున ఇట్టి ఐచ్ఛికసహాయకులు మాకు చాలమంది దొరకిరి. ఇంగ్లండులో చదువుచున్న భారతయువకులు మాచుట్టుచేరిరి. ఎవ్విధమైన కీర్తిగాని ప్రతిఫలమునుగాని కోరకయే వారిలో కొందరు మాకు రాత్రింబవలు సహాయము చేసిరి. చిరునామాలు వ్రాయుటగాని, బిళ్లలు అంటించుటగాని, ఉత్తరములు టపాలో వేయుటగాని, యేదైననుసరే, మాకు అవమానకరమని ఎవరైనను ఎప్పుడైనను నిరాకరించినట్లు నాకు జ్ఞాపకము లేదు. కాని సైమండ్సు అను ఒక ఇంగ్లీషు స్నేహితుడు వీరలనందరిని పక్కకునెట్టి మించిపోయెను. దేవతలకు ప్రియుడగువాడు బాల్యమున మరణించును. అట్లే ఈ పరోపకారియగు ఆంగ్లేయుడును చనిపోయెను. వానిని నేను మొట్టమొదట దక్షిణాఫ్రికాలో కలసితిని. ఆతడు భారతదేశములో కొన్నాళ్లు ఉండెను. 1897 లో బొంబైలో నున్నపుడు బొబ్బలజాడ్యము వలన బాధనొందిన వారల మధ్య నిర్భయముగా తిరిగెను. వారలకు సేవచేసెను. అంటురోగములవల్ల బాధితులగు వారికి సేవజేయునపుడు మృత్యువువలన భయమునొందకుండుట ఆతనికి రెండవ స్వభావమైనది. వానికి అణుమాత్రమైనను జాతిభేదము రంగుభేదము లేదు. ఆతడు స్వతంత్రాలోచనా

పరుడు. అల్పసంఖ్యాకులు సత్యమార్గమున నిలుతురని అతను నమ్మెను. ఈ విశ్వాసమే అతనిని జోహానెస్సుబర్గులో నాచెంతకు చేర్చెను. అతడు పరిహాసముగా నాతో చెప్పుచుండెడి వాడు. నేను అధికసంఖ్యాకులలో చేరుట సంభవించిన యెడల తాను నాకు జేసెడి సహాయమును విరమించును అనుచుండును; వేలనన స్వయముగా సత్యము కూడ, అధికసంఖ్యాకుల చేతులలో పడి కళంకమొందుననని, అతని అభిప్రాయము. అతను బాగా చదివినవాడు. జోహానెస్‌బర్గులోని కోటీశ్వరులలో నొకడగు సర్ జార్జిఫర్రార్‌కు, ఇతను ఆంతరంగిక కార్యదర్శిగా నుండెను. టైపుచేయుట యందు నిపుణుడు. మేము ఇంగ్లండు వెళ్లినపుడు అతను అక్కడనే యుండెను. అతను యెక్కడ నున్నది నాకు తెలియదు. కాని మాప్రజాహిత కార్యములు పత్రికలలో ప్రకటించబడుచున్నందువలన, ఈ ఉదార పురుషుడు తానేవచ్చి మమ్ము కనుగొనెను. తాను చేయుగలది యేదైయైనను చేతునని తన సంసిద్ధతను తెలిపెను. "మీకు సేవకుడు కావలసిన ఆపనిచేతును. టైపుచేయువాడు కావలసిన ఆపని చేతును. ఇందులో నామాదిరి వానిని మీరు సామాన్యముగా సంపాదించలేరు." అని అతడు చెప్పెను. మాకు ఈరెండు సేవలు అవసరమే. వేతనములేకుండ రాత్రింబవలు మాకొరకు ఈ ఆంగ్లేయుడు కష్టపడెను. ఇందులో అతిశయోక్తి యేమి యును లేదు. ఎప్పుడును రాత్రి పన్నెండుగంటలవరకు టైపు చేయుచుండును. మేము పంపెడివార్తలను ఇతరులకు చేర్చ

చుండును. ఉత్తరములు టపాలో వేయుచుండును. ఎప్పుడును చిరునవ్వు ఆతని పెదవులపై చిందులాడుచుండును. వాని నెలసరి ఆదాయము షుమారు ౨౫ పౌనులు. కాని అంతయును స్నేహితులకో, ఇతరులకో, సహాయము చేయుటలో వ్యయపరుచును. అతనికి ముప్పదియేండ్ల వయస్సు. వివాహము కాలేదు. ఎన్నటికైనను చేసికొనదలచలేదు. ధనముతీసుకొమ్ము అని నేను బలవంతపెట్టితిని. ఆతను నిస్సంకోచముగా నిరాకరించెను. "ఈ సేవకు ప్రతిఫలము నేను అంగీకరించిన యెడల, నావిధ్యుక్తమును నిర్వహించుటలో తప్పిపోయినవాడ నగుదును." అని వాడు చెప్పెను. మాసామానులను కట్టుకొని ప్రయాణమగుచున్న చిట్టచివరరాత్రి మూడుఘంటల వరకు అతను మేలుకొని యుండెను. అని నాజ్ఞాపకము. మరునాడు మమ్ము ఓడ నెక్కించి మావద్ద శెలవు తీసుకొనెను. అది సంతాపకరమైన వియోగము. పరోపకారము యెరువుతోటకు మాత్రమే ప్రత్యేకలక్షణ గాదని అనేకమారులు నేను గ్రహింపగలిగితిని.

ప్రజాహితసేవచేయగోరు యువకుల లాభమునిమిత్తము మేము మా రాయబారపు ఆదాయవ్యయములనుగూర్చిన లెఖ్ఖ యెంతజాగ్రతగా నుంచితిమో ఇచట తెలిపెదను. ఓడమీదకొన్న సోడానీరుమొదలు చిన్నచిన్న పద్దులకు సైతము మేము రశీదుల నుంచితిమి. అట్లే తంతివార్తల రశీదుల నుంచితిమి. వివరముగా లెక్కలు వ్రాయునప్పుడు చిల్లర

ఖర్చులక్రింద ఒకపద్దు అయినను వ్రాసినట్టు గుర్తులేదు. మామూలుగా చిల్లరఖర్చులు మాలెక్ఖలలో కనపడవు. పగలంతయు ఖర్చుపెట్టిన డబ్బుకు రాత్రిపూట లెఖ్ఖవ్రాయునపుడు మరువు కగిలినను ఏకొద్ది పెన్నిలో, షిల్లింగులో తప్ప వేరే చిల్లరఖర్చులు లేనేలేవు.

మన యుక్తవయస్సు వచ్చినప్పటినుండి మనము ధర్మకర్తలమో, బాధ్యతగల ప్రతినిధులమో అగుదుము. ఈ వాంశమును మానవజీవితములో స్పష్టముగా నేను గుర్తించితిని. మనము తలిదండ్రులవద్ద నున్నంతవరకు, వారు మనకు ఒప్పగించిన ధనమునకో, పనికో, లెఖ్ఖచెప్పవలెను. వారు మన క్రమప్రవర్తనను గూర్చి నిశ్చితులై మనలను లెఖ్ఖ లడుగక పోవచ్చును గాని దానిచే మనబాధ్యతలో భేదమురానేరదు. మనము స్వతంత్రగృహస్థులమైనప్పుడు మన కుటుంబముయెడ మనకు బాధ్యత యేర్పడును. మన సంపాదనల కంతకును మనము యేకాధికారులము కాము. మనతోపాటు మన కుటుంబముకూడా భాగస్వాము లగుదురు. వారికొరకు ప్రతి దమ్మిడికిని మనము లెఖ్ఖ చెప్పవలెను. వ్యక్తిజీవితములోనే బాధ్యత ఇట్లున్నప్పుడు ప్రజాహితజీవితములో ఇది అత్యధికముగా నున్నది. ఐచ్ఛికసేవకులు సీజరు భార్యవలె తాము అనుమానమునకు అతీతుల మనుకొందురు. తమ కిచ్చిన ధనమునకును, పనికిని వివరములతో లెఖ్ఖ చెప్పవలసిన బాధ్యత లేనట్లు ప్రవర్తింతురు. ఈ భావమును నేను గమనించినాను, ఇది శుద్ధ

బుద్ధిహీనత. విశ్వాసపాత్రతకుగాని, అపాత్రతకుగాని లెక్కలుంచుటలో సంబంధమే లేదు. లెక్కలుంచుట స్వతంత్రమైన విధి. పరిశుభ్రమైన సేవకు దీని నిర్వహణ మత్యవసరము. మనము ఏ సంస్థకు ఇచ్ఛికముగా సేవ చేయుచున్నామో, దాని ప్రధాననాయకులు అగౌరవము అను పొరబాటు అభిప్రాయముచేతగాని, భయముచేతగాని, మనలను లెక్కలు అడుగక పోయినయెడల, అప్పుడు వారుకూడ మనతోపాటు నిందార్హులే. వేతనముపొందు సేవకుడు తాను చేయుపనికిని ఖర్చుపెట్టు ధనమునకును లెక్క ఇవ్వవలసిన యెడల ఐచ్ఛికుని బాధ్యత రెట్టింపుగా గలదు. వీనికి వీని సేవయే ప్రతిఫలము. ఇది చాలముఖ్యమయిన విషయము. అనేకసంస్థలలో దీనికి ప్రాముఖ్యము ఇచ్చుట లేదని నాకు తెలుసును కనుక ఇచ్చట దీనినిగూర్చి ఇంత విపులముగా వ్రాయ సాహసించితిని.

---

## 15 వ అధ్యాయము

## వక్ర విధానము

---

మేము కేపుటవునులో దిగగానే జోహానిస్‌బర్గు పోగానే రిచ్చి ఇచ్చిన తంతివార్తను గూర్చి అత్యాశపొందితిమని తెలుసుకుంటిమి. దానికి రిచ్చి బాధ్యుడుకాడు. ఈ చట్టము నిరాకరించబడినదని విన్న అంశము మాత్రమే అతను మాకు తెలిపెను. లోగడ తెలిపినట్లు అప్పుడు

అనగా ౧౯౦౭ లో ట్రాన్సువాల్ చక్రవర్తి పరిపాలనకు లోబడిన వలసరాజ్యము. ప్రతి వలసరాజ్యమును ఇంగ్లండులో ఒక ప్రతినిధిని ఉంచుకొనును. వలసరాజ్య ప్రయోజనములకు సంబంధించిన విషయములలో వలసరాజ్యముల మంత్రికి, తగిన సమాధానము చెప్పుట యీ ప్రతినిధి విధులలో నొకటి. దక్షిణాఫ్రికాలో ప్రఖ్యాత న్యాయవాదియైన సర్ రిచర్డుసాల మన్, అప్పుడు ట్రాన్సువాలు ప్రతినిధిగానుండెను. వానితో సంప్రదించి ఎల్జిన్ ప్రభువు నల్లచట్టమును త్రోసివేసెను. ౧౯౦౭ సం. ది ౧ జనవరి తేదిన బాధ్యతాయుత ప్రభుత్వము ట్రాన్సువాలులో ప్రవేశింపబడనుండెను. "బాధ్యతాయుత ప్రభుత్వము యేర్పడినపిమ్మట సమావేశమగు శాసనసభవారు ఇట్టి శాసనమును చేసినయెడల దానికి రాజసమ్మతి నిరాకరించబడదు" అని ఎలిజన్ సాలమనుగారికి అభయము నిచ్చిరి. ట్రాన్సువాలు చక్రవర్తి పరిపాలనకు లోబడిన వలసరాజ్యముగా నున్నంతవరకు జాతిభేదమునుబట్టి చేసిన శాసనములకు సామ్రాజ్య ప్రభుత్వమువారే బాధ్యులుగా నుందురు. జాతిభేదము నెలకొల్పుట, బ్రిటిషుసామ్రాజ్య ప్రధానసిద్ధాంతములనుండి పెడత్రోవ త్రొక్కుటయగును. కాన ఈనల్లచట్టమును త్రోసివేయుమని చక్రవర్తిగారికి ఎలిజన్ సలహా చెప్పక తప్పినదికాదు.

అనగా ఈనల్లచట్టము నామకహా త్రోసివేయుటయు, ట్రాన్సువాలులోని ఐరోపీయులు తమ ఇష్టప్రకారము ప్రవర్తిం

చుటయు, సంభవించెను. ఇట్టి మంచి యేర్పాటుకు సాలమను ఆక్షేపించతగిన కారణములేదు. దీనినే నేను వక్రవిధానము అని అంటిని. దానికి ఇంతకంటెను కఠినమైన పేరు నిరాక్షేపణీయ ముగా పెట్టవచ్చును. చక్రవర్తి పరిపాలనకు లోబడిన వలస రాజ్యములలో శాసన అధికారబాధ్యత సామ్రాజ్య ప్రభుత్వము వారిదే. జాతినిబట్టిగాని, రంగునుబట్టిగాని, భేదము చేయుటకు సామ్రాజ్య రాజ్యాంగ పద్ధతిలో అవకాశము లేదు. అంతవరకు మంచిదే. బాధ్యతాయుత ప్రభుత్వమును పొందిన వలసరాజ్యములలో చేసిన శాసనములను సామ్రాజ్య ప్రభుత్వము వారు తటాలున నిరాకరించలేరు. ఇదికూడ అర్థము చేసుకొనవచ్చును. కాని వలసరాజ్య ప్రతినిధులతో రహస్యాలోచనలుచేయుట, బ్రిటిషు సామ్రాజ్య విధానమునకు ప్రత్యక్ష విరుద్ధముగానున్న శాసనములకు మున్ముందుగానే రాజసమ్మతిని వాగ్దత్తము చేయుట విశ్వాసఘాతుకముగాని యెడల దీని పేరేమి? ఎవరిహక్కులు దొంగిలింపబడినవో వారికిది అన్యాయముగానియెడల దీని పేరేమి? నిజము చెప్పిన యెడల ఎలిజన్ ప్రభువు తానిచ్చిన యీ అభయహస్తము వలన ట్రాన్సువాలు ఐరోపీయులు భారతీయులకు విరుద్ధముగా చేసెడికృషిలో, వారలను మరింత ప్రోత్సాహపరిచెను. తానట్లు చేయదలచినయెడల భారతీయ రాయబారవర్గమునకు స్పష్టముగా అట్లు చెప్పియుండవలసినది. బాధ్యతాయుత ప్రభుత్వమును అనుభవించెడి వలసరాజ్యములుచేయు శాసనములకు

గూడ సామ్రాజ్యము బాధ్యతవహించకతప్పదు. నిజమాలోచించిన సామ్రాజ్యము ఆబాధ్యతనుండి తప్పించుకొనజాలదు. అట్టి వలసరాజ్యములు గూడ బ్రిటిషు రాజ్యాంగ విధానములోని ప్రధాన సూత్రములను అంగీకరించవలసినదే. (ఉదాహరణ) చట్టసమ్మతమైన బానిసత్వమును ఏవలసరాజ్యమైనను పునరుద్ధరించలేదు. అక్రమ శాసనమనియే ఈనల్లచట్టమును ఈయన నిరాకరించగలుగును. అట్లు నిరాకరించి యుండిన యెడల ఈయన, సాలమనును రహస్యముగా యీరీతిగా హెచ్చరించవలసి యుండెను. అది ఆయన విధి. "బాధ్యతాయుతప్రభుత్వము ఇవ్వబడినపిమ్మట ఇట్టి పాపపు చట్టమును ట్రాన్సువాలు చేయగూడదు. అట్టి యుద్దేశ్యము ట్రాన్సువాలుకు ఉన్నయెడల ట్రాన్సువాలుకు బాధ్యతాయుతప్రభుత్వము ఇవ్వవచ్చునా, లేదా అను సంగతిని సామ్రాజ్యప్రభుత్వమువారు తిరిగి విచారించవలసి వచ్చును." లేదా ఆయన సాలమన్‌తో ఇట్లు చెప్పియుండవచ్చును. "భారతీయుల హక్కులను పూర్తిగా సంరక్షించు షరతుమీాదనే మీకు బాధ్యతాయుతప్రభుత్వమును ఇయ్య వీలుపడును." ఇట్టి సక్రమమైన విధానమును ఎలిజన్ అనుసరించలేదు. దానికి బదులు భారతీయులయెడ స్నేహభావమును పైపైన జూపెను. అప్పుడే నిజముగా, రహస్యముగా ట్రాన్సువాలు ప్రభుత్వమును బలపరచుచుండెను. తాను నిరాకరించిన చట్టమునే తిరిగి శాసించమని వారిని ప్రోత్సాహ పరుచుచుండెను. బ్రిటిషు సామ్రా

జ్యమువారు వక్రవిధానము ననుసరించుటకు ఇది మొదలు గాదు. ఇది ఒకటే నిదర్శనమును కాదు. దాని చరిత్రను అజాగ్రత్తగా చదివినవాడుగూడ ఇట్టి వ్యవహారములను తేలికగా గమనించగలడు.

కాన జోహానిస్‌బర్గులో ప్రతివాడును దీనినిగూర్చి మాట్లాడసాగిరి. ఎలిజను ప్రభువును, సామ్రాజ్య ప్రభుత్వమును చేసిన టక్కరితనము చర్చనీయాంశ మయ్యెను. మదీరాలో యెంత సంతోషించితిమో, దక్షిణాఫ్రికాలో అంత నిరాశ జెందితిమి. ఈ మోసముయొక్క ప్రత్యక్షఫలితముగా భారతీయబృందము పూర్వముకన్న మరింత ఉత్సాహపూరిత మయ్యెను. "మన పోరాటము సామ్రాజ్యప్రభుత్వమునుండి పొందు సహాయముమీాద ఆధారపడియుండలేదు. కాన మన మెన్నడును భయపడవలసిన అవసరము లే" దని ప్రతివాడును చెప్పసాగిరి. సహాయమునకు మనలనే మనము ఆశ్రయించుకొనవలెను. అంతేగాక దీనిని నిరోధించుటకు యే దేవుని పేర మనము ప్రమాణము చేసితిమో ఆయనను ఆశ్రయించవలెను. మనము మన సిద్ధాంతములను నిజముగా ఆచరణలో పెట్టినయెడల, వక్రవిధానమైనను సకాలములో సక్రమమగును.

ట్రాన్సువాలులో బాధ్యతాయుతప్రభుత్వము యేర్పరచబడెను. క్రొత్తశాసనసభ చేసిన మొట్టమొదటి చట్టము, ఆదాయవ్యయ చట్టము; రెండవది, ఆశియా దేశస్థుల రిజిష్ట్రేషను చట్టము (అనగా నల్లచట్టము). పాతచట్టమునకును

దీనికిని ఒకే మార్పుగలదు. అది, అందులో చెప్పబడిన తేది మార్పు మాత్రమే. మధ్యజరిగిన కాలవ్యవధివల్ల ఇది అవసరమయ్యెను. మొదటి చట్టమునకు ఇది సరియైన నకలు. ౨౧-౩-౧౯౦౭ సం॥న ఒక్క సమావేశములోనే అన్ని అంతరువులగుండ దానిని నెట్టి నడిపించిరి. నల్లచట్టమును నిరాకరించుట అనునది స్వప్నమువలె మరుపు తగిలెను. భారతీయులు మామూలుగా మహజర్లు వగైరాలు పంపిరి. కాని వీనిని వినువాడెవడు? ౧-౭-౧౯౦౭ నుండి ఇది అమలులోనికి వచ్చునని ప్రకటించిరి. ఆ జూలై నెల ౩౧వ తేది లోపల రిజిష్టరు చేసుకొనుటకు భారతీయులను హెచ్చరించిరి. దీనిని అమలు జరుపుటలో గల ఆలస్యము భారతీయులకు సహాయము చేయుకొరకుగాదు. వారి అవసరములను బట్టి ఆలస్యమయ్యెను. చక్రవర్తిగారి సమ్మతిని నామకహా అయినను పొందవలసి యుండెను. తగిన నమోనాలు తయారు కావలసియుండెను. తగినన్ని కార్యస్థానములు వివిధప్రదేశములలో పెట్టవలసి యుండెను. దీని కంతకును వ్యవధి అవసరము. ట్రాన్సువాలు ప్రభుత్వ స్వంతసౌకర్యమునకే ఈ ఆలస్యము ఉద్దేశింపబడెను.

# 16 వ అధ్యాయము

## అహమ్మద్ మహమ్మద్ కచ్చాలియా

మా రాయబారవర్గము ఇంగ్లండు వెళ్లుచుండగా దోవలో ఒక ఆంగ్లేయునితో మాట్లాడితిని. ఆసియా దేశస్థులకు వ్యతిరిక్తముగా ట్రాన్సువాలు ప్రభుత్వమువారు చేసిన శాసనములగూర్చియే మా సంభాషణము. ఆ ఆంగ్లేయుడు దక్షిణాఫ్రికాలో స్థిరనివాసము యేర్పరచుకొనెను. మేము ఇంగ్లండుపోవు ఉద్దేశ్యము ఆయనకు చెప్పగానే ఆయన ఎలుగెత్తి ఇట్లు అరచెను. "కుక్క మెడపట్టాను తప్పించుకొనుటకు మీరు లండను పోవుచున్నారు అని నేను గ్రహించితిని" అతడు ఈ ట్రాన్సువాలు పరిమిట్ (అనుమతిపత్రమును) కుక్క మెడపట్టాకు పోల్చెను. వానిభావము అప్పుడు నాకు స్పష్టముగా అర్థముకాలేదు. దానినిగురించి వ్రాయుచు యిప్పుడైనను అతనిభావము స్పష్టముగా చెప్పలేను. అతని ఉద్దేశ్యమేమిటో? భారతీయుల యెడగల అసహ్యామును, వారికి గలిగిన అవమానమునకు సంతోషమును ప్రకటించెనా? లేక ఈ వ్యవహారములో తనకుగలిగిన గాఢమైన కోపభావమును సూచించెనా? ఏ మనుజునిపలుకులనైనను వానికేఅన్యాయము జరుగునట్లు అర్థముచేయరాదు. ఇది సువర్ణసూత్రము. దీనిని బట్టి ఈ ఆంగ్లేయుడు చిత్రించిన ఉపమానము దెలిపిన దృగ్గో

చర సాధనమైన సంభాషణమును ఆయన గూఢభావమును తెలుపుటకే వాడెనని నే నంగీకరింతును. ఇది ఎట్లైననుసరే. ఒకవైపున ట్రాన్సువాలు ప్రభుత్వమువారు ఈ కుక్కమెడ పట్టాను భారతీయుల కుత్తుకలపై కట్టుటకు ప్రయత్నించుచుండిరి. రెండవవైపున ప్రభుత్వయొక్క ఈ దుర్మార్గ విధానమునకు భిన్నముగా పోరాటము సలుపుటకు భారతీయులు తయారగుచుండిరి. ఈ కుక్కమెడపట్టాను ధరించగూడదను తీర్మానమును దృఢపరుచుటకై యేర్పాట్లు చేసుకొనుచుండిరి. ఇంగ్లండులోను, ఇండియాలోను, ఉన్న స్నేహితులకు మామూలుగా ఉత్తరములు వ్రాయుచుంటిమి. ఇచ్చట పరిస్థితులు రోజువారిగా వారికి తెలుపుచుంటిమి. కాని సత్యాగ్రహ పోరాటము వెలుపలిసహాయముమీాద బహుస్వల్పముగా ఆధారపడియుండును. ఆంతరంగికమైన తరుణోపాయములే కార్యకారియగును. కాన భారతీయబృందములోని వివిధ భాగములను సమున్నతస్థాయిలో నిలువబెట్టుటకు చేయు ప్రయత్నములతోడనే నాయకులకాలము ముఖ్యముగా గడుచుచుండెను.

ఈ పోరాటమును సాగించుటకు ఎట్టిసంస్థను యేర్పరచవలెనను నదియే ముఖ్యసమస్య. టీ. బి. భా. సం. లో చాలమంది సభ్యులు గలరు. దానిని స్థాపించినపుడు సత్యాగ్రహ మింకను పుట్టలేదు. ఈ సంఘము గడచినకాలములో నిరోధించెను. రాబోవుకాలములో నిరోధించును. ఒక అక్రమ చట్టమునేగాక

అట్టివి యెన్నియైననుసరే అది నిరోధించును. అక్రమచట్టము లకు నిరోధమును వ్యాపింపచేయుటయేగాక సాంఘికమైన రాజకీయమైన అనేకవిధులను అది నిర్వహించవలసియుండెను. మరియు ఆసంఘసభ్యులందరును సత్యాగ్రహము మూలమున ఈ నల్లచట్టమును నిరోధించుటకు ప్రమాణములు చేయలేదు. ఈ సంఘము సత్యాగ్రహపోరాటముతో కలసిపోయినయెడల, దీనికి వెలుపలనుండి రాదగిన ఆపదలను మనము గమనించ వలెను. ఈ సత్యాగ్రహపోరాటమును రాజద్రోహకరమనియు దీని నడుపుసంస్థలు అక్రమసంఘములనియు, ట్రాన్సువాలు ప్రభుత్వమువారు ప్రకటించిన యేమగును? అట్టిసమయములో సత్యాగ్రహులుగాని సభ్యులస్థితి యేమగును? సత్యాగ్రహము అను ఆలోచన పుట్టకముందే వసూలుచేసిన ధనము యేమ గును? ఇవి అన్నియు బలమైన హేతువులు. ఇంతేగాదు. సత్యాగ్రహులు తమపోరాటములో చేరనివారిపై ఏవిధమైన దుర్భావమును ఉంచుకొనరాదు. విశ్వాసము లేకపోయినను, దుర్బలమువల్లనైనను, ఇతరకారణమువల్లనైనను వారు చేరక పోవచ్చును. వారిమీద దుర్భావము ఉండరాదు సరేకదా, వారికిని తమకును ఇదివరకున్న స్నేహసంబంధములు తగ్గకుండ నుంచుకొనవలెను. ఈ సత్యాగ్రహపోరాటముగాక ఇతర ఉద్య మము లన్నిటిలో వారితో కలసిమెలసి పనిచేయవలెను. ఈ భావములు సత్యాగ్రహుల మనస్సులలో దృఢముగా నాటు కొని యుండెను.

ఈఅన్ని కారణములవలన ప్రస్తుత సంస్థలద్వారా సత్యాగ్రహ పోరాటము జరుపరాదని భారతీయ బృందము తీర్మానించెను. ఈసంస్థలన్నియు శక్తికొలది సహాయము చేయవచ్చును. సత్యాగ్రహముకాక ఇతర అన్నివిధముల నల్లచట్టముల నిరోధించవచ్చును. సత్యాగ్రహము జరుపుటకు మాత్రము సాత్విక నిరోధ సంఘము అను ఒక క్రొత్తసంస్థను సత్యాగ్రహులు స్థాపించిరి. దీనికిబెట్టిన ఇంగ్లీషు పేరునుబట్టి ఈసంస్థ స్థాపించినప్పటికి సత్యాగ్రహము అను పదము సృజింప బడలేదు అని పాఠకుడు తెలుసుకొనవచ్చును. కాలము జరిగిన కొలది ఈనూతనసంస్థ స్థాపించుటవలని లాభములు బయల్పడెను. అప్పటి సంస్థలద్వారా సత్యాగ్రహము జరిపినయెడల సత్యాగ్రహమునకు కొంత వెనుకంజకలిగియుండెడిది. ఈక్రొత్త సంఘములో అనేకమంది సభ్యులుచేరిరి. భారతీయబృందము ఔదార్యముతో ధనమిచ్చెను. ఏ ఉద్యమము అయినను ధనము లేనందున చిక్కిపోదు ఆగిపోదు. ఇది నాఅనుభవము. కాని ఈలోకములోని ఏఉద్యమమైనను ధనములేకుండ సాగునని దీనికి అర్థము చేయరాదు. ఎచ్చట, యే ఉద్యమములోనైనను, సత్యవంతులైన సత్పురుషులు, చుక్కాని చేపట్టినయెడల ఆవశ్యకమైన ధనమును, ఆఉద్యమము ఆకర్షించు తీరునని దీని యొక్క భావము. ఇంకొకవైపున నేను గమనించినదేమనగా ఏ ఉద్యమమైనను అధికధనముతో క్రుంగినప్పటినుండి అది పతనమగుచుండును. ఏ ప్రజాహిత సంస్థనైనను మూలధనముపై

వచ్చెడి వడ్డీనుండి నడిపినయెడల దానిని పాపమని చెప్ప సాహసించను, గాని అది మిక్కిలి అక్రమమైన విధానమని గట్టిగా చెప్పెదను. ప్రజాహిత సంస్థల కన్నిటికిని ప్రజలే నిధి (బ్యాంకు) అయి యుండవలెను. ఈసంస్థలు ప్రజలుకోరిన కాలమునకు మించి ఒక్కరోజైనను నిలువరాదు. కూడబెట్టిన మూల ధనముపై వడ్డితో నడిచెడిసంస్థ ప్రజాభిప్రాయమునకు లోబడి యుండదు. నిరంకుశమును అభిమానపూరితమును అగును. శాశ్వతనిధులలో నడుచుచున్న సాంఘిక రాజకీయ సంస్థల లోని కుళ్లును తెలుపుటకు ఇది తగినచోటుకాదు. ఈ పరివర్తనము బహుసామాన్యముగా నున్నది. పరుగెత్తుచున్న వాడైనను దీనిని గ్రహించవచ్చును.

కాని మనము మనకథకు తిరిగి రావలెను. న్యాయవాదులును, ఇంగ్లీషు చదువుకున్నవారును మాత్రమే వెంట్రుకలను పగులగొట్టగల విమర్శనాశక్తిలో సర్వాధికారమును ఏవిధముననను పొందియుండలేదు. దక్షిణాఫ్రికాలోని నిరక్షరకుక్షులైన భారతీయులుగూడ సూక్ష్మమైన భేదములను కనిపెట్టుటకును, సున్నితమైన వాదములు చెప్పుటలోను చక్కని శక్తిగలవారే యని నేను గ్రహించితిని. ప్రాతచట్టము రద్దు పరచబడినది గనుక నాటకశాలలోచేసిన ప్రమాణము నెగ్గిన దని కొందరు వాదించిరి. ఆసభ యైనపిమ్మట దుర్బలులు అయినవారు ఈమిషక్రింద శరణుజొచ్చిరి. ఈవాదములో బలము లేకపోలేదు. కాని యెవరినిరోధము ఆప్రత్యేకచట్టము

నకుగాక ఆచట్టమునకు అంతర్లీనమైన దుష్టసిద్ధాంతమునకు ప్రవర్తింపచేయబడెనో వారికి యీవాదము నచ్చలేదు. అయినను క్షేమము నిమిత్తమును, భారతీయబృందముయొక్క జాగ్రతస్థితిని బలపరుచుటకును, దుర్బలమున్నయెడల దాని లోతు కనుగొనుటకును, ప్రమాణములను తిరిగి చేయించుట అవసరమయ్యెను. కాన ప్రతిచోటను సభలు చేయబడెను. ఆసభలలో పరిస్థితులు వివరింపబడెను. క్రొత్తగా ప్రమాణములు చేయబడెను. భారతీయబృందముయొక్క ఉత్సాహము యెప్పటివలెనే ఉన్నతస్థాయిలో నున్నట్లు కనుగొనబడెను.

ఇంతలో ఆపద్భరితమైన జూలైమాసము చివరకు వచ్చుచుండెను. ఆనెల చివరరోజున ట్రాన్సువాలు రాజధాని యగు ప్రెటోరియాలో భారతీయుల సామాన్యసభ చేయ తీర్మానించుకొంటిమి. ఇతర ప్రదేశములనుండి ప్రతినిధులు పిలువబడిరి. ప్రెటోరియా మసీదువద్దనున్న కాళీస్థలములో సభ చేయబడెను. సత్యాగ్రహము ప్రారంభించినప్పటినుండియు మాసభలకు అనేకమంది హాజరగుచుండిరి. ఏభవనమును చాలకుండెను. ట్రాన్సువాలులోనున్న భారతీయులందరును ౧౩ వేలకు మించరు. అందులో ౧౦ వేలు జోహానిస్సుబర్గు, ప్రెటోరియా పట్నములలోనే నివసించిరి. పదివేలజనాభాలో నుండి సభలకు ౨ వేలు హాజరయినయెడల ప్రపంచములో యెక్కడనైనను అది ఘనమైన తృప్తికరమైన సభ యని యెంచబడును. బహుజనులకు సంబంధించిన సత్యాగ్రహో

ద్యమము ఇంక యీజనస్తోమముతో తప్ప యింక యితరవిధమునను సాగనేరదు. అచ్చేగా ఆంతరంగికబలముమీదనే పోరాటము ఆధారపడి యున్నపుడు బహుజనులు కట్టుబాటులోనికి రానియెడల అది అసలేసాగదు. కాన ఇట్లు హెచ్చుమంది హాజరగుట ఆశ్చర్యకరమని ప్రచారము తలచలేదు. మొదటి నుండియు కాళీస్థలములోనే సభలు చేయనిశ్చయించిరి. అందువల్ల ఖర్చు చాలభాగము తప్పించుకొన గలిగితిమి. చోటులేదనే కారణములవల్ల నిరాశచెంది తిరిగి పోవలసిన అవసరము ఎవరికిని లేకుండెను. మరియు యీసభలన్నియు బహుశాంతముగా జరుగుచుండెను. సభ్యులు ప్రతివిషయమును శ్రద్ధగా వినుచుండిరి. వేదికకు దూరముగా నున్నవారికి వినపడనియెడల బిగ్గరగా మాట్లాడమని కోరుచుండిరి. ఈసభలలో కుర్చీలు లేవని పాఠకునకు చెప్పనవసరములేదు. ప్రతివాడును నేలమీాద కూర్చుండెను. అధ్యక్షుడు, ఉపన్యాసకుడు, మరి ఇద్దరు స్నేహితులు కూర్చుండుటకు ఒకవేదిక అమర్చబడెను. దానిమీాద ఒక చిన్నబల్లయు, కొన్ని కుర్చీలును లేక కుర్చీపీటలును ఉంచబడెను.

టి. బి. భా. సం. కు తాత్కాలికాధ్యక్షుడైన యోసఫ్ యిస్మాయిల్ మియాన్ ఈసభకు అధ్యక్షతవహించెను. నల్లచట్టము క్రింద అనుమతిపత్రముల నిచ్చుకాలము సమీపించిన కొలది యెంత ఉత్సాహముగా నున్నను, భారతీయులు సహజముగా ఆదుర్దా పొందుచుండిరి. కాని ట్రాన్సువాలు ప్రభుత్వము

యొక్క యావత్తుశక్తి తమవెనుక నున్నను బోథా, స్మట్సు సేనానులు గూడ భారతీయులకంటె తెక్కువ ఆదుర్దాపడలేదు. ఒకసంఘము నంతను శుద్ధ పశుబలముచేత తన యిచ్ఛకు లొంగునట్లు చేయుటకు యెవడును ఇష్టపడడు. కాన యీ సభకు మమ్ము హెచ్చరించుటకు హాస్కెనును, బోథాసేనాని పంపెను. వెనుక ఒక అధ్యాయములో పాఠకుడు ఈ పెద్దమనిషితో పరిచయము పొందియుండెను. సభ ఆయనను చక్కగా ఆదరించెను. ఆయన ఇట్లు చెప్పెను. "నేను మీాస్నేహితుడ నని మీారు యెరుగుదురు. ఈవిషయములో నాభావము లన్నియు, మీాకు అనుకూలమని నేను వేరే చెప్పనక్కరలేదు. నాకు శక్తియే యున్నయెడల, మీా విరోధులు మీా కోరికలను అంగీకరించునట్లు సంతోషముగా చేసియుందును. మీా భారతీయబృందమునకు ట్రాన్సువాలులోని యూరపియనులు సర్వసామాన్య విరోధభావమును వహించిరని మీాకు చెప్పనవసరము లేదు. బోథాసేనాని కోరికమీాద నేను యిక్కడకు వచ్చినాను. ఆయన తన సందేశమును ఈసభకు తెలుపమని నన్ను పంపినాడు. మీా యందు ఆయనకు గౌరవభావము కలదు. మీా అభిప్రాయములను గమనించి యున్నాడు. కాని ఆయన చెప్పుచున్నాడు "నేను నిస్సహాయుడను, ట్రాన్సువాలులోని యూరపియనులు అందరును ఇట్టిచట్టమును కోరుచున్నారు. దాని ఆవశ్యకతను గూర్చి నాకును నమ్మకకలదు. ట్రాన్సువాలు ప్రభుత్వము యెంతబలిష్ఠమైనదో భారతీయులు

పూర్తిగా యెరుగుదురు. అంతేగాక సామ్రాజ్యప్రభుత్వము వారు చట్టమును ఆమోదించియున్నారు. భారతీయులు శక్తి కొలది ప్రయత్నించిరి. పౌరుషవంతులగు మనుజులవలె ప్రవర్తించిరి. వారి నిరోధము నిష్ఫలమైనందున, చట్టము మంజూరైనందున; ఆ భారతీయబృందమువారు, దానికిలోబడి తమ రాజభక్తిని శాంతియందుగల తమ ప్రేమయును ఋజువు చేయవలెను. ఈ చట్టముక్రింద చేయబడు నియమములలో స్వల్పమార్పులు సూచించుచు, మీరుచేయు విన్నపములను, స్మట్సుసేనాని జాగ్రతగా పరిశీలించును." మీరు ఈ సేనాని సందేశమును అంగీకరించవలె ననియే స్వయముగా నేను సలహానిచ్చెదను. ఈ చట్టమును గురించి ట్రాన్సువాలు ప్రభుత్వము పట్టుదలతో ఉన్నారు. దీనిని నిరోధించుటయనిన గోడమీద మీతల కొట్టుకొనుటయే. నిష్ప్రయోజనమైన విరోధములో మీరు నాశనముకాకుందురనియు, అనవసరమైన బాధలను మీతలపై పడకుండ చేసుకొందురనియు, నేను కోరుచున్నాను." మాట మాట చొప్పున నేను దీనిని తర్జుమా చేసితిని. నా తర్పున కూడా జాగ్రత్తగా నుండుడని మరింత హెచ్చరించితిని. సంతోషధ్వనుల మధ్య హాస్కిను వెడలిపోయెను.

ఇప్పుడు భారతీయసభ్యులు ఉపన్యాసము చేయవలసియుండెను. అట్టి ఉపన్యాసకులలో చనిపోయిన అహమ్మద్ మహమ్మద్ కచ్చేలియా ఒకరు. ఆయన యీ అధ్యాయము

నకే గాక ఈ పుస్తకమునకంతకును ఈవీరుడు కథానాయకుడు. ఆయనను కక్షిదారుగాను, దుబాషీగాను, నేనెరిగియుంటిని. ఆయన అదివరకు యెన్నడును ప్రజాహితకార్యములలో విశేషముగా పాల్గొనియుండలేదు. ఆయనకు ఇంగ్లీషు కొంత వరకు తెలుసును. దానిని వాడుకవల్ల అభివృద్ధిచేసుకొనెను. తనస్నేహితులను ఇంగ్లీషున్యాయవాదులవద్దకు తీసుకొనిపోయి నప్పుడు, తానే దుబాష్‌గా నడుపగలిగియుండెను. కాని యీపని ఆయనకు వృత్తిగాదు. స్నేహమువల్లనే అట్లు చేయుచుండెను. మొట్టమొదట బట్టలు మూటలు కట్టుకొని తిరిగి అమ్ముచుండెడివాడు. పిమ్మట తనసోదరునితో భాగ స్వామిగా కలిసి కొద్దివర్తకము చేయుచుండెను. ఆయన సుర్తి మెమన్, మహమ్మదీయుడు. తన తరగతిలో మంచిమర్యాద గలవాడు. ఆయనకువచ్చిన గుజరాతియు కొద్ది. కాని అందులో కూడ అనుభవమువల్ల బోధింపబడి, మిక్కిలి అభివృద్ధిపొందెను. ఆయనకు తీక్షణమైన గ్రహణశక్తిగలదు. తనకుజెప్పినది యేదియైనను మిక్కిలి తేలికగా గ్రహించుచుండెను. చట్ట సంబంధమైన చిక్కులనుగూడ సులభముగా పరిష్కరించు చుండెను. ఆయనకుగల యీ సౌలభ్యము నాకు అనేక మారులు ఆశ్చర్యముకలిగించెను. న్యాయవాదులతోగూడ ఆయన చట్టములనుగూర్చి చర్చించుటకు సంకోచింపడు. తరుచుగా ఆయనవాదములు, వారు విచారించుటకుగూడ అర్హములైయుండెను.

దక్షిణాఫ్రికాలోగాని, ఇండియాలోగాని ధైర్యము లోను స్థైర్యములోను కచ్చాలియాను మించగల మనుష్యుని ఇంతవరకు నేను చూడలేదు. తన సర్వస్వమును భారతీయ బృందముకొరకై ఆయన యజ్ఞముచేసెను. ఆయన చెప్పిన మాటను యెన్నడును తప్పువాడుకాడు. సుర్తీ మేమాను మసీదుకు పాలనకర్తలలో నొక్కడు. మతాచారపరాయణుడు. కాని హిందువులను, మహమ్మదీయులను సమానదృష్టితో చూచుచుండెను. ఎన్నడుగాని మతోద్రేకముచేతగాని అక్రమ ముగా గాని హిందువులకు వ్యతిరేకముగా మహమ్మదీయు లతో చేరినట్లు నాకు గుర్తులేదు. రవంతయైనను భయముగాని పక్షపాతముగాని ఆయనకులేదు. తనకు అవసరమని తోచి నపుడు హిందువులకుగాని మహమ్మదీయులకుగాని వారి వారి లోపములను కనుపరుచుటకు యెన్నడును సంకోచింప లేదు. ఆయన నిరాడంబరత్వము, నమ్రత, ఇతరులు అనుసరించ దగియున్నవి. నాకు అనేకసంవత్సరముల పర్యంతము ఉండిన దగ్గిరసంబంధమునుబట్టి కలిగిన గట్టి అభిప్రాయమేమనగా, యే సంఘముగాని తనలో కచ్చాలియావంటి మనుజుని కలిగి యుండునని అరుదుగామాత్రమే చెప్పసాహసించగలను.

ఆసభలో మాట్లాడినవారిలో కచ్చాలియాకూడ చేరి యుండెను. ఆయన చిన్నఉపన్యాసమే చేసెను. ఇట్లు చెప్పెను "నల్లచట్టమేదియో, దాని అర్థమేదియో, ప్రతి భారతీయున కును తెలియును. నేను మిక్కిలి జాగ్రత్తగా పాస్కిను ఉప

న్యాసము వింటిని. మీరును అట్లే వినియున్నారు. ఆయన ఉపన్యాసము నానిశ్చయమునే స్థిరపరిచినది. ట్రాన్సువాలు ప్రభుత్వము యెంత బలీయమైనదో మనము యెరుగుదుము. ఇట్టిచట్టము చేయుటకంటె వేరేమియు అది చేయజాలదు. మనను ఖైదులో పెట్టవచ్చును. మనఆస్తి హరింపవచ్చును. ప్రవాసమునకు పంపవచ్చును. ఉరి తీయవచ్చును. ఇదంతయు మనము సంతోషముతో భరింతుము. కాని యీచట్టమును మాత్రము సహించజాలము." ఇట్లు మాట్లాడుచుండగా కచ్చాలియా హృదయము మిక్కిలి తపించినదని నేను కనిపెట్టితిని. ఆయన మొగము ఎర్రబడెను. మెడమీద తలమీద రక్తనాళములు పొంగెను. అందులో రక్తము తీవ్రముగా పారజొచ్చెను. ఆయన శరీరము వణకుచుండెను. తన కుడిచెయ్యి వ్రేళ్లను కంఠముమీద త్రిప్పుచు ఆయన ఇట్లు గర్జించెను "నన్ను ఉరిదీసినను సరే నేను యీచట్టమునకు ఒప్పుకోను అని దేవుని పేర ప్రమాణము చేయుచున్నాను. ఇక్కడ నున్నవారందరును ఇట్లే చేయవలెనని కోరుచున్నాను." ఇట్లు చెప్పి ఆయన కూర్చుండెను. ఆయన కంఠముమీద వ్రేళ్లు ఆడించుచుండగా వేదికమీద కూర్చున్నవారు నవ్విరి. వారితోపాటు నేనును నవ్వితినని నాకు జ్ఞాపకము. తన సాహసమైనపలుకులను పూర్తిగా ఇతను ఆచరణలో పెట్టగలడా అని నాకుగూడ కొంత అనుమానముగా నుండెను. ఆ అనుమానమునుగూర్చి ఇప్పుడును, ఆలోచించినప్పుడెల్లను నేను సిగ్గుపడుచున్నాను.

ఒక్క నిముషమైనను జంకకుండ ఆ మహాపోరాటములో తమ ప్రమాణములను తు. చ. తప్పకుండ నిలుపుకున్న భారతీయులనేకులలో ఈయన యెప్పుడును మొదటివాడుగా నుండెను.

ఆయన మాట్లాడుచుండగా సభవారు ఆయనను ఉత్సాహపరచిరి, సంతోషధ్వనులచేసిరి. అంతవరకు వీరుడని యెవరు యెరుగని యీకచ్చాలియాతో ఇతరులు అనేకులు స్వయముగా పరిచయము కలిగియుండిరి. నాకంటె అనేకులు అతనిని బాగా ఎరిగియుండిరి. తాను భావించినదే ఆయన చెప్పుననియు, చెప్పునదెల్ల చేయుననియు వారు యెరుగుదురు. ఇతరఉత్సాహపూరితమైన యుపన్యాసములును చేయబడెను. నేను కచ్చేలియాదే ప్రత్యేకముగా ఉదహరించుట కారణమేమన అతను ఇప్పుడు చెప్పిన పలుకులు అతని తరువాత జీవితమును గూర్చిన జోస్యముగా పరిణమించెను. అచట గంభీరోపన్యాసములుచేసిన ప్రతివారును చివరపరీక్షకు తాళలేదు. ఈపోరాటము అయిపోయిన నాలుగు సంవత్సరముల దరిమిలా చిట్టచివరకు భారతీయబృందమునకు సేవచేయుచు యుండి ఈమహాపురుషుడు ౧౯౧౮ లో చనిపోయెను.

ఇతరత్రా చెప్పుటకు వీలుగానిదియు కచ్చేలియాను గురించి స్మరించదగినదియు అయిన ఒక సంగతిని చెప్పి యీ అధ్యాయము ముగించెదను. సత్యాగ్రహుల కుటుంబములు అనేకములు నివసించిన టాలుస్టాయి ఫారమునుగురించి పాఠకుడు మున్ముందు వినును. ఇతరులకు మార్గదర్శకముగా

నుండుటకును, నిరాడంబరత్వము సేవాభావముగల జీవితము నకు అలవాటు పడుటకును, తన పదిపన్నెండు యేండ్లుగల కుర్రవాడగు ఆలీసి చదువు చెప్పించుటకై అక్కడికి పంపించెను. ఈ నిదర్శనమునుబట్టియే ఇతరమహమ్మదీయులును తమ పిల్లలను ఫారముకు పంపిరి. ఆలీ విధేయత, తేజస్సు, సత్యము, నిష్కపటముగల కుర్రవాడు. దైవము ఇతనిని తనతండ్రి కంటె ముందె తనదగ్గరకు తీసుకొనెను. అతను బ్రతికియున్న యెడల శ్రేష్ఠుడైన తండ్రికి అర్హుడైన కుమారుడు అగునను టలో నాకు అనుమానములేదు.

## 17 వ అధ్యాయము

## పానకములో పుల్ల

౧౯౦౭ సంవత్సరము ౧ జూలై వచ్చెను. అనుమతి పత్రములనిచ్చు కార్యస్థానములు స్థాపించబడెను. ప్రతి కార్యస్థానమువద్దను గస్తీనుంచుటకు భారతీయ బృందము తీర్మానించుకొనెను. గస్తీ అనగా అచ్చటికివెళ్లు రస్తాలమీద విచ్ఛికులను నిలవబెట్టుట — దుర్బలులు ఎవరైనను అటుపోవుచున్న యెడల, అచ్చటనున్న బోనులోనికి పోవద్దని హెచ్చరించుట విచ్ఛికుల కర్తవ్యము. వీరలకు ప్రత్యేక చిహ్నములు ఇయ్యబడెను. ఏ భారతీయుడైనను, అనుమతి పత్రము పుచ్చుకొన్న యెడల, వారలను అగౌరవపరచగూడదని వీరికి ప్రత్యేకము

సూచింపబడెను. అట్టివారి పేరు అడుగవలెను. కాని ఆయన చెప్ప నిరాకరించినయెడల, యే కారణముచేతను, మోటుగా గాని దౌర్జన్యముగా గాని వీరు ప్రవర్తించరాదు. అనుమతి కార్యస్థానమునకు బోవు ప్రతివానికిని ఒక అచ్చుకాగితము నియ్యవలెను. అందులోని అంశములు వానికి తెలియచెప్ప వలెను. నల్లచట్టమునకు లోబడుటవలన కలుగు ఆపదలు ఆఅచ్చుకాగితములో వివరింపబడియుండెను. పోలీసుయెడ గూడ తగు మర్యాదతో వీరు వర్తించవలెను. పోలీసు వీరిని తిట్టినను, బాదినను, శాంతముగా ఆబాధ సహించవలెను. పోలీసువారు పెట్టు బాధ దుర్భరముగా నున్నయెడల, ఆప్రదేశమును వీరు (ఐచ్ఛికులు) విడువవలెను. పోలీసు వీరిని ఖైదుచేసినయెడల, సంతోషముతో వారికి వశముకావలెను. ఇట్టి విషయము జోహానిస్‌బర్గులో తటస్థించినయెడల, నాకు కబురుచేయ వలెను. ఇతర ప్రదేశములలో జరిగినయెడల, ఆయాచోట్ల నున్న కార్యదర్శులకు తెలిపి, ముందు సలహాలను అడిగి తెలిసి కొనవలెను. ఈగస్తీదళము ఒక్కొక్కదానికి ఒక్కదళపతి యుండెను. వాని ఆజ్ఞలను తక్కినవారు శిరసావహించవలెను.

భారతీయ బృందమునకు యీరకము అనుభవమునకు ఇదియె మొదలు. ౧౨ ఏండ్లు మించినవారెల్లరును, గస్తీ దార్లగా చేర్చుకొనబడిరి. కాన ౧౨ మొదలు ౧౮ వరకు యీడుగల, యువకులు చాలమంది ఇందులో చేరిరి. కాని స్థానికులగు, ప్రచారకులు ఎరుగనివానిని ఒక్కరైనను, చేర్చు

కొనలేదు. ఈపైనదెలిపిన జాగ్రత్తలను తీసికొనుటయేగాక, ప్రతిబహిరంగసభలోను, ఇతరవిధములను, ప్రజలు ప్రకటనల ద్వారా హెచ్చరింపబడిరి. ఏమనగా; అనుమతి పత్రము పొందదలచినవాడు యెవరైనను, యీాగస్తీలవల్ల భయ పడినచో, ప్రచారకులను ఆతడు గోరినయెడల, అనుమతి పత్రముల కార్యస్థానము వరకు రాకపోకలు జరుగునపుడు, అతనివెంట ఒక ఐచ్ఛికుని పంపుదురు. ఇట్టి సహాయదానమును కొందరు ఉపయోగించుకొనిరి.

ప్రతిచోటనున్న ఐచ్ఛికులును మేరలేని ఉత్సాహముతో పనిచేసిరి. తమకర్తవ్యములను నిర్వహించుటలో ఎల్లప్పుడు మిక్కిలి జాగరూకతతో మెళుకువతో ప్రవర్తించిరి. సామాన్య ముగా పోలీసువారి ఆటంకము లేదనియే చెప్పనగును. అట్టి ఆటంకములు కలిగినప్పుడు ఐచ్ఛికులు నెమ్మదిగా దానిని భరించిరి. తమపనిలో ఐచ్ఛికులు యెక్కువ కులాసాను కను పరచిరి. అప్పుడప్పుడు పోలీసులుకూడ, యీకులాసా వేళా కోళములలో పాల్గొనుచుండిరి. తమకాలమును గడుపుటకు అనేకవినోదములను కనిపెట్టుచుండిరి. బహిరంగస్థలములలో సరుకు రవాణాకు అడ్డు కలిగించుచున్నారను ఆరోపణపై వీరొకమాటు ఖైదు చేయబడిరి. అచ్చట సత్యాగ్రహఉద్య మములో సహాయనిరాకరణము ఒకభాగముగా చేరియుండ నందున న్యాయస్థానములలో ఎదురు వాదముచేయ వీలు కలిగెను. అయినను నియమముగా న్యాయవాదులకు ప్రజా

హిత ధనములోనుండి రుసుములు ఇయ్యబడలేదు. ఐచ్ఛికులు నిర్దోషులని తేల్చి న్యాయస్థానములు వీరిని విడుదలచేసెను. అందుచేత వీరి ఉత్సాహము మరింతపెరిగెను.

అనుమతి పత్రములు తీసికొనదలచిన భారతీయులకు బహిరంగముగా ఐచ్ఛికులవల్ల అమర్యాదయు దౌర్జన్యమును కలుగకపోయినను, కొంతచిక్కు వారికి ఇంకొకవిధమున కలిగె నని నేను ఒప్పుకొనకతప్పదు. ఈ ఉద్యమ సంబంధములో ఒక ముఠా బయలుదేరి తాము ఐచ్ఛికులుగా చేరక అనుమతి పత్రములను తీసికొనదలచినవారికి దౌర్జన్యము చేతుమనిగాని, ఇతరవిధముల ఆపత్తు కల్పింతుమని గాని, రహస్యముగా భయపెట్టిరి. ఇయ్యది మిక్కిలి చింతాకరమైన ప్రమేయము. దీనిని కనిపెట్టిన వెంటనే దీనిని మొదలంట నిర్మూలముచేయుటకు గట్టిగా కృషి చేయుబడెను. అది పూర్తిగా నిర్మూలము గాకపోయినను, ఈ బెదిరింపులు తగ్గిపోయినవనియె చెప్ప నగును. కాని ఈబెదిరింపులు కొంతవరకు ఉద్యమమునకు అపకారము చేసెనని నేను కనిపెట్టితిని. బెదిరించబడినవారు ప్రభుత్వసహాయమును కోరిరి; వెంటనే పొందిరి. ఇట్లు భారతీయబృందములోనికి విషపుబొట్లు విడువబడెను. ఇదివరకు దుర్బలులుగా నున్నవారు మరింత దుర్బలులు అయిరి. దుర్బలులకు ఎల్లప్పుడు కసితీర్చుకొనవలెనను తలంపు ఉండును గనుక యీ విషయము మరింత బలముతో పనిచేసెను.

ఈ బెదిరింపులవల్ల అనుమతిపత్రములసంఖ్య తగ్గలేను. ఆమూలకముగా కొద్దిపనియే చేయగలిగెను. కాని ప్రజాభిప్రాయముయొక్క శక్తి ఒకమూలను, ఐచ్ఛికులద్వారా తమ పేరు భారతీయబృందమునకు తెలియుననుభయము రెండవ మూలను, ప్రబలఆటంకములుగా పనిచేసెను. ఈ నల్లచట్టమునకు లొంగుట యుక్తమని తలచిన భారతీయుని ఒక్కని ఐనను నేనెరుగను. లోబడినవారు గూడ, శరీర కష్టములను, ద్రవ్యనష్టములను భరించజాలక లొంగిపోయిరి. కాన తమంతట తామే సిగ్గుపడుచుండిరి. ఈలజ్జయును, పెద్ద భారతీయవర్తకులకు కోపము కలిగినందున నష్టముకలుగునను భయమును, వారలపై మిక్కిలి ఒత్తిడికలిగించెను. ఈరెండురకములగు చిక్కులనుండి తప్పించుకొనుటకు ఒక ఉపాయమును ప్రముఖులగు భారతీయులు కనిపెట్టిరి. రాత్రి ౯, ౧౦ గంటలు దాటిన పిమ్మట, ఉద్యోగస్తులు వ్యక్తుల ఇండ్లకువచ్చి, తమకు అనుమతి పత్రములను ఇచ్చునట్లు, అనుమతి పత్రముల కార్యస్థానముతో వీరు ఏర్పాటు చేసుకొనిరి. ఇట్లు జరిగినయెడల, కొంతకాలము వరకు అయినను, తాము లొంగిపోయినట్లు ఇతరులకు తెలియదు అని వారు ఆలోచించిరి. మరియు తాము నాయకులు గనుక, ఇతరులు తమను అనుసరింతురనియు, తమ సిగ్గు బరువు తేలిక యగునని తలంచిరి. తర్వాత బైటపడినను ఫరవా లేదనుకొనిరి.

కాని ఐచ్ఛికులు అత్యంత జాగ్రత్తతో నుండిరి. ప్రతి నిమిషము జరుగుపని భారతీయబృందమునకు తెలియుచుండెను.

అనుమతిపత్రముల కార్యస్థానములోనున్న వారుగూడ కొందరు సమాచారమును ఐచ్ఛికులకు తెలుపుచుండిరి. ఇతరులు తాము దుర్బలులైనను, నాయకులు ఇట్లు తమకుతామె అవమాన పరచుకొనుటను సహించజాలక, యీసంగతి ఐచ్ఛికులకు తెలుపుచుండిరి. వారి ఉద్దేశ్యము ఏమనగా:—ఇతరులు స్థిరముగానుండి, కష్టములకు తాళునెడల, తాము గూడ సహించగలమని తెలుపుటయే. ఇట్లు ఒక రాత్రి ఒక దుకాణములో కొందరు అనుమతిపత్రములు పొందబోవుచున్నారు అని ఒకమారు భారతీయబృందమునకు తెలిసెను. వీరలను ఆపుటకు మొట్టమొదట ప్రయత్నము చేయబడెను. దుకాణమువద్ద గస్తీలు పెట్టబడిరి. కాని మానవుల దౌర్బల్యము ఇట్లు చాల కాలము అణగియుండదు. కొందరు ప్రముఖులు రాత్రి ౧౦, ౧౧ గంటలవేళ యీవిధముగా అనుమతిపత్రములను తీసికొనిరి. పానకములో పుల్ల కనబడెను. ఆమరునాడే, వీరి పేర్లను భారతీయబృందమునకు ప్రకటించిరి. కాని యీ లజ్జాభావమునకు కొన్ని హద్దులు గలవు. స్వార్థచింతలు సిగ్గును పారద్రోలును. న్యాయమైన సన్నని మార్గమునుండి ప్రజలను తప్పుడు దోవలు పట్టించును. ఈ యీ విధముల, షుమారు ౫౦౦ మంది అనుమతిపత్రములను పొందిరి. కొంతకాలము వరకు వ్యక్తుల ఇండ్లకు వచ్చి ఉద్యోగస్థులు అనుమతిపత్రములను ఇచ్చిరి. కాని యీ సిగ్గు తగ్గినకొలదియు, కొందరు బహిరంగముగా, అనుమతిపత్ర కార్యస్థానములకు బోయి, అనుమతిపత్రములను సంపాదించిరి.

---

## 18 వ అధ్యాయము

## ప్రథమసత్యాగ్రహ నిర్బంధితుడు (ఖైది)

ఆసియాశాఖవారు తామెన్ని ప్రయత్నములను చేసినను ౫ వందలమందికంటె హెచ్చుభారతీయులు అనుమతి పత్రములను తీసుకొనలేదని కనిపెట్టినపుడు, యెవరినో ఒకరిని ఖైదుచేయుటకు వారు తీర్మానించుకొనిరి. జర్మిస్టనులో చాల మంది భారతీయులు కాపురముండిరి. అందులో పండిత రామసుందరుడు ఒకడు. ఈతడు ధైర్యస్థుడుగా కనుబడు చుండెను. మాట్లాడుటయందు కొంతనేర్పరి. కొన్ని సంస్కృత శ్లోకములు నోటికివచ్చును. ఉత్తరఇండియానుండి వచ్చినందున తులసీదాసురామాయణమునుండి కొన్నిపద్యములును కీర్తనలును సహజముగా తెలుసుకొనియుండెను. పండితుడను పేరు ఉండుటచేత ప్రజలలో కొంతకీర్తిని పొందెను. అనేకచోట్ల గంభీరోపన్యాసములు చేసెను. జర్మిస్టనులోని దుర్బుద్ధిగల భారతీయుడెవడో, యీ రామసుందరుని పట్టుకొనినయెడల, అచటి భారతీయులు చాలమంది అనుమతిపత్రములను పొందుదురని ఆసియాశాఖవారికి సలహాచెప్పిరి. అట్లు తెలుపబడిన దురాలోచనలను యీ ఉద్యోగస్తులు విడువజాలకపోయిరి. కాన రామసుందరుడు ఖైదుచేయబడెను. ఇదియే మొదటి నిర్బంధముగనుక, ప్రభుత్వమును భారతీయులును దానిని గురించి చాలకలవరపడిరి. నిన్నటివరకు జర్మిస్టన్ ప్రజలు

మాత్రము యెరిగియుండిన రామసుందరుడు ఒక్కక్షణములో దక్షిణాఫ్రికా మొత్తముమీద కీర్తివంతుడయ్యెను. ఇతనిని కష్టములోనున్న మహానుభావునిగా యెంచి అందరికండ్లు యీాయన మీాదపడెను. ప్రభుత్వమువారు శాంతిసంరక్షణము నిమిత్తమై ప్రత్యేకయేర్పాట్లు చేయవలసిన అవసరములేక పోయినప్పటికిని చేసిరి. సామాన్యఖైదీగాగాక భారతీయ బృందమునకు ప్రతినిధిగా ఇవ్వదగినంత గౌరవమును, న్యాయ స్థానములోగూడ నీతనికి ఇచ్చిరి. ఆతురులైన భారతీయ ప్రేక్షకులు న్యాయస్థానము నిండిపోయిరి. ఆయన కొకనెల విడిఖైదుచేయబడెను. జోహనిస్బుర్గు చెరసాలలో యూరపి యను ఖైదీలుయుండు ఒకభాగములో ఒకవిడిగదిలో ఇతని నుంచిరి. స్వేచ్ఛగావెళ్లి యీాయనను చూచుటకు ప్రజలకు అనుమతినిచ్చిరి. బైటనుండి అన్నము తెప్పించుకొనన నిచ్చిరి. భారతీయబృందము తరఫున ప్రతిరోజు పిండివంటలుచేసి యీాయనకు విందులుజరిపిరి. ఆయన కోరినదెల్ల నిచ్చిరి. ఆయనకు శిక్షవేసినరోజు పెద్దయుత్సవము జరిపిరి. నిరుత్సా హము యొక్క జాడయైననులేదు. అంతేగాక సంతోషము ఉత్సాహము కనుపడుచుండెను. వందలకొలది చెరసాలకు పోవసిద్ధమైరి. అనేకమంది అనుమతిపత్రములు పొందుటకు వచ్చెదరు అని యెంచిన ఆసియాశాఖవారికి నిరాశగలిగెను. జర్మిష్టననుండికూడ ఒక్క దరఖాస్తు అయినను రాలేదు. భారతీయబృందమొక్కటే దీనివలన లాభముపొందిరి. నెల

త్వరలో గడచిపోయెను. ఆయన విడుదలయ్యెను. పెద్ద యూరేగింపుతో తీసికొనిపోయి సభజేరిపిరి. బలమైన ఉపన్యాసములు చేసిరి. పూలదండలతో ఆయనకు ఊపిరిఆడకపోయెను. ఆయనగౌరవార్థము ఐచ్ఛికులు విందుచేసిరి. ఆయన అదృష్టమును చూచి వేలకొలది భారతీయులు అసూయపడిరి. ఖైదు పొందు అవకాశము తమకు లేకపోయెను అని చింతిల్లిరి.

కాని రామసుందరుడు పూటానాణెమని బైటపడెను. తలవనితలంపుగా ఖైదువచ్చినందున, నెలరోజులు చెరసాల కాపురముచేయుట తప్పించుకొన వీలుకాకపోయెను. బైట యెరుగని భోగములను చెరసాలలో అనుభవించెను. అయినను స్వేచ్ఛావర్తనమునకు అలవాటు పడియుండుటచేతను, దుర భ్యాసములు ఉన్నందునను, చెరసాలలో ఒంటరిగానుండుటయు కొన్ని నియమములకు లోనగుటయు, అతనికి భరించ శక్యము గానుండెను. భారతీయబృందమును, చెరసాలలోని అధికారులును, ఇంతశ్రద్ధ వహించినను, చెరసాల అతనికి ఇబ్బందిగా కనుపడెను. అతను ట్రాన్సువాలుకును, ఉద్యమమునకును సలాము చెప్పి వెళ్లిపోయెను. ప్రతిజాతిలోను ప్రతియుద్యమములోను యుక్తిపరులు యుందురు. అట్లే మా యుద్యమములోను యుండిరి. వీరు రామసుందరుని పూర్తిగా గ్రహించిరి. కాని ఇతనుసహితము, భారతీయబృందమునకు మేలొనగూర్చు సాధనము కావచ్చునని తలచి ఇతని నిజమైన చరిత్ర నాకెన్నడును తెలుపలేదు. బుడగపగులు వరకు నాతో చెప్పరైరి.

తరువాత ఇతను కరారుకార్మికుడనియు, తనగడువుకాలము పూర్తిగాకముందే తప్పించుకొనివచ్చెననియు, నాకు తెలియ వచ్చెను. కరారుకార్మికు డగుటలో అమర్యాద యేమియు లేదు. కరారుకార్మికులే యీఉద్యమమునకు అమూల్యమైన బలమయిరనియు, చివర గెలుపుపొందుటకు అమితముగా సహాయముచేసిరనియు, యీపుస్తకము అంతమగులోపల పాఠకుడు కనుపెట్టును. తన కరారుగడువుకాలము పూర్తి చేయక తప్పిపోవుట స్పష్టముగా అతని తప్పిదమె.

రామసుందరుని లోపములను యెన్నుటకుకాక ఒక నీతిని నేర్పుటకై ఆతని చరిత్రనంతయు నేనిట్లు వివరించితిని. పరిశుభ్రమైన ప్రతియుద్యమమునకు నాయకులుగా యుండు వారు తమఉద్యమములోనికి పరిశుభ్రమైన యోధులనే చేర్చు కొనుచుండవలయును. కాని వారు యెంతజాగ్రత్త తీసుకొని నను వాంఛనీయులు కాని వారు చేరకుండ ఆపజాలరు. అయినను నాయకులు సత్యవంతులును, నిర్భయులును, అయిన యెడల తమయెరుక లేకుండా యుద్యమములోనికి వాంఛ నీయులుకాని జనులువచ్చి ప్రవేశించుట, పర్యవసానములో ఉద్యమమునకు హానిచేయలేరు. రామసుందరుడు బైటపడి నపుడు అతను గడ్డిపరక యయ్యెను. భారతీయబృందము అతనిని మరచిపోయెను. కాని అతని మూలమునకూడ ఉద్య మమునకు క్రొత్తబలము చేకూరెను. ఉద్యమమునకై అతను అనుభవించిన ఖైదు మాతరపున జమపడి మర్యాదను పెంచెను.

అతని విచారణవల్ల కలిగిన ఉత్సాహము స్థిరముగా నుండెను. ఈనిదర్శనమువలన మేలుకొని దుర్బలులెల్ల ఉద్యమములో నుండి తమంతట తామే జారిపోయిరి. ఇదిగాక మరికొన్ని దుర్బలముయొక్క నిదర్శనములు కలవు. వానివల్ల కలుగు లాభములేదు గనుక వానిని వివరింపబూనను. భారతీయబృందముయొక్క బలాబలములను సిక్కముగా పాఠకుడు గ్రహించుటకు యీసంగతి చాలును. రామసుందరుడు ఒక్కడేగాక అనేక రామసుందరులు భారతీయబృందములో నుండిరి. అయినను వారందరి మూలముననుగూడ ఉద్యమమునకు పవిత్రమైనలాభమే చేకూరెను అని నేను గ్రహించితిని.

పాఠకుడు రామసుందరుని తిరస్కారభావముతో చూడకుండుగాక. మానవులందరును అపరిపక్వమైనవారే. అందరిలోకంటె ఒక్కరిలో యీఅపరిపక్వము హెచ్చుగా కనపడినపుడు ప్రజలు అతనిని దూషించబూనుదురు. కాని అది న్యాయముకాదు. రామసుందరుడు ఉద్దేశ్యపూర్వకముగా దుర్బలుడు కాలేదు. మానవుడు తనస్వభావమును మార్చగలడు, నిగ్రహించగలడు. కాని పూర్తిగా నిర్మూలించలేడు. అతనికి అంతస్వేచ్ఛను దైవము యీయలేదు. చిరుతపులి తన మచ్చలను మార్చగలిగిన యెడల, అప్పుడు మానవుడు తన ఆధ్యాత్మికనిర్మాణముయొక్క ప్రత్యేకలక్షణములను మార్చగలుగును. రామసుందరుడు పారిపోయినను, తన దుర్బలమును గూర్చి యెట్లు పరితపించెనో ఎవరు చెప్పగలరు? కాక అతని

యీపారిపోవుటయే తనకు కలిగిన పశ్చాత్తాపమునకు ప్రబల మైన బుజువు కాగూడదా? అతను సిగ్గులేనివాడే అయిన యెడల పారిపోనవసరమేలేదు. నల్లచట్టమునకు లొంగి అను మతి పత్రమును తీసుకొని చెరసాల తప్పించుకొని యుండ వచ్చును. ఇంకను బుద్ధిపుట్టినయెడల ఆసియాశాఖవారి చేతిలో కీలుబొమ్మయై స్నేహితులను పోరబెట్టి ప్రభుత్వమునకు ముద్దు పపుబిడ్డ కావచ్చును. కాన ఆతసని ధర్మముగా మనమేల విచారించరాదు? ఇట్టిదేదియు చేయక తనదుర్బలమునకు సిగ్గుపడి భారతీయబృందమునుండి మొగము తప్పించి ఆవిధ మునగూడ సేవచేసెనని మనమేల చెప్పరాదు?

---

## 19 వ అధ్యాయము

## ఇండియన్ ఒపీనియన్

---

సత్యాగ్రహ పోరాటములో యుపయోగించబడిన అంతరంగమైన బహిరంగమైన సాధనముల నన్నింటిని పాఠ కునికి తెలుపకోరెదను. కాన ఇండియన్ ఒపీనియన్ పత్రికతో పాఠకులకు పరిచయము కలిపించెదను. ఈవారపత్రిక నేటికిని దక్షిణాఫ్రికాలో ప్రచురమగుచున్నది. భారతీయునికి హక్కు అయిన ముద్రణాయంత్రము మొట్టమొదట దక్షిణాఫ్రికాలో యేర్పరచిన గౌరవము మదన్‌జిత్ వ్యవహారిక్ అను గుజరాతి పెద్దమనుష్యునకు చెందుచున్నది. అనేక కష్టములమధ్య

యీ యంత్రమును కొన్ని సంవత్సరములు నడిపినపిమ్మట, వార్తా పత్రికను గూడ పెట్టవలెనని ఆయన యోచించెను. చనిపోయిన కనుసుఖులాలు నాజర్ను, నన్నును, ఆయన సంప్ర దించెను. పత్రిక దర్బానునుండి బయలు వెడలెను. జీతములేని సంపాదకుడుగా పనిచేతునని నాజర్ ఒప్పుకొనెను. మొదటి నుండియు పత్రికకు నష్టమువచ్చుచునేయుండెను. చివరకు ఒక కవతమును కొని, ప్రచారకులను కాపురముబెట్టి అచ్చటినుండి పత్రికను నడుపవలెనని తీర్మానించుకుంటిమి. ఈప్రచారకులు అందరుకలిసి సమానాధికారముగల బృందముగా నుండవలెను అనుకుంటిమి. దర్బానుకు ౧3 మైళ్ల దూరములోనున్న అంద మైన కొండమీద, దీనికి తగిన కవుతము యేరుకొంటిమి. దీనికి మూడుమైళ్ల దూరములో అయోమార్గమునుండి దిగెడి స్థాన ముగలదు. దాని పేరు ఫోనిక్సు. ఈపత్రిక పేరు అప్పుడు ఇప్పుడు ఇండియన్ ఒపీనియన్. పూర్వము ఇంగ్లీషు, హిందీ, గుజరాతీ, అరవము, నాలుగు భాషలలో ఇది ప్రకటించబడుచుండెను. కాని చివరకు హిందీ, అరవ భాగములు ఆపివేయవలసివచ్చెను. వాని వలన గలుగు బరువు అమితమయ్యెను. కవతములో వచ్చి కాపురముండుటకు ఇష్టముగల అరవ హిందీ వ్రాతగాండ్లు మాకు దొరకలేదు. దూరమున నున్న వారిపై సరియైన అజు మాయిషీ చేయచాలకపోతిమి. సత్యాగ్రహ పోరాటము ప్రారంభించునప్పటికి ఈపత్రిక ఇంగ్లీషు, గుజరాతీలలో ప్రచురమగుచుండెను. కవతములో కాపురమున్న వారిలో

గుజరాతీలు, హిందూస్థానీలు, అరవలు, ఆంగ్లేయులు యుండిరి. మనసుఖులాలునాజరు అకాలముగా చనిపోవుటచేత, ఆయన స్థానమున ఆంగ్లేయస్నేహితుడు హర్బర్డుకిచ్చన్, సంపాదకు డయ్యెను. పిమ్మట చాలకాలము హెన్రీ. యస్. యల్. పోలక్కు సంపాదకుడుగా నుండెను. మేము ఖైదులోనుండగా చనిపోయిన రివరెండు జోసఫ్ డోక్కు కూడ సంపాదకుడుగా పనిచేసెను. ఈపత్రికద్వారా ప్రతివారములోని వార్తలను భారతీయబృందములో వ్యాపింపచేయగలిగితిమి. గుజరాతీ తెలియని భారతీయులకు ఆంగ్లశాఖ సమాచారముల దెలుపు చుండెను. ఇండియాలో, ఇంగ్లండులో, దక్షిణాఫ్రికాలో నున్న ఆంగ్లేయులకు ప్రతివారము పంపెడి సమాచారలేఖగా ఇండియన్ ఒపీనియను ఉపయోగపడెను. ముఖ్యముగా ఆంత రంగిక బలముమీాద ఆధారపడు పోరాటమును, వార్తా పత్రిక లేనిదే, పూర్తిగా నిర్వహించుట కష్టమని నానమ్మకము. ఇండియన్ ఒపీనియనుద్వారా స్థానికులైన భారతీయబృంద ములో ప్రబోధము చేసినట్లుగను, దక్షిణాఫ్రికాలోని సమా చార క్రమమును ప్రపంచములో అన్నిచోట్లనుండు భారతీయు లకు తెలిపినట్లుగను, ఇంత జయప్రదముగ, యేయితర విధము నను చేసియుండలేమని నాకు అనుభవముకూడగలదు. కాన మాపోరాటములో ఇండియన్ ఒపీనియను నిశ్చయముగ మిక్కిలి ఉపయోగకరమగు బలకరమైన సాధనము అయి యుండెను.

ఈ పోరాటము సాగునప్పుడును, దానిఫలితముగను, భారతీయబృందము యెట్లుమారెనో అట్లే ఇండియనుఒపీనియను గూడ మారెను. మొదటదానికై ప్రకటనములను తీసుకొనుచుంటిమి. ముద్రణాశాలలో చిల్లరపనులనుగూడ చేయుచుంటిమి. మా ఉత్తమప్రచారకులలో కొందరిని యీ పనికి ప్రత్యేకించవలసివచ్చెనని నేను కనిపెట్టితిని. ప్రచురణ నిమిత్తము యీ ప్రకటనలు వచ్చినయెడల, అందులో దేనిని వేయుట, దేనినినదలుట, అని తేల్చుటలో నిరంతరము మెడ తెగని కష్టముండెను. మరియు ఒకప్రకటన ఆక్షేపణకరమని వదలిపెట్టుటకు బుద్ధిపుట్టును. కాని అంగీకరించుటకు నిర్బంధము కలుగవచ్చును. ఎట్లన ఆ ప్రకటనపంపువాడు భారతీయ బృందములో ప్రముఖుడై యుండి తనప్రకటనను త్రోసివేసిన యెడల దురభిప్రాయపడవచ్చును. మరియు, యీ ప్రకటనలు సంపాదించుటకును, ప్రకటనదార్లు ఇవ్వవలసిన బాకీలను వసూలుపరుచుటకును, మంచి ప్రచారకులను వదలవలసి యుండెను. ప్రకటనదార్లు తమకిమ్మౌతుగా తలంచికోరెడి స్తోత్రపాఠమునుగూర్చి చెప్పనక్కరలేదు. అంతేగాక లాభము వచ్చుచున్నది గనుక పత్రికను నడుపవలెను అను భావముతో గాక, సేవచేయవలెనను ఉద్దేశ్యముతోనే దీనిని నడుపదలచిన యెడల, అట్టిసేవ భారతీయబృందముపై బలవంతముగా నెట్ట రాదు. వారుకోరినయెడలనే చేయవలెను. ఈ భావము మాకు నచ్చెను. ఈ సేవను వారుకోరినట్లు స్పష్టతమమైన ఋజువు

యేమనగా వారు తగినంతమంది చందాదార్లుగాచేరి దీనికి నష్టమురాకుండ స్వంతముగా పోషించుకొనుశక్తిని దీనికి కల్పించవలెను. చిట్టచివరకు ఉత్తమమని తోచిన దేదనగా సేవ అను పేరట తమ ప్రకటనలను మాకిమ్మని కొద్దిమంది వర్తకులను బ్రతిమాలుచు తిరుగుటకన్న జనసామాన్యమువద్దకు పోయి యీ పత్రిక మీదనియు, దీనిని నిలుపుకొను భారము మీదేననియు, వివరించి తెలుపుట సంబంధముగల వారందరి కిని శ్రేయస్కరము. ఈ అన్ని కారణములనుబట్టి పత్రికలో నుండు ప్రకటనలను తొలగించితిమి. సంతోషకరమైన ఫలి తము చేకూరెను. ఈ ప్రకటనశాఖలో మొట్టమొదట మునిగి పోయినవారు ఆపని తొలగగానే పత్రికను అభివృద్ధిచేయుటకు తమకృషిని వినియోగింపగలిగిరి. ఇండియను ఒపీనియను తమ ఆస్తి యనియు, కాన దానిని నిలువబెట్టు బాధ్యత తమదనియు, భారతీయబృందము వెంటనే గ్రహించెను. ఈవిషయమైన ఆదుర్ద అంతయు ప్రచారకులకు తీరిపోయెను. భారతీయ బృందము కోరినన్నాళ్లు యీపత్రికకు తమఉత్తమకృషిని అర్పిం చుటయే వారల కర్తవ్యమయ్యెను. దీనికి చందాదార్లుగా చేరమని యేభారతీయునినైనను కోరుటకు వారు సిగ్గుపడ కుండిరి. అంతేగాక ఇట్లడుగుట వారి కర్తవ్యమని భావించిరి. పత్రికయొక్క స్వభావములోను, ఆంతరంగికశక్తిలోను మార్పు కలిగెను. ఇది లక్ష్యము చేయవలసిన సంస్థ అయ్యెను. అది వరకు సామాన్యముగ ౧౨ లేక ౧౫ వందల మధ్యనుండు

చందాదారుల సంఖ్య ప్రతిరోజు పెరుగజొచ్చెను. చందా గూడ పెంచబడెను. అయినను పోరాటము ఉన్నతస్థితిలో నున్నపుడు 3౫౦౦ మంది చందాదార్లుగా నుండిరి. దక్షిణాఫ్రికాలో ఇండియన్ ఒపీనియను చదువగల భారతీయులు ౨౦ వేలకు మించియుండరు. కాన 3 వేలకు మించిన సంచికలు పంపుట బాగా తృప్తికరమని యెంచవలెను. భారతీయ బృందము యీపత్రికను తమ స్వంతసొమ్ముగా చూచుకొనిరి. ఎంతవరకనగా సకాలమునకు జోహానిస్బర్గుకు సంచికలు రానియెడల ఫిర్యాదులతో నన్ను ముంచివేయు చుండిరి. సామాన్యముగా ఆదవారము ఉదయముకు అది జోహానిస్బర్గుకు వచ్చుచుండెను. పత్రిక రాగానే గుజరాతిభాగమును మొదటినుండి చివరవరకు చదువుటయే మొట్టమొదటి పనిగా పెట్టుకొనినవారిని అనేకులను నేను యెరుగుదును. ముఠాలో ఒక్కడు చదువును. తక్కినవారు చుట్టు కూరుచుని విందురు. చదువదలచిన వారందరును స్వయముగా చందా నివ్వజాలకుండిరి. కాన కొందరు కలసి చందాదారు అయి ఒక పత్రిక తెప్పించుకొనుచుండిరి.

పత్రికలో ప్రకటనలను మానినట్లే ముద్రణశాలలో సుమారు అదే కారణములకు చిల్లరపనిని మానితిమి. పనివాండ్లకు కొంత విశ్రాంతి దొరకెను. దానిని పుస్తకములు అచ్చువేయుటకు ఉపయోగించితిమి. ఇందులోగూడ లాభములుతీయు ఉద్దేశ్యము లేనందునను, పోరాటము సాగించుటకే

అచ్చువేయుచున్నందునను, అవి యెక్కువగా అమ్ముడు పోయెను. ఇట్లు ముద్రణాయంత్రమును పత్రికయు సహాయము చేసెను. భారతీయబృందములో సత్యాగ్రహము క్రమముగా వేరు పాదుకొనినకొలదియు, సత్యాగ్రహదృష్టిపథమునుండి చూచినపుడు, పత్రికయొక్కయు ముద్రణాయంత్రముయొక్కయు స్థితి, దానికి అనుకూలముగా నైతికాభివృద్ధిని పొందుచుండి నట్లు స్పష్టముగా కనుపడుచుండెను.

---

## 20 వ అధ్యాయము

## ఖైదులవరుస

రామసుందరుని ఖైదు చేయుటవలన ప్రభుత్వమునకు లాభమేమి కలుగలేదని మనము చూచియుంటిమి. అంతేగాక భారతీయబృందముయొక్క ఉత్సాహము వేగముగా పెరుగు చున్నట్లు వారు కనిపెట్టిరి. ఆసియాశాఖలోని ఉద్యోగస్తులు ఇండియన్ ఒపీనియనును శ్రద్ధతో చదువుచుండెడివారు. ఉద్యమములోనుండి బుద్ధిపూర్వకముగా రహస్యమనునది లేకుండ జేసితిమి. భారతీయబృందముయొక్క బలాబలములను తెలుసు కొనదలచినవాడు మిత్రుడుగాని శత్రుడుగాని తటస్థుడుగాని ఇండియన్ ఒపీనియను అను పుస్తకము వానియెదుట తెరిచి యుంచబడెను. ఏయుద్యమములో నెవడును తప్పిదమును చేయడో, కపటమునకుగాని మోసమునకుగాని కుయుక్తులకు

గాని తావు లేదో, ఆంతరంగికమైన శక్తియొక్కటియే విజయమునకు యేకైకమైనహామీ అయి యుండెనో, అట్టి యుద్యమములో రహస్యమునకు తావు లేదని మొట్టమొదటనే ప్రచారకులు కనుపెట్టిరి. దుర్బలము అను జాడ్యమును తొలగించవలెనన్న, మొట్టమొదటనే, దానిని సరిగా నిదానముచేసి బహిరంగపరుచుట అత్యంత అవసరమనియు, భారతీయ బృందముయొక్క ప్రయోజనమే అందులో ఇమిడియున్నదనియు స్పష్టము. ఇండియన్ ఒపీనియనుయొక్క కార్యవిధానము ఇదియని ఉద్యోగస్తులు గ్రహించినప్పుడు భారతీయ బృందముయొక్క సమకాలిక చరిత్రమును ఈపత్రిక నిజముగా ప్రతిబింబింపచేయుచున్నదని ఉద్యోగస్తులు గ్రహించిరి. అది వారికి మలినములేని అద్దమువంటి దయ్యెను. అందుచేత కొంతమంది నాయకులు స్వేచ్ఛగానున్నంతకాలమును ఉద్యమము యొక్క బలము భంగపరచజాలమని వారు గ్రహించిరి. కాన ౧౯౦౭ సం॥ క్రిష్టమసువారములో న్యాయాధికారియొద్ద హాజరుకమ్మని కొంతమంది నాయకులకు ఉత్తరువులుచేయబడెను. ఇట్లుచేయుటలో ఉద్యోగస్తులు గౌరవముగా ప్రవర్తించిరని ఒప్పుకొనవలెను. వారు తలపెట్టినయెడల ఖైదుచేసి యుండవచ్చును. దానికిబదులు వారు రమ్మని ఆహ్వానపత్రముల పంపుట వారిగౌరవభావమునకు సాక్ష్యమగుటయేగాక, ఖైదులోనికి పోవుటకు నాయకులు యిష్టపడి సిద్ధముగానున్నారని వారికిగల నమ్మకమును బయలుపరచెను. నిర్ణీతమైన తేదిన

౨౮—౧౨—౧౯౦౭ శనివారమునాడు పిలువబడిన వారు న్యాయాధికారియెదుట హాజరైరి. చట్టప్రకారము ధృవపరుచుకొనుటకు దరఖాస్తులు పంపలేదు గనుక నియమితకాలములో ట్రాన్సువాలు వదలిపెట్టిపోవలసినదని ఏలఉత్తరువులు చేయగూడదో వీరు కారణములు చూపవలసియుండెను.

ఇట్లు పిలువబడినవారిలో క్వీన్ను అనువాడు ఒకరు. ఆయన జోహానిస్సుబర్గులోని చీనాదేశీయులకు నాయకుడు. వీరు మూడు నాలుగు వందలమంది యుండిరి. వర్తకమో, వ్యవసాయమో చేయుచుండిరి. ఇండియా వ్యవసాయమునకు ప్రసిద్ధిబొంది యున్నది. కాని అందులో చైనావారు పొందినంత అభివృద్ధిని మనము పొందలేదని నేను నమ్మెదను. అమెరికాలోను, ఇతరదేశములలోను వ్యవసాయము పొందుచున్న ఆధునికాభివృద్ధివర్ణనకు మించియున్నది. కాని అది యింకను ప్రయోగస్థితిలోనే యున్నది. చైనా అట్లు గాక ఇండియావలె పురాతనమైన దేశము. కాన యీరెంటిని పోల్చి చూచుట ప్రబోధకముగా నుండును. జోహానిస్సుబర్గులోని చీనావారి వ్యవసాయపద్ధతులను నేను గమనించితిని. ఈవిషయమున వారితో మాట్లాడితిని. మనకంటె వారు హెచ్చు తెలివిగలవారును, శ్రద్ధగలవారును అని నాకు తోచెను. పనికిరాని నేలయని మనము కొంత బీడుపెట్టెదము. కాని వారు అనేక రకములైన సారములను చక్కగా గమనించి యుండుటచేత దానిమీదగూడ చక్కని పైరులను వేయుదురు.

నల్లచట్టము చీనావారికిని భారతీయులకును వర్తించెను. కాన వారుగూడ యీ సత్యాగ్రహ పోరాటములో చేరిరి. కాని మొదటినుండి చివరవరకు వీరి వీరి ప్రయత్నములు కలుపబడలేదు. ఎవరిస్వతంత్రమైన సంస్థద్వారా వారు పనిచేసిరి. ఈ యేర్పాటు ఉపకారము చేసెను. ఇద్దరును పట్టుదలతో పని చేసినంతవరకు ఒకరికొకరు బలకరులుగా నుందురు. కాని ఒకరు లొంగిపోయినయెడల, రెండవవారి నీతిధైర్యములను ఇది చెడగొట్టనేరదు. కనీసము పూర్తిగా నాశనమగు ఆపద యైనను రెండవది తప్పించుకొనును. చీనావారి నాయకుడు వారలను మోసము చేసెను. కాన వారిలో చాలమంది వెనుకబడిరి. ఆయన యీ దుష్టచట్టమునకు లొంగలేదు. నిశ్చయమే కాని, తన వశములోనున్న పుస్తకములను, ధనమును, ఇతరులకు స్వాధీనపరచకుండ, ఆయన పరారియయ్యెను. ఒకరోజు యుదయమున ఎవరోవచ్చి నాతో చెప్పిరి. నాయకుని పరోక్షమందు యుద్ధముసాగించుట అనుచరులకు యెప్పుడును కష్టము. నాయకుడు తన్నుతాను ఇట్లు అవమానము చేసికొనినప్పుడు అనుచరులబెదురు మరింతయగును. కాని ఖైదులుచేయుట ప్రారంభమైనపుడు, చీనావారు మంచిఉత్సాహములోనుండిరి.

వారిలో ఒక్కరును అనుమతిపత్రము పొందలేదు. కాన భారతీయనాయకులతోపాటు, వారినాయకుడైన క్వీన్ను గూడ పిలువబడెను. ఎట్లైనను క్వీన్ను గూడ కొంతకాలము మిక్కిలి యుపయోగకరమైన సేవ చేసియుండెను.

మొదటిమూడా ఖైదీలుగా చేయబడిన భారతీయుల నాయకులు అనేకమందిలో తంబినాయుడు అను వానిని కూర్చి పాఠకునకు పరిచయము కలిగించకోరెదను. తంబినాయుడు మొరీషస్‌లోబుట్టిన అరవదేశస్థుడు. వాని తలిదండ్రులు అక్కడికి చెన్నరాజధానినుండివచ్చిరి. అతను సామాన్య వర్తకుడు. పాఠశాలచదువేమియు అతనికిలేదు. కాని విశాల మైన అనుభవము వానికి ఉపాధ్యాయుడుగానుండెను. అతను ఇంగ్లీషుభాష బాగుగాౘ్రాయను మాట్లాడనుశక్తి గలిగి యుండెను. కాని కొన్ని వ్యాకరణదోషములు కనుపడుచుండెడివి. ఈ విధముననే అరవభాషాజ్ఞానమును సంపాదించెను. హిందూ స్తాని, అర్థముచేసుకొని షుమారుగా మాట్లాడుచుండెను. ఆంధ్రముగూడ కొంతవచ్చును. కాని యీ రెండుభాషల లిపులు (అక్షరమాలలో) ఆయనకు తెలియవు. మరియు మొరీషస్‌లో వాడుకలోనున్న క్రియోల్ భాష ఆయనకు బాగుగా తెలియును. క్రియోల్ ఫ్రెంచిభాషయొక్క సంకరము. ఇతనికి నీగ్రోభాషవచ్చును. ఇన్నిభాషలలో వ్యావహారిక జ్ఞానముకలిగియుండుట దక్షిణాఫ్రికా భారతీయులలో గొప్ప అంశముకాదు. వందలకొలది జనులకు యీ అన్నిభాషలు తెలిసియుండును. తమ ప్రయత్నమక్కరలేకుండగనే వీరు వివిధభాషలను పోల్చగలజ్ఞానమును సంపాదించగలరు. ఇట్టిశక్తి యెట్లుకలుగుచున్నదనగా విదేశభాషద్వారా నేర్చుకొనిన విద్యవల్ల వారిమెదడు అలసిపోలేదు. వారిజ్ఞాపకశక్తిచురుకుగా

నుండును. ఆయాభాషలు మాట్లాడువారితో మాట్లాడుట చేతను, గ్రహణశక్తివల్లను, యీ కఠినమైనభాషలను వారు నేర్చుకొనుచున్నారు. దీనివల్ల వారిమెదడుకు హెచ్చుశ్రమ కలుగుటలేదు. అంతియేగాక యీ మానసికసాధన వారి బుద్ధికి సహజమైన వికాసమును కలిగించుచున్నది. తంబి నాయుడు స్థితి ఇట్టిది. ఆయనకు మిక్కిలి తీవ్రమైనబుద్ధిగలదు. క్రొత్తవిషయములను మిక్కిలి త్వరితముగా గమనించగలడు. హాస్యధోరణి యెప్పుడునుకుంటుపడక ఆశ్చర్యమును కలిగించు చుండును. ఆతను ఇండియాను యెన్నడును చూడలేదు. అయినను మాతృదేశమునందుగల ప్రేమకు మేరలేకుండెను. ఆయన రక్తనాళములగుండ దేశాభిమానము ప్రవహించు చుండెను. ఆయన స్థైర్యము ముఖముమీద చిత్రింపబడి యుండెను. ఒడ్డుపొడుగుగల మనుష్యుడు. బలిష్ఠుడు. బడలిక లేని కార్యశక్తిగలవాడు. మూటలుమోయమన్నను, సభలలో అధ్యక్షతవహించి నడపమన్నను, సమానముగా ప్రకాశించును. రాజవీధులలో నెత్తిన మూటపెట్టుకొని మోయుటకు సిగ్గు పడడు. పనికిపూనెనా అతనికి రాత్రింబగళ్ళు ఒకటియే. భారతీయబృందముకొరకై తనకుగల సమస్తమును త్యాగము చేయుటకు అతనికంటె హెచ్చుగా తయారుఅయినవాడు మరొకడులేడు. అతను తొందరపాటు పడకుండిన యెడలను, కోపమునుండి విముక్తుడై యుండినయెడలను, కచాలియా లేని సమయమందు ట్రాన్సువాలులోని భారతీయబృందమునకు

యీ ధీరుడు తేలికగా నాయకత్వమును వహించియుండును. ట్రాన్సువాలుపోరాటము సాగునంతవరకు యీ తొందరపడు స్వభావము అతనికి ఇంకను చెడుగుచేసి యుండలేదు. ఇతని అమూల్యమైన లక్షణములు రత్నములవలె ప్రకాశించు చుండెను. కాని పోనుపోను ఇతని కోపమును తొందరయును అతనికి ఘోరశత్రువులై సద్గుణములను మరుగుపరిచెను అని నేను వింటెని. అది యెట్లున్నను దక్షిణాఫ్రికాలోని సత్యాగ్రహచరిత్రలో తంబినాయుని పేరు అగ్రగణ్యులలో చేరవలెను.

న్యాయాధికారి ప్రతిఫిర్యాదును విడివిడిగా విచారించెను. ౪౮ గంటలలో కొందరిని ౭ మొదలు ౧౪ రోజులలో త్రతిమ్మా వారిని ట్రాన్సువాలు విడిచిపొండని యుత్తరువులుచేసెను.

౧౯౦౮ సం॥ ౧౦ జనవరితో గడువుతీరెను. ఆరోజుననే శిక్షపొందుటకై మమ్మును న్యాయస్థానమునకు హాజరు కమ్మనిరి.

మేము యెవరమును చేయగల యెదురువాదములేదు. అనుమతిపత్రములను చట్టప్రకారము పొందినామని న్యాయాధికారిని తృప్తిపరచనందున, గడువులోపల ట్రాన్సువాలును వదలిపొమ్మని ఆయనయిచ్చిన ఉత్తరువును ఉల్లంఘించితిమి అను ఆరోపణకు మేము అందరమును దోషులమనియే చెప్ప దలచితిమి.

ఒక చిన్న కైఫియ్యతునిచ్చుటకు నేను అనుమతి కోరితిని. అది ఇచ్చినమీాదట నామీాద ఫిర్యాదుకును ఇతర

ఫిర్యాదులకును తేడాకలదని నేను తలచెదనని చెప్పితిని. ప్రెటో రియాలో నాతోడి దేశాభిమానులకు 3 నెలల కఠినఖైదును, పెద్ద జరిమానాయున్ను, అది చెల్లించనియెడల మరి 3 నెలల కఠినఖైదును, విధింపబడెనని నేనప్పుడే వింటిని. ఈజనులు నేరము చేసియున్నయెడల నేను అంతకంటె పెద్దనేరము చేసితిని. కాన నాపైన అత్యధికమైన శిక్ష వేయవలెనని కోరితిని. అయినను న్యాయాధికారి నాకోరికను నిరాకరించి రెండునెలల విశిఖైదు వేసెను. తరుచుగా న్యాయవాదిగా హాజరైన న్యాయస్థానములోనే ముద్దాయిగా నిలుచుండుటకు కొంచెముగా సంకోచముగలిగెను. కాని మొదటిదానికంటె రెండవదియే హెచ్చు గౌరవకరమని భావించితిననియు, ముద్దాయియుండుబోను యెక్కినపుడు రవంతయైనను అనుమానము తోచలేదనియు, నాకు బాగా జ్ఞాపకమున్నది.

న్యాయస్థానములో వందలకొలది భారతీయులును, తోడిన్యాయవాదులును నాయెదుటనుండిరి. శిక్ష చెప్పగనే నన్ను వశపరుచుకొని తొలగించి దూరముగా తీసికొనిపోగా ఒంటరిగానుంటిని. నాతోవచ్చిన పోలీసు, ఖైదీలు కూర్చుండు బల్లమీద కూర్చుండమని చెప్పి తలుపుబిగించి వెళ్లిపోయెను. నాకు కొంతకలవరము గలిగెను. దీర్ఘాలోచనలోపడితిని. ఇల్లు, నేను వృత్తిజరిపిన న్యాయస్థానములు, బహిరంగసభ, ఇవి అన్నియు స్వప్నమువలె కదలిపోయెను. నేను ఇప్పుడు ఖైదీని. రెండునెలలలో యేమగును. పూర్తిగా శిక్ష అనుభవించవలసి

యుండునా, ప్రజలు వాగ్దత్తముచేసినట్లు వందలకొలది ఖైదుకు వచ్చినయెడల పూర్తిగా ఖైదులోనుండనక్కరలేదు. కాని వారు చెరసాలలునింపక తప్పిపోయినయెడల, రెండునెలలు ఒక యుగమువలె గడపకష్టముగానుండును. ఇవి చెప్పుటకు పట్టినంతికాలములో నూరోవంతుకు తక్కువలో యీఆలోచనలు నామనస్సులో సంచారముచేసెను. నాకు సిగ్గుకలిగెను. నేనెంతబడాయి కోరును! చెరసాలలు అన్నిటిని రాజుగారి పూటకూలి బసలుగా యెంచమని ప్రజలతో చెప్పినవాడను. నల్లచట్టమును ఉల్లంఘించుటవలన కలిగెడి బాధను పరమానందముగా యెంచమన్నవాడను, దానిని నిరోధించుటలో తనకున్న సర్వమును తన ప్రాణమునుగూడ త్యాగముచేయుట పరమభోగమని బోధించినవాడను, నేను! ఈజ్ఞానమంతయు నేడు యెక్కడికి పోయెను? ఈరెండవరకము ఆలోచన దివ్యౌషధముగా పనిచేసెను. నాబుద్ధిహీనతకు నేనే నవ్వసాగితిని. తక్కినవారికి యేమిశిక్ష వేయబడుననియు, వారు చెరసాలలో నాతోకలిపి యుంచబడుదురాయనియు, ఆలోచించసాగితిని. ఇంతలో పోలీసు యుద్యోగస్తుడు వచ్చి తలుపు తెరిచి నాఆలోచనను చెడగొట్టెను. నన్ను తనవెంట రమ్మనెను. నేను పోతిని. పిమ్మట నన్ను ముందు నడువమని తాను వెనుక నడుచుచుండెను. ఖైదీలుయెక్కు చీకటిబండియొద్దకు తీసుకొనిపోయి నన్ను ఎక్కమని కోరెను. జోహానిస్సుబర్గు చెరసాలకు తోలుకొనిపోయిరి.

చెరసాలలో నా స్వంతదుస్తులను తీసివేయమని కోరిరి. ఖైదీలను చెరసాలలలో దిగంబరులను చేతురని నేను ఎరుగుదును. తమ ఆత్మగౌరవమునకుగాని, తమ విశ్వాసములకుగాని విరుద్ధముగా నుండనంతవరకు చెరసాల నీమములన్నిటిని సత్యాగ్రహులము గనుక ఐచ్ఛికముగా అనుసరించవలెనని తీర్మానించుకొంటిమి. నాకిచ్చిన బట్టలు మిక్కిలి మురికిగా నుండెను. వానిని ధరించ నాకిష్టములేకుండెను. కొంచెము మురికిగా నైనను సహించవలెనను అభిప్రాయముతో యీదుస్తులను ధరించుటకు ఒప్పుకొంటిని. కాని నామనసులో కొంత బాధ కలుగకపోలేదు. నా పేరును, చిరునామాను ఉద్యోగస్తులు నమోదుచేసుకొని నన్నొక పెద్దగదికి తీసుకొనిపోయిరి. కొద్ది సేపటిలో నాతోడి ప్రచారకులు వచ్చిరి. వారు నవ్వుచుండిరి. నాకు విధించినట్లే వారికిని శిక్ష విధింపబడెనని చెప్పిరి. నన్ను తొలగించిన పిమ్మట జరిగిన సమాచారము చెప్పిరి. నావిచారణ అయిన పిమ్మట భారతీయులలో కొందరు ఉద్రేకము పొందిరనియు, అందరును నల్లజండాలతో ఊరేగింపు జరిపిరనియు వీరివల్ల తెలుసుకుంటిని. ఊరేగింపును పోలీసులు చెదరగొట్టిరి. కొందరను కొరడాలతో మోదిరి. అందరమును ఒక చెరసాలలోను, ఒకే గదిలోను ఉంచిరనిసంతోషించితిమి.

గదితలుపు ఆరుగంటలకు మూసిరి. ఆతలుపు కడ్డీలతో చేయబడక చెక్కలతో కూర్చబడియుండెను. గోడలో పైన,

గాలిరాక పోకలకు, ఒకచిన్నసందుయుండెను. ఇనప పెట్టెలో పెట్టి తాళము వేసినట్లు భావించితిమి.

రామసుందరునికి చూపిన గౌరవ ఆదరణలను చెరసాల యుద్యోగస్తులు మాకు చూపలేదు. ఇందులో ఆశ్చర్యము లేదు. రామసుందరుడు మొదటి సత్యాగ్రహ ఖైది. అతనిని యెట్లు ఆదరించవలెనో వారికి వూహాయే లేదు. మాగుంపు బాగాపెద్దది, ఇంకను ఇతరులను పట్టుకొను ఆలోచనలును గలవు. కాన నీగ్రోలుండుచోట మమ్ములనుంచిరి. దక్షిణాఫ్రికాలో ఖైదీలలో రెండురకములే గుర్తించబడును తెల్లవారు. నల్లవారు. నల్లవారనగా నీగ్రోలు. భారతీయులను నీగ్రోలతో చేర్చిరి.

మరునాడుదయము కఠినఖైదు వేయబడని ఖైదీలకు తమ స్వంతదుస్తులు ధరించు హక్కుగలదనియు, వారు అట్టి హక్కును కోరనియెడల ఆరకము ఖైదీలకిచ్చు ప్రత్యేకమైన చెరసాల దుస్తులను ఇత్తురనియు తెలుసుకొంటిమి. మాదుస్తులను ధరించుట క్రమముగాదనియు చెరసాలవారు ఇచ్చు దుస్తులు ధరించుట యుక్తమనియు మేము తీర్మానించుకొంటిమి. అట్లే అధికారులకు తెలిపితిమి. కఠినశిక్ష వేయబడని నీగ్రో ఖైదీలకు ఇచ్చు దుస్తులను మాకు ఇచ్చిరి. కాని నీగ్రోఖైదీలలో విడిశిక్ష వేయబడినవారు హెచ్చుమంది యుండరు. విడిఖైదు వేయబడిన మరికొందరు భారతీయులు కూడ వచ్చుటకు ప్రారంభముకాగానే, విడిశిక్ష ఖైదీలకిచ్చు

దుస్తులు తక్కువవైపోయెను. భారతీయులకు యీ విషయములో వ్రతముగాని పట్టుదలగాని లేనందున, కఠినఖైదీలకు ఇచ్చిన దుస్తులనే, త్వరలో అంగీకరించిరి. దరిమిలా వచ్చిన వారు కొందరు కఠినఖైదీల దుస్తులను ధరించుటకన్న తమ దుస్తులనే నుంచుకొనుటకు ఇష్టపడిరి. ఇది అక్రమమని నేను తలంచితిని. కాని యీవిషయములో సక్రమ విధానము వారు అనుసరించవలెనని వారిని ఒత్తిడిచేయుటకు నేను తలపెట్ట లేదు.

రెండవ మూడవ రోజునుండి సత్యాగ్రహ ఖైదీలు యెక్కువగా రాసాగిరి. అందరును ఖైదును వరించిరి. అందులో చాలమంది మూటలు మోసి అమ్మువారు. దక్షిణాఫ్రికాలో ఇట్లు అమ్మువారు (సంచార విక్రయదారులు) తెల్లవాడైనను నల్లవాడైనను అనుమతిపత్రము పొందవలయును. దాని నెప్పుడు తన యొద్ద నుంచుకొనవలయును. అడిగినప్పుడు పోలీసువారికి చూపవలయును. షుమారుగా ప్రతిరోజును యీ అనుమతి పత్రము నడుగుచుండిరి, లేనివారిని ఖైదుచేయుచుండిరి. మమ్ము పట్టుకొనిన పిమ్మట చెరసాలలు నింపవలెనని భారతీయ బృందము తీర్మానించుకొనెను. సంచార విక్రయదారులు యీ పనిలో ముందుకువచ్చిరి. అనుమతి పత్రములను చూపు టకో నిరాకరించిన చాలును. వెంటనే ఖైదు తప్పక లభ్య మగును. ఈవిధముగా వారమురోజులగుసరికి సత్యాగ్రహ ఖైదీలు నూటికిమించిరి. ప్రతిరోజును కొద్దిమందియైనను వచ్చు

చుండుటచేత, వార్తాపత్రిక అక్కరలేకుండగనే, రోజువారి వార్తలు మాకు తెలియుచుండెను. ఎక్కువమంది సత్యాగ్రహీలు ఖైదుకువచ్చుట సాగగానే, వారికి కఠినశిక్ష విధించిరి. న్యాయాధికారులకు ఓర్పులేకపోయెనో? ప్రభుత్వమునుండి మేమనుకొనినట్లు అట్టి యుత్తరవులు వచ్చెనో? ఏదో ఒక కారణమైయుండును. నేను గూడ అప్పుడు మాకు కలిగిన యూహాయే సరియైనదని తలచుచున్నాను. ఏలనన విడిఖైదు వేసిన మొదటి కొద్దిమంది ఖైదీలను వదలినయెడల, దీర్ఘముగా సాగిన యీ పోరాటములో, మరెవ్వరికిని విడిఖైదు వేయబడలేదు. స్త్రీలకు సైతము కఠినశిక్షనే వేసిరి. అందరు న్యాయాధికారులకు ఒకే యుత్తరువులుగాని సలహాలుగాని పంపబడనియెడల, అందరును సంప్రదింపులేకుండ స్త్రీ పురుష ఖైదీలనందరిని అన్ని సమయములందును కఠినశిక్షకే పాలుచేసిన యెడల అది ఇంచుమించు మానవాతీత కార్యముగా యెంచవలసి యుండును.

జోహానిస్బర్గు చెరసాలలో కఠినఖైదు విధింపబడని ఖైదీలకు ప్రొద్దున జావ ఇచ్చుచుండిరి. దానిలో ఉప్పులేదు. కాని ప్రతివానికిని కొంచెము ఉప్పు విడిగానివ్వబడెను. మధ్యాహ్నము పదితులముల అన్నము, పదితులముల రొట్టె, రెండున్నరతులము నెయ్యి, కొంచెము ఉప్పు ఇవ్వబడెను. సాయంత్రము జావ కొంచెము, కూర యివ్వబడెను. కూర క్రింద ముఖ్యముగా ఆలుగడ్డలుచేరెను. చిన్నవైనయెడల

రెండు, పెద్దవైనయెడల ఒకటి ఇయ్యబడెను. ఈ ఆహారముతో మేమెవ్వరమును తృప్తి పొందలేదు. అన్నము మెత్తగావండిరి. వైద్యాధికారిని కొన్ని తిరుగ మోకగింజలడిగితిమి. ఇండియాలో చెరసాలలో ఇచ్చెదరని చెప్పితిమి "ఇది ఇండియాకాదనియు ఖైదీలభోజనములో రుచి ప్రశంసలేదనియు, కాన తిరుగ మోక గింజలు యివ్వబడవనియు" అని కఠినమైన జబాబువచ్చెను. వారిచ్చు భోజనములో మాంసకృత్తులులేవు గనుక పప్పు ఇవ్వుమని అడిగితిమి. "వైద్యవిషయమైన చర్చలలో ఖైదీలు కల్పించుకొనరాదు. వారమునకు రెండుమారులు మొక్క జొన్నలకు బదులు ఉడికిన చిక్కుడుకాయలు ఇవ్వబడును గనుక మాంసకృత్తులుగలవు" అని వైద్యాధికారి చెప్పెను. ఒకవారములోగాని ఒకపక్షములోగాని వివిధకాలములలో తినిన వివిధ ఆహారములలోనుండి, తనకుకావలసిన వివిధమైన పరికరములను, మానవుని అన్నకోశము గ్రహించగలిగియున్న యెడల, వైద్యాధికారి చెప్పినవాదములో లోపముండదు. నిజమేమన ఆయనకు మా సౌకర్యములను చూచు తలంపే లేదు. చెరసాల ప్రధానోద్యోగి మమ్ము విడిగా వంటచేసుకొన నిచ్చెను. తంబినాయుని వంటపుట్టిగా యెన్నుకొంటిమి. ఆ హోదాలో మా తరఫున అనేకపోరులు ఆయన సలుపవలసి వచ్చెను. కూర తక్కువగా వచ్చినయెడల పూర్తిగా తూకము ఇప్పించమని పట్టుబట్టును. వారమునకు రెండురోజులు కూర రోజులు. ఆ రోజులలో రెండుమారులు వండితిమి. తక్కిన

రోజులలో ఒక్కమారే వంట. ఏలనన మధ్యాహ్నము భోజనమునకు కావలసిన ఇతరవస్తువులనే మమ్ము వండుకొననిచ్చిరి. మా స్వంతవంట సాగినతర్వాత స్థితి కొంచెము బాగుపడెను.

కాని యీ సౌకర్యములువచ్చినను, రాకున్నను, పూర్ణమైన సౌఖ్యముతోను, శాంతితోను, శిక్షాకాలము గడుపవలెనను తీర్మానములో ప్రతివాదును స్థిరముగానుండెను. సత్యాగ్రహులసంఖ్య క్రమముగా ౧౫౦ కి మించెను. మాకందరికి ఖడీఖైదుగాన గదులు బాగుచేసుకొనుటకంటె వేరుపని లేకుండెను. పనిఇమ్మని అడిగితిమి. "నేను పని ఇవ్వజాలనందుకు చింతిలుచున్నాను. ఏలనన నేను పని ఇచ్చినయెడల నేరముచేసినట్లు యెంచబడును. కాని ప్రదేశము పరిశుభ్రముగా నుంచుటలో మీయిష్టమొచ్చినంత కాలమును గడుపుకొనుడు" అని జబాబువచ్చెను. కొంత దేహపరిశ్రమ కవాతు వగైరాలు ఇప్పించమని కోరితిమి. ఏలనన కఠినఖైదు వేయుబడిన నీగ్రోలు తమ మామూలుపని అయినపిమ్మట కవాతు చేయింపబడుచుండిరి. "మీవద్దయుండు భటునికి వ్యవధియుండి ఆయన మీకు కవాతు నేర్పినయెడల నేను ఆక్షేపించను. అట్లు నేర్పమని ఆయునకు ఉత్తరువు చేయను. ఏలనన ఇదివరకే ఆయునకు హెచ్చుపని కలదు. మీరు తలవనితలంపుగా యింత మంది వచ్చుటచేత, ఆయునపని మరింతకష్టమైనది." అని పైఅధికారి జబాబుచెప్పెను. ఈ భటుడు మంచివాడు. యీ సగము అనుమతి ఆయనకు చాలును. ప్రతిఉదయము శ్రద్ధతో

మాకు కవాతు నేర్పుటకు మొదలుపెట్టెను. మాగదుల ముందునున్న కొద్ది ఆవరణములో కవాతు చేయువలసివచ్చెను. కాన మండలాకారముగా తిరుగవలసివచ్చెను. ఈ భటుడు కవాతు పూర్తిచేసి వెళ్లినపిమ్మట, నవాబుఖాన్ అను పఠాను మాతోడి దేశాభిమాని, కవాతును సాగించును. ఇంగ్లీషు పదములను అతను ఉచ్చరించుపద్ధతి మాకు నవ్వుపుట్టించెను. స్టాండ్ ఎట్ ఈజ్ అను దానిని సండ్లీసు అని మార్చెను. ఎంతకొట్టుకున్నను యిది యేహిందూస్థానిపదమో మాకు తెలియులేదు. కాని కొన్నాళ్లు అయినపిదప ఇది హిందూస్తాని కాదనియు నవాబుఖాని ఇంగ్లీషుఅనియు తెలుసుకొంటిమి.

---

## 21 వ అధ్యాయము

## మొదటిసంధి — పరిష్కారము

రెండువారములు మేమట్లు చెరసాలలో నుంటిమి. ప్రభుత్వముతో రాయబారములు జరుగుచున్నవని అప్పుడు క్రొత్తగా వచ్చినవారు మాకు తెలిపిరి. రెండుమూడురోజుల పిదప ట్రాన్సువాలు లీడరు అను జోహానిస్సుబర్గు దైనికపత్రికా సంపాదకుడు ఆల్బర్టుకార్డురైట్ నన్ను చూడవచ్చెను.

జోహానిస్సుబర్గులో అప్పుడు నడుపబడు దైనికపత్రికలన్నియు, గనుల ఖామందులగు యూరపియనులలో యెవరికో యొకరికి చెందియుండెను. కాని యీ ఖామందుల ప్రయోజన

ములకు ఆపద లేనప్పుడెల్లను, ప్రజాహితసమస్యలపై ఆపత్రికల సంపాదకులు స్వేచ్ఛగా తమ అభిప్రాయములను చెప్పవచ్చును. మిక్కిలి సమర్థులును ప్రసిద్ధులును మాత్రమే సంపాదకులుగా తీసుకొనబడిరి. ఎట్లన డైలిస్టార్ పత్రికా సంపాదకుడు పూర్వ మొకప్పుడు మిల్నరుప్రభువుకు అంతరంగిక కార్యదర్శిగా నుండెను. తదుపరి ఇంగ్లండుకు టైమ్సుపత్రికా సంపాదకుడుగా బకుల్‌స్థానే తీసుకొనబడెను. ట్రాన్సువాలు లీడరు సంపాదకుడు కార్డురైటు యెంతశక్తివంతుడో అంతఉదారుడు. తన పత్రికలో భారతీయోద్యమమును ఇంచుమించు యెల్లప్పుడును బలపరుచు చుండెను. ఆయన, నేను, మంచిస్నేహితుల మైతిమి. నన్ను చెరసాలకు పంపిన పిమ్మట ఆయన వెళ్లి స్మట్సుసేనానిని చూచెను. ఈయన మధ్యవర్తిత్వమునకు ఆయన సంతోషించెను. పిమ్మట కార్డురైటు భారతీయనాయకులను కలసెను. "మాకు చట్టపుచిక్కులు ఏమియు తెలియవు. గాంధి ఖైదులో నుండగా రాజీని గూర్చి మాట్లాడుట సాధ్యముకాదు. మేము పరిష్కారమునే కోరుచున్నాము కాని మావాళ్లు చెరసాలలో నుండగనే కావలెనని ప్రభుత్వము కోరినయెడల నీవు గాంధిని చూడవలెను. ఆయన అంగీకరించెడి యేర్పాటును మేము స్థిరపరచెదము" అని వారు కార్డ్‌రైటుతో చెప్పిరి.

ఈవిధముగా కార్డురైటు నావద్దకు చూడవచ్చెను. స్మట్సు వ్రాసిన లేక అంగీకరించిన సమాధానషరతులను పట్టుకొనివచ్చెను. ఆదస్తావేజులోని అస్పష్టమైనభాష నాకు

యిష్టముకాలేదు. అయినను ఒక్క మార్పుచేసి, దానిమీద సంతకము పెట్టుటకు తయారుగా నుంటిని. చెరసాలబైట నున్న వారి సమ్మతి కలదని యెంచినను, తోడిఖైదీలతో సంప్ర దించకుండ, సంతకము చేయజాలనని కార్డురైటుకు తెలిపితిని.

సంధి షరతుల సారాంశమేమనగా భారతీయులు యేచట్టముక్రింద కాకుండ ఐచ్ఛికముగా ధృవపరుచుకొన వలెను. ఆక్రొత్త ధృవపత్రములలో చేర్చు వివరములను భార తీయబృందముతో సంప్రదించి ప్రభుత్వమువారు నిర్ణయించ వలెను. భారతీయులలో అధికసంఖ్యాకులు ఐచ్ఛికముగా ధృవపరుచుకొనినయెడల ప్రభుత్వమువారు నల్లచట్టమును రద్దు పరచవలెను. ఐచ్ఛికధృవపత్రములను చట్టసమ్మతములు చేయ వలెను. చిత్తులో నల్లచట్టమును ప్రభుత్వము వారు రద్దుపరచ వలెనను షరతు స్పష్టముగా లేకుండెను. అందుచేత నాదృష్టి పథమునుండి అనుమానమునకు తావు లేకుండునట్లు చిత్తులో మార్పుచేయుమని సూచించితిని.

ఈ స్వల్పమైన పదమును కలుపుటకుగూడ కార్డురైటు యిష్టపడలేదు. "స్మట్సు ఇదియే ఆఖరుచిత్తు అని యెంచు చున్నాడు. దానిని నేను అంగీకరించినాను. మీరందరు తిరిగి ధృవపడినయెడల నల్లచట్టము తప్పక రద్దగునని నేను నీకు అభయము యివ్వగలను" అని కార్డురైటు చెప్పెను.

"సమాధానము కుదిరినను, కుదరకపోయినను నీదయ కును, సహాయమునకును కృతజ్ఞులము. అనవసరముగా ఒక

సవరణ నైనను జరుపవలెనని నేను కోరను. ప్రభుత్వముయొక్క ప్రతిష్ఠ నిలుపుటకు తగిన భాషకు నేను ఆక్షేపించను కాని అర్థమును గురించి నాకే అనుమానమున్నపుడు భాషలో మార్పును తప్పక సూచించవలెను. చివరకు సమాధానమే కుదిరినయెడల చిత్తును సవరించుహక్కు ఉభయపక్షములకు ఉండవలెను. ఈషరతులు ఆఖరు షరతులని చెప్పుచు స్మట్సు సేనాని మాకు అంత్యసందేశము పంపనక్కరలేదు. భారతీయులమీద నల్లచట్టమను ఒక తుపాకిని ఆయన ఇదివరకే గురిపెట్టి యున్నాడు. రెండవది గురిపెట్టి యేమిలాభము పొంద ఆశించగలడు." అని నేను జబాబు చెప్పితిని.

ఈవాదమునకు కార్డురైటు యెదురు చెప్పలేకపోయెను. నాసవరణ సూచనకు స్మట్సుకు చూపింతునను వాగ్దత్తము చేసెను.

నాతోడి ఖైదీలను సంప్రతించితిని, వారు గూడ ఆభాషకు ఇష్టపడలేదు. కాని స్మట్సు నాసవరణను అంగీకరించినయెడల సమాధానమును ఒప్పుకుందుమనిరి. బైటనుండు వారి సమ్మతికై వేచియుండక యుక్తమైన రాజీని నేనంగీకరించవలెనని బైటనాయకులవద్దనుండి సందేశమును క్రొత్తగా ఖైదుకు వచ్చినవారు తీసుకొనివచ్చిరి. నాతోగూడ క్వీన్, తంబినాయుడుగార్ల చేత దస్కతులు చేయించి చిత్తు కార్డురైటు చేతికి యిచ్చితిని.

రెండవ లేక మూడవరోజున ౩౦-౧-౧౯౦౮ తేదిన జోహనిస్బర్గు పోలీసు పైఅధికారి వర్నన్, స్మట్సును చూచుటకై నన్ను ప్రెటోరియా తీసుకొనిపోయెను. ఆయనతో చాలసేపు మాట్లాడితిని. తనకు కార్ట్రైటుకు మధ్య జరిగిన విషయములు ఆయన నాతో చెప్పెను. నేను చెరసాలకు పోయిన పిమ్మట భారతీయబృందము స్థిరముగా నున్నందుకు ఆయన నన్ను అభినందించెను. "నీప్రజలయెడ అయిష్టతను నేనెన్నడును యుంచుకొనజాలను. నేనును న్యాయవాదినని నీవెరుగుదువు. భారతీయవిద్యార్థులు నాతో సహాధ్యాయులుగా నుండిరి. కాని నాకర్తవ్యమును నేను చేయవలెను. యూరపియనులు యీచట్టమును కోరుచున్నారు. వీరు హెచ్చుమంది బోయర్లు కారు, ఆంగ్లేయులు అని నీవు నాతో ఒప్పుకుందువు. చిత్తులో నీవు చేసిన సవరణను నేను అంగీకరింతును. నేను బోధాసేనానికూడ సంప్రదించితిమి. మీలో హెచ్చుమంది ఐచ్ఛికముగా ధృవపడినవెంటనే, నేను ఆసియావాసుల చట్టమును రద్దుపరిచెదను అని నీకు అభయమిచ్చుచున్నాను. మీధృవమును చట్టసమ్మతము చేయునపుడు ఆచట్టముయొక్క చిత్తును నీవిమర్శన నిమిత్తము పంపుదును. ఇట్టి చిక్కులు తిరిగి కలుగవలెనని నేను కోరను. నీప్రజల భావమును గౌరవించకోరెదను." అని స్మట్సు చెప్పెను.

ఇట్లు చెప్పుచు స్మట్సు లేచెను. "నేనెక్కడికి పోవలెను, తక్కిన ఖైదీల సమాచారము యేమి?" అని నేను ఆయన నడిగితిని.

సేనాని నవ్వెను "నీవు యీనిముషముననే విముక్తుడవు. తక్కిన ఖైదీలను రేపుఉదయము విడుదల చేయుమని చెరసాల అధికారులకు ఫోను చేయుచున్నాను. కాని అనేకసభలుగాని ప్రదర్శనములుగాని చేయవద్దని సలహానిచ్చెదను. అట్లు చేసిన యెడల ప్రభుత్వముస్థితి చిక్కుగానుండును" అని స్మట్సు చెప్పెను.

"సభచేయునిమిత్తమే (పనిలేకుండా) ఒక్క సభ యైనను చేయనని నీవు నమ్మవచ్చును. కాని యీ సమాధానము యెట్లుచేయబడినదియు, దాని స్వభావమేమనియు, ఉద్దేశ్యమేమనియు, మాబాధ్యతలను యెట్లుపెంచుచున్నదియు భారతీయబృందమునకు వివరించుటకై నేను తప్పక సభలు చేయవలెను" అని నేను జవాబుచెప్పితిని.

"అట్టి సభలు నీవు కోరినన్నిచేయవచ్చును. ఈ విషయములో నా కోరికను నీవు గ్రహించితివి చాలును" అని స్మట్సు చెప్పెను.

అప్పుడు రాత్రి యేడుగంటలైనది. నాజేబులో పైసా అయినను లేదు. జోహానిస్సుబర్గు పోవుటకు ప్రయాణపుఖర్చు

స్మట్సు కార్యదర్శి నాకు యిచ్చెను. ప్రెటోరియాలో నిల్వ యుండి అక్కడి భారతీయులకు యీ పరిష్కారము ప్రకటించుట అనవసరము. నాయకులందరు జోహానిస్సుబర్గులో యుండిరి. అది మా కార్యస్థానము. జోహానిస్సుబర్గుకు ఇప్పుడు ఒక్కబండియే యుండెను. దానిని నేను అందుకొనగలిగితిని.

ప్రథమ భాగము

సంపూర్ణము



శ్రీ అద్దేపల్లి లక్ష్మణస్వామి నాయుడు గారిచే
రాజమండ్రి, సరస్వతీ పవర్ ప్రెస్‌నందు ముద్రితము.
OR. No. 1880—1940.



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA111B134 |
| పుస్తకం పేరు | దక్షిణాఫ్రికా సత్యాగ్రహము |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 285 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | iv, ii |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Vedavathi |
| పేజీలు విడదీసినది | Vedavathi |
| స్కాన్ చేసినది | Haseena |
| పరీక్ష చేసినది | pragathi |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |